శ్రీ ర స్తు.

# సీ తా రా మ రా మా య ణ ము

షోడశోత్తరశతాధికసహస్రగద్యపద్యాత్మకము

ఉత్తరకాండతో

ఏడుకాండలుగల సంపూర్ణరామాయణము.

ఇ ది

తూ ము సీ తా రా మ దా సు చే

రచింపఁబడినది.



రెండవకూర్పు

చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచేఁ

ప్ర క టి త ము.

1940

# ద్వితీయముద్రణ పీఠిక

ఈరామాయణము మొదట సహస్రగద్యపద్యాత్మకముగ రచించి ముద్రింపించితిని. ఆవల శ్రీకృష్ణునిచరిత్ర మొకటి "శ్రీకృష్ణకథాసుధ" యనుపేరున షోడశోత్తరశతాధికసహస్ర గద్యపద్యములతో రచించితిని. ఇది ధనలోపముచే ముద్రింపఁబడదయ్యె. ఐనను శ్రీకృష్ణునిచరిత్రము వేయినూటపదారు గద్యపద్యములతో నున్నపుడు శ్రీరామునికథయు నట్లె యుండనొప్పు నను తలంపొదవి తక్కిన నూటపదారు గద్య పద్యములును రచించి యచ్చుపడియున్న యీగ్రంథమున యుక్త స్థలములఁ జేర్చితిని. అట్లు శ్రీరామకృష్ణులకటాక్షంబున రెండుగ్రంథములును సమముగ నొక్కొకటి వేయినూటపదారు గద్యపద్యములతో నొప్పుచుండుటకు మిగుల సంతసించితిని.

ఇప్పుడు వృద్ధిసేయఁబడిన రామాయణంబున—

| | |
|---|---|
| ఉపోద్ఘాతమున గద్యపద్యములు | 21 |
| బాలకాండమున ... ... | 110 |
| అయోధ్యాకాండమున ... .. | 95 |
| అరణ్యకాండమున ... ... | 138 |
| కిష్కింధాకాండమున ... ... | 79 |
| సుందరకాండమున ... ... | 151 |
| యుద్ధకాండమున ... ... | 338 |
| ఉత్తరకాండమున ... ... | 184 |
| మొత్తము | 1116 కలవు. |

ఈరామాయణద్వితీయముద్రణమును, శ్రీకృష్ణకథా సుధ ప్రథమముద్రణమును బొందుభాగ్యమబ్బుటకు శ్రీరామ కృష్ణులకృపారసప్రసార మెప్పుడు కలుగునో యని నిరీక్షించు చుండ దైవికంబుగ శ్రీకవితిలకేత్యాది బిరుదాంకిత యగు కనకాంబగారు నేనివసించియున్న శ్రీభద్రగిరి క్షేత్రంబునకు శ్రీరామదర్శనార్థము వచ్చుటయు నామె మద్రచిత గ్రంథములఁ జదివి చూచి యాగ్రంథములు చెన్నపురిలో శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి ముద్రణాలయములో ముద్రింపఁబడుటకుఁ బ్రయత్నించెదననియుఁ జెప్పి వెళ్లుటయుఁ దటస్థించెను. ఆవల శ్రీరామచంద్రపరబ్రహ్మ మెవ్వరిహృదయంబుల నెట్టి యుత్సాహము కలిగించెనో యాకవితిలక శ్రీశాస్త్రులవారితో నేమిమాటాడెనో కాని శ్రీశాస్త్రులవారు మద్రచితమైన రామాయణద్వితీయముద్రణ ముచితముగ ముద్రించి నాకునూఱుప్రతు లిచ్చుటకును దక్కిన ప్రతులు వారు తమయిష్టానుసార ముపయోగించుకొనుటకును నంగీకరించి నాకుఁదెలుపఁగా నేనందుల కియ్యకొని వారికి కాపీరైట్టు నిచ్చితిని.

ఈకార్య మిట్లు నెఱవేఱుటకుఁ గేవలము భగవత్ప్రేరణమే మూలకారణ మైనను నాదేవుని సంకల్పము ప్రవర్తిల్లుటకు ముఖ్యకారణభూతులును బరోపకారపరాయణులును భగవద్భక్తాగ్రేసరులు నగు శ్రీకవితిలక కంచనపల్లి కనకాంబ

గారికిని శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికిని నాకృతజ్ఞతాభి వందనములు సమర్పించుచున్నాఁడను.

ఇట్లు,

భద్రాద్రి
7-6-1940.

భగవద్దాసానుదాసుఁడు,
తూము సీతారామయ్య,
*Retired Taluq Head Accountant & Pleader.*

# పీ ఠి క

ఈ గ్రంథము గద్యపద్యసహస్రపరిమితమైనది. రామాయణమంతయు నుత్తరకాండముతోఁ గూడ సంగ్రహముగ వ్రాయఁబడినది.

ఇందు, నుపోద్ఘాతముతోఁ గూడిన

| | | | |
|---|---|---|---|
| బాలకాండమున | ... | ... | 127 గద్యపద్యములును |
| అయోధ్యకాండమున | ... | ... | 82 |
| అరణ్యకాండమున | ... | ... | 127 |
| కిష్కింధకాండమున | ... | ... | 71 |
| సుందరకాండమున | ... | ... | 134 |
| యుద్ధకాండమున | ... | ... | 337 |
| ఉత్తరకాండమున | ... | ... | 122 |
| | మొత్తము | | 1000 కలవు. |

ఇందు భాషాచమత్కృతులు దీర్ఘసంస్కృతసమాసములు, విచిత్రవర్ణనములు మున్నగు పాండిత్యప్రాగల్భ్యము లంతగ లేక సులభములైనవాక్యములతో ముఖ్యకథాంశములన్నియుఁ బొత్తుపరుపఁబడియున్నవి. కాన నిది పండితపామరజనులందఱకు నంగీకారమయ్యెడుఁగాత.

ఈగ్రంథము జాగ్రతగాఁ జదివి పరిశీలించినవా రీక్రింద వివరించినపద్యములలోఁ దమభావమును వెల్లడించిరి.

ఉభయభాషాప్రవీణ శిరోమణి
జటావల్లభుల సూర్యనారాయణశాస్త్రి,
భద్రాచలం, బోర్డుహైస్కూలు, సహాయాంధ్రోపాధ్యాయులు.

క. శ్రీతూము వంశసోముఁడు
సీతారాముండు తా రచించిన యీ శ్రీ
సీతారాములచరితము
భూతలిపై సత్ప్రసిద్ధిబొందును గాతన్. 1

ఉ. ముద్దులుమూటగట్టుపదముల్ కవిరాజులకైనఁ దప్పులం
దిద్దెడుభావచాతురియుఁ దేటతెనుంగుపదాలగుంభనల్
నిద్దుర నాకలి న్మరచి నిశ్చలచిత్తత నాలకింప నా
పద్దెములుల్ గలట్టి యిటువంటికృతి న్గనుభాగ్య మల్పమే. 2

సీ. ధృతసువర్ణచ్ఛవిఁ కాంతిఁ దేజరిల్లెడు దీని
దుష్టపండితుఁ డేలఁ దూలనాడు
శార్దూలమత్తేభసంకీర్ణమగు నిందు
క్షుద్రపండితుఁ డెట్లు చొరఁగలండు
భాస్వరాలంకారపరిపూర్ణమగు దీని
కేవంక దుష్కవు లెంచఁగలరు
రసపరిపూర్ణమై రాజిల్లు దీనిని
దుర్విమర్శకుఁ డెట్లు దూర నెంచు

తే. న్యాయబుద్ధిని పీడక నాకుఁ గలుగు
శక్తి కొలఁదిని దీనిని జదివినాఁడ
దోషమేమియు నాకిందు దొరకలేదు
కాన సత్కావ్యముగ దీని గణనసేతు.

ఉభయభాషాప్రవీణ
మిన్నికంటి గురునాథశర్మ,
ఆంధ్రోపాధ్యాయుఁడు, టౌన్ హైస్కూలు, గుంటూరు.

మ. భళిరే ముద్దులమూటగట్టు పదముల్ స్వాంతంబుసొక్కించు
నిర్మలభావంబులు తెంపుసొంపడని ధారాశుద్ధిశీర్షంబుల
ల్లలనూగించెడి శైలిజాల్కొను రసోల్లాసంబు మీయాకృతిన్
దలకట్టై తనరారెఁ దూముకుల సీతారామవిద్వన్మణీ. 1

తూము సీతారామయ్య,
గ్రంథకర్త.



శ్రీ ర స్తు.

# సీ తా రా మ రా మా య ణ ము

## పీ ఠి క.



మద్భూతనయాభిరామ, త్రిజగ
త్సేవ్యప్రభోద్ధామ, మో
క్షామోదప్రదనామ, పాతకవిరా
మా, భవ్యదీవ్యద్గుణ
స్తోమా, భద్రనగేంద్రధామ, ఖలర
క్షోవీరసంహారసం
గ్రామా, శ్రీరఘురామ, భక్తజనహృ
త్కామా నమో రాఘవా. 1

శా. జ్ఞానానందమయస్వరూపివగుచున్ సంధిల్లు బ్రహ్మంబవు
న్నానాసృష్టిలయక్రముండ వగుచున్ రాజిల్లు విష్ణుండవున్
దీనత్రాణపరాయణుండ వగుచున్ దీపించు శ్రీరాఘవ
క్ష్మానాథుండవు నైన నీకు నతులన్ సద్భక్తిఁ గావించెదన్. 2

శా. నీనాభీకమలంబునన్ జననమై నీయాజ్ఞచే లోకసం
ధానక్రీడఁ జరించు నీరజభవున్ దత్కాలమం దుద్భవం

బై నీయానతి సృష్టినాశనకరోద్యత్కర్మమం దొప్పు గౌ
రీనాథుఁ వినుతించి మ్రొక్కెద మనఃప్రీతిఁ శుభప్రాప్తికై.

మ. హరివక్షఃస్థలవాసినై కలుషితవ్యాపారులన్గాడసత్కరుణన్
బ్రోవుమటంచు నాథునకు వేడ్కన్దెల్పు మాయమ్మయిం
దిర మత్కావ్యము దివ్యమాగతి రసాప్తిన్గూర్చి మద్రక్షణం
బఱలేకుండ ఘటించుఁగాతమని సాష్టాంగంబులన్ జేసెదన్.

ఉ. వాణికి, నీలవేణికి, శుభప్రదసర్వవిధోజ్జ్వలత్కళా
శ్రేణికిఁ బద్మసంభవుని చిత్తము దొంగిలినట్టి జాణయా
రాణికి, సాగి మ్రొక్కెదఁ దిరంబగుభక్తి మదీయకావ్య ని
ర్మాణమునందుఁ దోడ్పడుచు మద్రసనాంతరమందు రాజిలన్.

మ. కలిగె న్నామదిఁ గోర్కె సంగ్రహముగాఁ గాకుత్థ్సభాస్వ
త్కథన్, దెలుఁగుం బద్దెములన్ రచింప, నయినన్ విద్యా
రసప్రౌఢి నం,దుల కర్హంబుగఁ గాంచలే దెటులనో నో
తల్లి బ్రాహ్మీ! భవ, ద్విలసత్సత్కృపదక్క లేదుగతి రావే
మత్సహాయార్థమై. 6

మ. ప్రళయంబందు సమస్తలోకముల విధ్వంసంబు గావింపఁగాఁ
గలరుద్రార్ధశరీరమున్ బొడివి వేడ్క న్వెల్గుచున్ రౌద్రసం
కలితస్వాంతవు కాక నిర్మలకటాక్షశ్రీ విరాజిల్లెదో
కలుషధ్వంసిని శాంభవీ కరుణ మత్కావ్యంబు సాగింపవే. 7

శా. ఈకావ్యంబు రచింపుచున్నెడల నెంతేనిన్ దటస్థించు నే
మోకష్టప్రతిబంధరాసులవి రాకుండన్ గటాక్షించి య
స్తోకప్రౌఢిఁ దనర్చి యీకృతి బుధస్తోత్రార్హమై సత్వరన్
సాకల్యంబుగఁ బూర్తినొందుటకు విష్వక్సేనుఁ బ్రార్థించెదన్.

ఉ. జ్ఞానవిరాగచిత్తుఁడయి సమ్మతి భద్రనగంబుఁ జేరి నీ
మానితపాదయుగ్మమును మండితభక్తి భజించి యర్థముల్
మేనును నీకొసంగె నతినిష్ఠను నా పెదతాత తూము ల
క్ష్మీనరసింహదాసతనికిన్ వినయంబునఁ జేసెదన్నతుల్. 9

శా. నామాతాపితలైన దేవసములన్ ధన్యాత్ములన్ జానకి ద్రన్
రామాఖ్యాకుల భక్తియుక్తమతినై ప్రార్థించుచున్ మ్రొక్కె
త్రే మన్నన్గని నాదుసత్కవిత వర్ధిల్లంగ నాశీర్వచ
స్తోమంబున్ బహుపుత్రవత్సల మనశ్శుద్ధిన్ బ్రసాదింపఁగన్.

మ. అమలజ్ఞానిని సంస్కృతద్రవిడవేదాంతోజ్జ్వలత్వాకరున్
విమలున్, వైష్ణవవర్య ధీవరుఁ ద్రిదండిన్ భవ్యరామా
నుజా,ఖ్య మహిన్ గాంచిపురంబున న్వెలిఁగి దివ్యద్వష్ఠ
లోకంబునన్, ముదమొప్ప న్దనరారు మద్గురుపదంబుల్
హృద్గతిన్నిల్పెదన్. 11

ఉ. నన్నయతిక్కనాదికవినాథులకున్ బ్రణతుల్ ఘటించి వి
ద్వన్నికరాళికంజలులు భక్తినొనర్చి నవీనసత్కవుల్
మన్ననసేయుఁడంచుఁ దగుమాటల స్తోత్రము సేసి దోషముల్
పన్నకుఁడంచు దుష్కవులఁ బ్రార్థనసేసెద నిష్టసిద్ధికిన్. 12

సీ. దశశతకంబులు త్వద్భక్తి వ్రాసితి
నచ్యుత! నీచరణార్పితముగ
భద్రాద్రిరామ నీభవ్యమహత్వంబు
గణనసేసితి నొక్కకావ్యమందు
గీతామృతార్థంబు గీల్కొల్పితిని బద్య
ములయందుఁ గీర్తనావళులయందు

నిం కెన్ని కృతులనో యీశు నిన్గూర్చి
రచియించితిని బహుకర్తిమించి

తే. యెన్ని వ్రాసిన నీకటాక్షేక్షణంబుఁ
జూపవైతని నీదు విశుద్ధకథను
జాలియో చాలకయొ యెట్లొ సంగ్రహముగ
వ్రాయ నెంచితి గలుషనివారకముగ.

సీ. పాలుండ గోల్కొండ వ్యాపారివైష్ణవ
మతవర్తనుఁడ బుధహితగుణుండ
భద్రాచలేశ ! నీపాదాశ్రయుఁడఁ బరా
శరవిలసద్గోత్రసంభవుండఁ
దూము సీతారాము నాముఁడ జానకీ
రామదంపతుల గారాబుసుతుఁడఁ
గృష్ణదాసాహ్వాయ క్షితిసురపౌత్రుండ
భద్రాద్రిపురవరవాసరతుఁడ

తే. నాంధ్రమున నాదుశక్తికి నందునటుల
రామచారిత్ర మొకటి సంగ్రహముగాఁగ
వ్రాసి దుష్కర్మబంధకపటలిఁ బాసి
యమలగతి నొందుతలఁపు నామతిని బుట్టె.

ఉ. శ్రీరఘురామసత్కథను జెల్వుగ నెందఱొ పండితోత్తముల్
చాపతరంబుగా నవరసంబులుగుల్క రచించియుండనిం
డారుకవిత్వసంపదల నంచని నీవెటు లారఘూద్వహా
పారకథాబ్ధి నీఁదెదని పల్కుదురేమొ కవీంద్రశేఖరుల్. 15

ఉ. "అక్కనమాదనాఖ్య మహితామలకీర్తిసమేతులందలం
బెక్కరటంచు సర్వయయు నెక్కొనుసాటికిఁ జెర్వుకట్ట" యం

చొక్కపురాతనోక్తి వెలయున్నవ యట్టులె భాస్కరాది పెం
పెక్కు కవుల్ రచించిరని యేను గడంగితి దీని నైజ్ఞరే. 16

చ. అది యటులుండ రామచరితామృతసారము నెవ్వరిచ్చినన్
ముద మొదవించుఁగాని రుచిపోవునె, యంతియకాక పాప
ముల్, విదళన మాచరింపఁగల విష్ణులసచ్చరితప్రసంగముల్
సదమలవాక్యసంపద లెసంగకయున్ గుణమొప్పకుండునే.

సీ. వక్రగతిని బొంది వర్ధిలుమాత్రన
జెఱకుమాధుర్యంబు తఱఁగిపోనె
మసికుప్పలోఁబడి మసలెడుమాత్రన
మాణిక్యసత్ప్రభ మందమగునె
పాపిహృద్గుహయందు వసియించుమాత్రనఁ
బరమాత్మమహిమంబు పాటిచెడునె
జలధరమండలం బలమినమాత్రనఁ
బ్రద్యోతనునికాంతి భంగపడునె

తే. యటుల మద్రచితంబయి దిటవుఁగనని
యీకృతిని దోషసముదాయ మెంతయున్న
రామచంద్రకథాసుధ క్రాలుకతన
హృద్యమగుఁగాదె యిది సాధుహృదయములకు.

గీ. ఇటుల డెందము నెంతయు దిటముపఱచి
రామచంద్రునిచరితావిరచనమందు
నెంతయును వేడ్కతనరి సీతేశునందు
భారమంతయుఁ బెట్టి నేఁ బరమభక్తి.

క. రామునకు నిరతనతసు
త్రామునకుఁ బయోధిమదవిరామునకు బుధ
స్తోమ క్షేమంకరగుణ
ధామునకుఁ భద్రశైలతలధామునకున్. 20

క. అరిదరధనురుగ్రాంబక
ధరునకు సీతాయుతాంకతలరుచిరునకుఁ
గరుణాకరునకుఁ బీతాం
బరునకు లక్ష్మణసదానుభవసుకరునకున్. 21

వ. సమర్పణంబుగా నేనొనర్పంబూనిన సీతారామరామాయణ కావ్యంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:—



# బాలకాండము.

## కథాప్రారంభము.

ఉ. రావణకుంభకర్ణముఖరాక్షసవీరులు ధర్మదూరులై
దేవతలన్ ధరాజనతతిన్ మఱి దక్కిన ప్రాణికోటులన్
వేవిధులన్గలంచు చవివేకబలోన్మదులై చరించుటన్
భూవలయంబునన్ సకలభూతచయంబులు స్రుక్కె భీతిచేన్.

సీ. రావణాసురునిచే రణమునఁ గూలక
త్ర్యపకృతిఁ గనని రాజవని లేఁడు
దశకంఠు కన్దృష్టిఁ దప్పి సుశీలయై
మనినట్టిసుందరి మహిని లేదు
వింశతిబాహునివిధులఁ దప్పి చరించి
బ్రదికినసన్మౌని వసుధ లేఁడు
లంకేశుపాదంబులకు మ్రొక్కులిడనట్టి
యమరుండు సురలోకమందె లేఁడు

తే. జన్నముల మాన్పెఁ గులధర్మసమితిఁ జెఱిపె
దివిజపతిఁ బట్టె బాధించె దిక్పతులను
జనులఁ జీమలగతిఁ గాళ్లఁ జమరి చంపె
నెందు లేఁడయ్యె వాని జయించువాఁడు. 2

వ. ఇట్టిబాధలు పడిపడి, పడలేక నరులు సురలఁ బ్రార్థింప, సురలు భయాతురులై పరమేష్ఠిచెంత కేగి విన్నవింపఁ బర

మేష్టియుఁ దరణోపాయంబుఁ గానక సకలలోకత్రాణపరా
యణుండగు నారాయణుఁ దనచిత్తాబ్జంబున ధ్యానింప,
నాదేవుం డజునిమనోంబుజంబున సాక్షాత్కరించి తా దశ
రథక్ష్మానాథుసతీత్రయంబునందుఁ బుత్రచతుష్కంబుగాఁ
బుట్టి రావణాదుల సంహరించి భూభారం బడంచెద, దేవ
తలు స్వాంశంబుల బలాఢ్యులగువనచరులఁ బుట్టింపుఁడని
యానతిచ్చి యదృశ్యుండయ్యె నంత. 3

క. శ్రీనాథునాజ్ఞ సురలకు
నానళినోద్భవుఁడు తెల్ప నాత్మ నలరుచుఁ దా
వే నిర్గమించి రమరులు
దానవసంహరణ మింకఁ దప్పదటంచున్. 4

సీ. పద్మజాంశను జాంబవంతుండు జన్మించె
భల్లుకేశ్వరుఁడయి బలమెసంగి
మరుదగ్నిరుద్రాంశ లిరవొందఁ బ్రభవించె
మారుతి కపికులమణి యనంగ
నింద్రాంశ వాలియు నినునంశ సుగ్రీవుఁ
డవతరించి రగచరాధిపులుగ
నీలుఁ డనలునంశ నెగడి జన్మించెను
విశ్వకర్మాంశుఁడై వెలసె నలుఁడు
తే. ఇటుల సురలెల్లఁ దమయంశ లేర్పడంగ
నవనిఁ బుట్టించి రందంద యగచరులను
వారలందఱకధిపుఁడై పరఁగె వాలి
యవనిఁ గిష్కింధ యనుపురంబందు నంత.

క. ధరణికి మండనమగుచున్
స్థిరతరసంపదలచేఁ బ్రసిద్ధివడయుచున్
బరగె నయోధ్యాపత్పుర
వరము దశరథక్షితీశపాలిత మగుచున్. 6

ఉ. ఆనరపాలుఁ డన్ని విషయంబుల భాసురమూర్తియయ్యునున్
సూనులు లేక, యన్నియును జొప్పడి గ్రాదుదవకానియట్టి
యా,మానినిపోల్కి దుర్వ్యథల గ్రుగ్గుచు సంతతిఁగూర్చు
యజ్ఞమే,దైన ఘటింపఁజేయుఁడని యార్తిని వేఁడె వసిష్ఠ
ముఖ్యులన్. 7

క. ఆమునులు మంత్రులంతట
భూమీశుని కోర్కె సిద్ధిఁ బొందునుపాయం
బేమఱక తలఁచి యొకపవ
నౌ మార్గముఁ జూపిరిటు ధరాధీశునకున్.

సీ. రోమపాదుండను భూమీశ్వరుఁడు తన
యంగదేశము క్షామమంది జనులు
వర్షముల్లేక విపద్భాజులయి గ్రుగ్గు
టెఱిఁగి విభండక ఋషికుమారు
ఋష్యశృంగుని నాదరించి వేఁ రావించి
తనకూఁతుశాంత నతనికొసంగి
పరిణయంబొనరింప బాధలన్నియుఁబాసి
వెలసె దేశంబు సుభిక్షమగుచు
తే. నామునీశ్వరుఁ డతిమహిమాన్వితుండు
గాన రాజేంద్ర! యిటకు నాఘనుని దెచ్చి

పుత్రకామేష్టిఁ జేయుచోఁ బొందఁగలవు
సుతులనంచు వచించిరా శుద్ధమతులు.

వ. అంత నాదశరథుండు పరమానందభరితుండై రోమపాదు పాలికిఁ జని తద్భూవిభుఁ బ్రార్థించి శాంతాసహితుండైన ఋష్యశృంగు నయోధ్యకుఁ దోడ్తెచ్చి మాధవప్రీతిగా నొక యశ్వమేధంబును మనోభీష్టప్రాప్తిదంబైనఁ బుత్రకామేష్టియుఁ గావించి తన సతీత్రయంబుతోడ నతిపవిత్రుండై యుండ.

గీ. హోమకుండంబునుండి మహోగ్రకీల
లెసఁగ నొకభాసురాకారుఁ డేగుదెంచి
దివ్యపాయసపూర్ణమై తేజరిల్లు
భర్మపాత్రంబు నొకఁటి భూవరునకిచ్చి.

క. భూపా! యీపాయసమును
నీపత్నీత్రయము తినఁగ నియతినొసఁగుమీ
శ్రీపతినిబోలు విలస
ద్రూపగుణబలాధికుల సుతులఁ గనెదంచున్.

క. ఎఱుఁగఁబలికి యాతఁ డగో
చరుఁడయ్యెను దశరథుండు సమ్మతిఁ దనము
ప్ప్వరుసతులకుఁ దత్పాయస
పరమాహారంబు నిట్లు పంచి యొసంగెన్.

క. సగభాగముఁ గౌసల్య కొ
సఁగి కైకకుఁ దక్కుసగ మొసంగి మరల నా
సగములు రెంట సుమిత్రకు
సగము సగ మొసంగె రాజు స గతిన్.

వ. అంత నాకాంతలు కుతూహలస్వాంతలై పాయసభక్షణంబు గావించి చింతలు విసర్జించి పతిని సేవించుచుండఁ గొలఁది కాలంబున నాసతీత్రయంబు గర్భ ... బు దాల్చి నవమాస స్ఫూర్తినొంద నంత. 15

మ. ఉదయాద్రిన్ రవితోఁచినట్టుల దశాస్యోదగ్రదర్పక్షయా స్పదుఁడున్ భక్తశరణ్యసత్పదుఁడు దేవవ్రాతసంరక్షణ ప్రదుఁడున్ శ్రీరమణీమణీధవుఁడు భూభారాపనస్థైర్యసం పదఁ గౌసల్యకుఁ జైత్రశుద్ధ నవమిన్ భాస్వద్గతిన్ వెల్వడెన్.

క. మఱునాఁడు కైకకడుపున
సురుచిరశంఖాంశ ఖలనిషూదనుఁడగుచున్
సరసీరుహాక్షుఁడొదవెను
హరివాసరమున సుమిత్రయందున వరుసన్. 17

క. ఇరువురు బాలురుగా శ్రీ
హరియే జన్మించె శేషునంశ నొకండై
వరచక్రాంశనొకండై
ధరణీతలి దుష్టదైత్యదమనప్రభతోన్. 18

వ. ఇట్లు తననారులయందు స్మరకోటిసమానాకారులగు నల్వురు కుమారులు జన్మింప బ్రహ్మానందపరవశుండై దశరథుండు వసిష్ఠానుమతి మహోత్సాహంబున జాతకర్మాద్యుత్సవంబులు కావించె నంత. 19

క. ఆకౌసల్యాసుతునకు
శ్రీకరమఘనాశకరము స్థిరతరభవమో
క్షాకరమునైన రామా
ఖ్యాకము సంధించె మౌని హర్షాన్వితుఁడై. 20

గీ. భరతుఁడను పేరుఁ గైకేయిపట్టికొసఁగి
వరుస లక్ష్మణశత్రుఘ్న భాసురాభి
ధానములఁబెట్టెను సుమిత్రతనయులకు ధ
రాతలేశుఁడు హర్షవారాశిఁ దేల.

చ. దినదినవర్ధమాన ఘనతేజము రాజిల నాన్నృపాత్మజుల్
జనములకెల్ల సమ్ముదమెసంగ వయోబలవాక్సమృద్ధులై
మనుచు సమస్తవిద్యల నమానుషలీలగ్రహించి యస్త్రశ
స్త్రనికరసత్ప్రయోగముల దక్షతఁగాంచిరి దుర్లభక్రియన్.

క. రాముఁడు లక్ష్మణుఁ డొకకవ
గా మనుచుండిరి సమస్తకార్యగతులన
ట్లే మనిరి తక్కునిర్వురుఁ
బ్రేమ సకలవిధులలో నభేదస్థితులన్. 23

మ. పదియేనేండ్లవయస్సుకల్గి యసమప్రౌఢిన్ ధనుర్వేదమిం
పొదవన్నేరిచి శత్రునాశకర శౌర్యోత్సాహదోస్సారసం
పద రాజిల్లుచుఁ దల్లిదండ్రులకు సేవల్ సేయుచున్ బౌరులన్
ముద మొందించుచుఁ గోటిమన్మథకళాస్ఫూర్తిన్ బ్రకాశించు
చున్. 24

వ. ఇట్లు సకలలోకంబులకుఁ బ్రియంబుసేయఁగల దివ్యగుణ సామర్థ్యంబులుకల్గి వర్ధిల్లుచుండ విశ్వామిత్రుండొక్కనాఁడు.

క. పరమాత్ముఁడయినహరి దా
శరథియయి యయోధ్యనుండు చంద మెఱిఁగి త
త్పరమారాధనపరుఁడయి
యరిగెన్ దశరథునిగాంచ నత్యుత్సుకుఁడై.

క. జనపతి గాధేయుని రా
కనుగని యెదురేగి మ్రొక్కి కడువినయముతో
డను నర్ఘ్యపాద్యముఖవిధు
లనెరపి కూర్చుండఁబెట్టి లాలన మెుప్పన్. 27

క. స్వామీ మీరిటవచ్చుట
చే మాకు మహాశుభంబు చేకుఱె నన్నీ
రేమి వరించిన నిచ్చెదఁ
గామితమును దెల్పుఁడంచు క్ష్మాపతి పల్కన్. 28

చ. అలరి మునీంద్రుఁ డిట్లనియె నానరనాథునితోడ నీదు స
ద్విలసితసత్యవాక్పరత విశ్రుతధర్మగుణాభిలాష నేఁ
దెలిసియె కాదె యిప్పు డరుదెంచితి నీకడకంచుఁబల్కి కా
వలసిన కార్యముం దెలియఁ బల్కెదనంచు మునీంద్రుఁ
డిట్లనెన్.

క. నే నెపుడు క్రతువొనర్పఁగఁ
బూనిన రాక్షసులు విఘ్నముల్గలిగింపన్
మానక వత్తురు వారల
భూనాయక త్రుంచి క్రతువుఁ బోషించుటకై.

క. నీయగ్రతనూభవుఁ డస
హాయబలుఁడు దుష్టదైత్యహర్త నిజముగా
నాయజ్ఞ రక్షకయ్యతఁ
డే యర్హుఁడు పంపుమో నరేశ్వర యతనిన్.

క. బాలుండని సంశయమునఁ
దూలకు మాసుతుని భూరి దోర్బలమహిమం

జేల వచింప వసిష్ఠుని
నాలోచనసేయఁ దెలియు నంతయు నీకున్.

క. మఱి వజ్రకవచమై నేఁ
బరిరక్షణసేసి నీదుపట్టిని శుభసం
భరితు నొనర్చెద భయమున్
దొఱఁగి పనుపుమయ్య రాము దోర్బలభీమున్.

క. అన విని దశరథుఁ డాత్మను
"మనవికిఁ బోవఁగ మశీదు మఱివిఱిగి శిరం
బునఁబడె" నన్నట్టుల న
య్యె సహాయని కలఁగి యిటు మునీశునకనియెన్.

క. ఆరాత్రించరు లెవ్వరు
ఘోరరణారంభు లట్టి క్రూరులతోడన్
బోరఁగలఁడె పసిబాలుఁడు
కారుణ్యముఁ జూపవయ్య కాకుత్థ్సునిపై.

క. అన విని ముని యిట్లనె నా
దనుజులు రావణునిమంత్రితనయు లుదగ్రుల్
ఘనబలులు రామునకుఁ ద
క్కన్ నొరుల కవ్వారిఁ గూల్పఁగా రాదనినన్.

క. క్షితిపతి యానుడువుల విని
మతిసెడి మూర్ఛిల్లి లేచి మౌనీంద్రునితో
సుతుఁ బంపనోపఁ గరుణా
న్వితమతి క్షమియింపుమనిన విని ముని యంతన్.

క. అనృతం బాడవటంచున్
గని నిన్నిటు గోరితిని సుఖంబుగ నింకన్

మను మేఁ బోయెదనని లే
చిన జగములు బెగ్గడిల్లె క్షితి కంపించెన్. 38

వ. అంత దశరథుండు వసిష్ఠు రావించి యడుగ నాతండు రామునిపరాక్రమంబు లుగ్గడించి యాతని నిర్భయంబుగఁ బంపుమని బోధింప రాజవశ్యం డియ్యకొని విశ్వామిత్రుఁ జీరి క్షమాపణంబుఁ గోరి రామలక్ష్మణులఁ బంపెదనని చెప్పె.

క. ఆసుతులఁ దోడితెమ్మని
వే సచివుని నొకనిఁ బంపఁ బ్రీతి నతండా
భాసురమన్మథరూపవి
లాసుల శ్రీరామచంద్రలక్ష్మణులఁ దగన్. 40

ఉ. చీరి ధరేశునాజ్ఞ వినఁజెప్పిన వారలు దివ్యబాణతూ
ణీరధనుః కృపాణముఖ నిష్ఠురసంగర సాధనంబులన్
ధీరతఁ దాల్చి భూషితవినిర్మల దేహరుచుల్ వెలుంగఁ దన్
జేరి వినమ్రులై నిలువఁ జెచ్చెర రాజు ప్రహర్షమగ్నుఁడై.

వ. చేరఁదీసి రామలక్ష్మణులఁ దన యంకపీఠంబుల నిల్పికొని కౌఁగిలించి ముద్దాడి వారలతో నిట్లనియె. 42

గీ. తండ్రులార మీరు తపసితోడుత నేగి
యామహాత్ముఁ డింక నాచరించు
క్రతువు రక్షణంబు గావించి శత్రుల
ద్రాల్చి మౌనియాజ్ఞ రండు మరల. 43

వ. అని పల్కిన రామలక్ష్మణులు మందస్మితవదనారవిందులై తండ్రికి మ్రొక్కి వీడ్కొని మౌనిచంద్రునకుఁ బ్రణమిల్లి యాతనివెంబడి చనునెడ. 44

సీ. యుగసహస్రంబు లత్యుగ్రతపము నేయు
వారలకైనఁ గన్పడని మేటి
నామస్మరణమాత్ర భీమపాపంబుల
భస్మరాసులఁజేయు భవ్యమూర్తి
సంకల్పమాత్రన సాధ్యక్రియలఁ గూడ
సల్పఁగల్గిన సర్వశక్తియుతుఁడు
విశ్వసమూహముల్ వెలయింప మెలఁగింపఁ
బొలియింపఁగల్గిన భూతమయుఁడు

తే. నాకుఁ బ్రాప్తించెఁ బూర్వపుణ్యంబుకతనఁ
దపము పండెను జన్మంబు ధన్యమయ్యె
ననుచుఁ దనలోనఁ దాను హర్షాబ్ధిఁ దేలె
గాధితనయుండు రామునిఁ గాంచికాంచి.

సీ. కన్నులపండువుగా ముఖంబును గాంచుఁ
గాంచి యంఘ్రులకు మ్రొక్కఁగ నెంచు
నెంచి మ్రొక్కిననొప్పునే యని శంకించు
శంకించి మాటాడు సరణిఁజూపుఁ
జూపి గద్గదికతోఁ జూక్కి యూరకయుండు
నుండి రామా యని యొయ్యఁ బిలుచుఁ
బిలిచి బ్రహ్మంబ వీవేకదా యని తెల్పుఁ
దెల్పి నన్ బ్రోవ నేతెంచితివను

తే. నని మహానందమగ్నుఁడై యట్టె నిలుచు
నిలిచి హర్షాశ్రునీరధారలను గార్చుఁ
గార్చి రాముని కౌఁగిటఁ గదియఁజేర్చుఁ
జేర్చి తుదిమోహ మొసఁగ వే ,శీ,శయనును.

క. ఈనుడువుల నీనడలఁ గృ
పానిధి రాముండు కాంచి భవ్యాత్మక నే
మానవమాత్రుఁడ నిటులన
నౌనే భ్రమ నన్నుఁగంటె నబ్జాక్షునిఁగాన్.

క. అని మాయఁగప్పి నీపని
చినపనులను జేయ మేము సిద్ధులమై యో
మునినాయక వర్తించెద
మని రాసుతులనిన మౌని హర్షాన్వితుఁడై.

క. కరుణ బలాతిబలములను
స్థిరవిద్యల రాఘువునకుఁ జెప్పి తదీయ
స్మరణమున దేహబాధలు
తెఱలుననుచుఁ దెల్పి మౌని ధీవరుఁ డంతన్.

క. చెలువొప్ప ముందుకేగుచుఁ
దిలకించిరి మువ్వురచట దృగ్వహ్ని శిఖా
కులదూరీకృతమృగవన
తలవాటిక దాటకాఖ్య దైత్యవధూటిన్.

మ. కని గాధేయుఁడు రామ కంటివె మహాకల్పాంతదంభోళిగ
ర్జనలన్ జేయుచు మానులన్ గదిసి నాశంబొందఁజేయున్
దృటిన్, ఘనగందేభసహస్రభూరిబలయుక్తంబైన దీదాన
వాంగన దీనిన్ సతియంచుఁ జూడక వెసన్ ఖండింపవే
యంచనన్. 51

శా. రాముం డాసతిబాహుయుగ్మము సుమిత్రాసూతిముక్కున్
జెవుల్, భీమాస్త్రంబులఁ ద్రుంప దానవి శిలావృష్టిన్వెసన్
రాల్చుచున్, దామీఁదన్ బడరా రఘూద్వహుఁడు చండ

క్రోధుండై రాక్షసిఁ, భూమిఁ గూల్చె మహోగ్ర బాణ
నిహతిఁ దోర్వీర్యమేపారఁగన్. 52

వ. ఇట్లామహాపాపసాంగన హతంబగుటకు సకలలోకంబులు
సంతసిల్లె విశ్వామిత్రుండు రామలక్ష్మణులఁ గౌఁగిలించికొని
మహానందభరితుండై రామునకు సకలదివ్యాస్త్రంబుల నుప
దేశించి తత్ప్రయోగోపసంహారంబులఁ దెల్పిన శ్రీరామున
కామహాస్త్రంబులు జ్యోతిస్స్వరూపంబులఁ బ్రత్యక్షంబులై
స్వామీ! మీయాజ్ఞఁ జరించెద మన రాముండు హర్షించి
నేఁ జీరినప్పుడు సాక్షాత్కరింపుండని యానతిచ్చిన నవి
యదృశ్యంబులయ్యె నంత రామచంద్రుండు తా గాధేయు
నొద్ద నేర్చినసకలవిద్యల సౌభ్రాత్రంబొప్ప లక్ష్మణున కుప
దేశించె నంత నారామలక్ష్మణులు విశ్వామిత్రువెంట నాశ్ర
మంబునకుఁ జని. 53

క. ఆదటనమ్ముని క్రతుదీ
క్షాదృఢచిత్తుఁడయి నిల్వఁగా నృపజులు స
మ్మోదమున యజ్ఞరక్షణ
లోఁ దనరిరి పంచదినములుఁ ధృతియుతులై.

గీ. అంత నాఱవదినమున నసురవర్యు
లంతరిక్షంబునఁ జేరి యపరిశుద్ధ
వస్తువర్షంబు క్రతువేదిపైనిఁ గురియఁ
గాంచి రాముండు ధృతధనుఃకాండుఁ డగుచు.

క. మరుదస్త్రముఁ దొడిగి మహో
ద్ధురగతి మారీచునేయఁ దూలియతఁడు సా.

కరమునఁ గూలె సుబాహుం
డును వహ్ని శరంబుచేత నుసురులువాసెన్. 56

క. మిగిలిన రక్షోవీరులు
విగతప్రాణులయి పడిరి పృథ్విన్ రామా
శుగవహ్నిజ్వాలాహతి
వగలుడిగి మునీంద్రులెల్ల బహుహర్షింపన్. 57

వ. అంతఁ గ్రతువిఘ్నకారులైన దైత్యులు నిశ్శేషంబుగా వ్రాలిన మునీంద్రులెల్లరు శ్రీరాము వేనోళ్లఁ గొనియాడిరి విశ్వామిత్రుండు యజ్ఞపూర్తి గావించి యత్యానందభరితుండై రామలక్ష్మణులఁ గొనియాడి వారలతో మఱియు నిట్లనియె. 58

క. జనకునియజ్ఞముఁ గనఁబో
మనమునఁ దలఁపొదవె మీరు మాతో వేడ్కన్
జనుదెండట నొక ఘనతర
ధనువు కలదు దానిఁ గాంచఁదగు శూరులకున్. 59

క. అని పల్కి దశరథేశుని
తనయులతోఁ దక్కు మునికదంబముతోడన్
జనుచుఁ బథంబున గౌతమ
మునివరు నాశ్రమముఁ గాంచి మోదంబెసఁగన్. 60

గీ. కాంచి గాధేయుఁడనె రామ కంటె మున్ను
గౌతముండు నహల్యయుఁ గలసి మనిన
యాశ్రమంబిది జనశూన్య మయ్యెనిపుడు
దానిహేతువుఁ జెప్పెదఁ దథ్యముగను. 61

క. గౌతమముని లేనితఱి౯
బ్రీతి సురేశుం డహల్య వెసఁ జెఱచుటచే
నాతపసి సతి శపించెఁ గ్రూ
ధాతురుఁడై ఱాయివగు మటంచని కాన౯.

ఉ. బూడిదెకప్పు నిప్పుగతిఁ బోఁడిమిదక్కి కృశించుచున్న దా
చేడియ, నీదుదర్శనముచేఁ బతిశాపముఁ బాయుఁ గాన నీ
వాడకుఁ బోయిరమ్మనఁగ నానృపసూనుఁడు తద్దిశ౯ జన౯
దోడనె యమ్మహాత్ముపదతోయజరేణువు సోఁకి యంతట౯.

క. ఆపడఁతి శిలాత్వము విడి
దీపిత దివ్యాంగనాకృతి౯ బడసి యట౯
భూపసుతు శ్యామసుందర
రూపసమన్వితునిఁ దనదు మ్రోలన్గాంచె౯.

గీ. కాంచి తనుఁ బ్రోవవచ్చిన కమలనేత్రు
పాదవనజంబులకు భక్తిపరవశమున
సాగిపడి మ్రొక్కి హర్షాశ్రుజలము కారఁ
గంపితాంగియు గద్గదకంఠ యగుచు.

వ. నిటలఘటితకరయుగపుటయై శ్రీరామదేవు నిట్లు స్తుతించె.

దండకము:—

శ్రీమజ్జగజ్జాలసృష్టిస్థితిధ్వంసకార్యాభిరామా ! సదానంద
విజ్ఞానధామా! మహోద్దండరక్షోవిరామా ! దినేశా
న్వయాంభోధిసోమా! కృపారక్షితార్తప్రజాస్తోమ! భాస్వ
త్పరంధామ రామా ! మహాఘక్షయోద్దామనామా !
లసత్సత్యకామా ! మహార్తి౯ భయోదగ్రశాపాహతి

న్ధూలి కాయం బపాయాస్పదంబై శిలఁబోలి దుఃఖా
బ్ధిలోఁగూలి యేదిక్కు లేకొక్కతెఁ వెక్కసంబైన జీవం
బుతోనున్న యిక్కాంత యిక్కట్టులఁబాపి సద్దివ్యులఁ
గీర్తినెక్కొఁదలంపొంది యేతెంచితే! లోకముల్ గన్న యప్పా,
యఘాంభోధి దాటించు తెప్పా, కృపాయుక్తటాక్షాల
వాలా సుదృగ్వీక్షణస్పర్శనోద్ధూతదుర్దోషతూలా, భవ
త్పాదపంకేజరేణుప్రసారంబుచే ధన్యనైతిఁ నమస్కార
ముల్ వేనవేల్ సేసి యాత్మన్ని వేదించు కంటె న్మఱే మేను
జేయంగనౌ కార్యముండుఁ వినీలోత్పలశ్యామ రామా
రణోద్దండభీమా నమస్తే నమస్తే నమః. 67

వ. ఇట్లు ప్రార్థించి శ్రీరామ లక్ష్మణ గాధేయులకు నర్ఘ్య
పాద్యాదులతో నాతిథ్యం బొసంగి కృతార్థయయ్యె. నంత
గౌతముం డేతద్వృత్తాంతం బెఱింగి వచ్చి సతిన్గూడి శ్రీరామ
లక్ష్మణుల గారవించి తన యాశ్రమంబునకుఁ జనియె. విశ్వా
మిత్రుండు రాఘవులతో మిథిలానగరంబుఁ జేర జనకుం
డెదుర్కొని. 68

గీ. అమిత వినయంబుతో మ్రొక్కి యర్ఘ్యపాద్య
విధుల మునినాథుఁ బూజించి పీఠమిచ్చి
చంద్ర సూర్యుల గేరులసత్ప్రకాశ
మెసఁగు రాజన్యసుతుల వీక్షించి యలరి. 69

క. వీరెవ్వరనిన దశరథు
కూరిమి పుత్త్రకులు దైత్యకులనాశకు లీ
ధీరులు మత్క్రతురక్షా
పారీణులు భూరిబాహుబలు లసమానుల్. 70

క. అని పల్కి మౌని నీకడఁ
దనరెడిశివకార్ముకంబు దర్శింపంగా
జను దెంచి రీకుమారకు
లనఘా! తెప్పించి చూపుమా ధను వనినన్. 71

వ. జనకుం డిట్లనియె. 72

సీ. సురనరగరుడకిన్నరకింపురుషు లెల్ల
రేతెంచి వీక్షించి రీధనువును
గంధర్వయక్షరాక్షసవీరవరులంద
ఱేతెంచి వీక్షించి రీధనువును
రావణార్జునముఖాప్రతిహతబలధుర్యు
లేతెంచి వీక్షించి రీధనువును
వాహు వీరననేల వేరొప్పువా రెల్ల
రేతెంచి వీక్షించి రీధనువును
తే. కాని యందొక్కఁడైన నీకార్ముకంబుఁ
గదలుపఁగలేక యియ్యది క్ష్మాధరాభ
మేరికగు నెత్తనంచు నన్నెదిరి కన్య
బల్మిఁ గొంపోవఁ దలఁప నే వారినడఁప. 73

క. సురలను వేడిన వారలు
పరిరక్షణసేయుచున్నవారైనను నె
వ్వరికిన్ జేయఁగ బహుదు
స్తర మీపనియంచు మానసమునఁ గలఁగుచున్. 74

ఉ. ఈమహితోగ్రకార్ముకము నేటికిఁ బందెముకట్టినాఁడ నిం
కీమహి దీని నేపురుషుఁ డెక్కిడఁగల్గెడి నెట్లు నాదు క

న్యాయమణికిఁ బరుండమనునంచు మది న్గడుశంకితుండనై
యేమియుఁ దోఁపకుండునది యీకొమరుల్ కదిలింపనేర్తురే.

క. అని పలుక మౌనివరుఁ డో
జనవర! యీసుతులమానుషక్రము లెవ్వా
రును వీరిఁబోల రనినన్
మనమున బహుహర్షరసనిమగ్నుం డగుచున్. 76

క. జనకుండు రామలక్ష్మణు
లను దగఁ బూజించి గద్దెల న్గూర్చుండన్
బనిచి శివధనువుఁ దే బహు
జనములఁ బంపంగ వారు చయ్యన దానిన్. 77

వ. తెచ్చి యందుంచిన. 78

క. ఇనకులతిలకుని రాముని
గనుఁగొని ముని పల్కె నీవు కడిమి న్దీనిన్
మొనకొని యెక్కిడుమన నా
యనఘుఁడు మందస్మితోజ్జ్వలాస్యుం డగుచున్. 79

మ. కటిబంధంబు బిగించి మౌనికి నమస్కారంబు గావించి ధూ
ర్జటికోదండము డాసి మ్రొక్కి రఘువంశశ్రేష్ఠుఁ డాకార్ముక
స్ఫుటదండంబును వామహస్తమున నాస్ఫోటించి పైకెత్తియు
ద్భటదోస్సారముమీఱ నారివెస సంధానంబు గావించుచున్.

చ. జనకుని సభ్యులెల్ల రతిసంభ్రమవిస్మయచిత్తులై కనుం
గొన రఘువీరశేఖరుఁ డకుంఠితదోర్బల మొప్ప మౌర్వి లా
గిన విలు భీకరాశని వికీర్ణమహాధ్వనితోడ భగ్నమై
జనములు సంచలించిపడ క్ష్మాతలి వ్రాలెను రెండుముక్కలై.

క. అది కని జనకుఁడు విస్మయ
మొదవఁగ వనగ ద్దెడిగ్గి యురువడి జని స
మ్మదమున రాముని఼ గౌఁగిటఁ
గదియించి వచించె సీతఁ గైకొమ్మంచున్. 82

వ. అంత జనకుండు గౌశికానుమతి జానకీరాముల కళ్యాణంబు నిశ్చయించి దశరథున కీవార్త నివేదించి వివాహమునకుఁ దోడ్కొని రమ్మని మంత్రులన్పంప వారలేగి యావద్విషయంబులు తెల్పిన దశరథుండు సంతుష్టమనోరథుండై సకల సైన్యసమేతంబుగా భరతశత్రుఘ్న వసిష్ఠులతోఁ గూడి మిథిలానగరంబున కేతెంచిన జనకుండెదుర్కొని వారలకుఁ దగు విడుదులొసంగ వారలందుఁ బ్రవేశింప. 83

క. శ్రీరామలక్ష్మణుల జడ
దారియయిన గాధిసుతుఁడు దశరథు కడకుఁ
జేరఁగఁ గొంపోయినఁ బతి
గారవమున వారిఁ గాంచి కడు హర్షమునన్. 84

ఉ. మౌనికి మ్రొక్కి నీకరుణ మానిత శోభన మావహిల్లె నా
సూనులు సత్పరాక్రమయశోవిభవంబుల వెల్గఁగల్గిరేఁ
గానఁగ నేరనైతి మును కౌశిక! యింతటివాఁడవంచు న
జ్ఞానము సైఁపవే యనిన సంయమి సుస్మితసన్ముఖాబ్జుఁడై. 85

తే. పార్థివేంద్ర! భవత్తనూభవు లనూన
తేజు లమితపరాక్రమ ధీసమేతు
లట్టితనయులఁ బడసి మహాత్మ. నీవు
ధన్యతనుగంటి మాబోంట్లు ధన్యులై 86

మ. అన నంతన్ జనపాలుఁ డిట్లనియెఁ గన్యారత్నముల్
ముప్పురా,జనకోర్వీపతియింట నుండుకట యాత్మాభర్తతో
వారిఁద,క్కిన నాపుత్త్రుల కీప్సటం చని తదంగీకారమున్
బొంది నన్, ఘనమోదావహుఁ జేయుఁడన్న మునిసంఘం
బాత్మ హర్షించుచున్. 87

తే. జనకుకడ కేగి యడుగనా త్మాతలేశుఁ
డలరి లక్ష్మణునకు నూర్మిళాఖ్య ...డు
పుత్త్రి నొసఁగెద నాదు తమ్ముని తనూజ
లైనమాండవి శ్రుతకీర్తు లనెడువారి. 88

తే. భరతశత్రుఘ్నులకు నిచ్చి పరిణయంబు
లొక్క సుముహూర్తమునందె సేయుదమనంగ
నలరిరందఱు దశరథుఁ డపి యొఱంగి
హర్షవారిధిలో నోలలాడి యంత. 89

సీ. నలువురు సుతుల నుజ్జ్వలమణిమండన
విమలాంబరముల శోభిలఁగఁజేసి
యొక్కొక్క తనయున కొక్కొక్క లక్షగాఁ
జతురంగబలముల నరగఁ గూర్చి
వేణుకాహళమృదు వీణామృదంగభే
రీఝాంకృతధ్వనుల్ పృథ్వి నిండ
వారకాంతామణుల్ సేరి నాట్యములాడ
రహిఁ బుణ్యతరుణు లారతు లొసంగ
తే. జనకుసౌధంబునకుఁ బెండ్లిజనము లరిగి
గౌతమతనూభవ వసిష్ఠ గాధితనయ

ముఖ్యమాత్యులు శ్రుతిమంత్రములఁ బఠింపఁ
బరిణయంబులఁ జేసిరి ప్రాభవమున.

తే. ప్రీతి రాముండు సీతను బెండ్లియాడె
లక్ష్మణుం డూర్మిళను గూడె లక్షణముగ
భరతుఁడా మాండవికరంబుఁ బట్టెఁ జెలఁగి
రూఢి శ్రుతకీర్తిఁ జెందె శత్రుఘ్నుఁ డలరి.

క. సరసిజభవ భవముఖసుర
వరులు రఘుకులవరులశుభపరిణయములసొం
పరసి యరుస మెసఁగఁగ వెస
నరిగి రసురులకు నిఁక విలయ మొదవుననుచున్. 92

మ. జనకుం డల్లురకుజ్జ్వలాభరణవస్త్రస్వర్ణరత్నాదులన్
వనితాగోగణవారణాశ్వరథశుంభత్సైన్యసంఘంబులన్
దనకూఁతుండ్ర కభీష్టమొప్ప బహుళార్థశ్రేణులన్ జేర్చిత
క్కున్నిజాప్తాశ్రితకోటి కర్హగతులన్ గూర్చెన్ విశేషార్థ
ముల్. 93

వ. ఇట్లుండఱ సత్కరించి తన నల్వురు కూఁతులకుఁ దగు బుద్ధులు
సెప్పి పతుల కొప్పగింప దశరథుండు సంతుష్ట మనోరథుండై
జనకుని వీడ్కొని పుత్రమిత్ర సైన్య సంయుక్తుఁడై యయో
ధ్యామార్గంబునఁ బోవుచుండ. 94

స్రగ్ధర:—
క్రూరక్రోధాగ్నికీలా
కుటిలగతిముఖారూఢమై జేగురింపన్
ఘోరాంఘ్రిన్యాసలీలన్
గువలయమదరన్ క్షోణిఁ బెంధూళిరేఁగన్

సారప్రోద్యత్కుఠాః
స్ఖలితరుచితటిజ్జాలకాంతుల్ స్ఫురింపన్
బారావారంబుధాత్రిన్
బడడిగుచు నటుల్ భార్గవుం డేగుదెంచెన్. 95

క. ఆతని గన్గొని సైన్యము
భీతిలి దశదిశలఁ జెదిరి వెసఁ బరువెత్తన్
భూతలపతి భృగుసుతుఁ గని
యాతిథ్యముఁ గొన్మటంచు నర్థిన్వేఁడన్. 96

క. జనపతి చేసెడు సత్కృతిఁ
గనకేఁడీ రాముఁడంచుఁ గడు కోపమునన్
జని కనెనట సుస్మితముఖ
వనజున్ శ్రీరాముఁ బరమపావననామున్. 97

మ. కని నీవా రఘువంశరాముఁడవనన్ గాకుత్థ్సుఁ డౌనంచు వే
గ నతుండై తగు నర్ఘ్యపాద్యము లొసంగన్ వానిఁ గైకోక
శం,భునికోదండముఁ ద్రుంచినట్టి నిను నేఁ బోనీక ఖండిం
చెదన్, విను మే రాముఁడ నుండ వేఱొకరుఁ డాపేరన్
మనన్ సాధ్యమే. 98

క. అని భార్గవుండు పల్కిన
నినకులుఁ డోవిప్ర ధన్వు నే నెక్కిడి లా
గిన మాత్ర విఱిగెఁ దత్ఖం
డన మొనరుప లేదు నే మనస్ఫూర్తి నిఁకన్. 99

శా. రామాఖ్యాకుఁడ నీవొకండవె జనవ్రాతంబునం దెందఱా
నామంబున్గొన రంతమాత్రఁ గినియన్యాయంబె నాతోడసం

గ్రామం బీవొనరింప నెంచునెడలన్ రక్షింపు పాఱుండవం
చామోదంబున మ్రొక్కితిన్ భయముచే నక్లేనొనర్పన్జుమీ.

మ. అన నగ్నిన్ ఘృతమాహుతిన్ సలుపు నట్లత్యుగ్ర కోపంబు
నన్, నను బాఱుండనియంటి కాంచెదిపుడే నా బ్రాహ్మ్య
మున్నీ దుష్టా, త్రనియోగంబిదె శ్రీశువిల్లు గుణసంధానంబు
గావించి య,స్త్రమొనరన్ జేర్చి రణంబుసల్పు మటుగాకున్న
న్నినున్ గూల్చెదన్. 101

క. అన విని పటురోషంబున
నినకులుఁడు మునీంద్రుచేత నెసఁగెడు ధనువున్
గొని నారిఁదొడిగి వెస శర
మునొకటి సంధించి లాగి ముని కిట్లనియెన్. 102

క. నీపాదయుగళిఁ ద్రుంచెదఁ
జూపుము నీబ్రాహ్మ్యమన్న క్షోణీసురుఁ డా
భూపసుతుచరణములపై
దీపితసద్వ్రాలి తెలివి నిటు లనెన్. 103

క. ఈధను వెక్కిడినప్పుడె
శ్రీధవుఁ డీవంచుఁ దెలిసె శ్రితజనరక్షా
మాధవ నే శరణార్థిని
బాధింపకుమయ్య పతితపావన నన్నున్. 104

ఉ. పాహి కృపాసముద్ర రఘువంశభవోజ్జ్వల రామభద్ర మ
ద్బాహుబలప్రభూతమదబంధురవిభ్రమమానసుండనై
శ్రీహరి వీవటంచెద స్ఫురింపక నిన్నె దిరించినట్టి మ
ద్ద్రోహము సైఁపవే సుగుణతోషణ దానవవంశశోషణా.

పంచచామరము.—

ధరేశ! శౌరి పల్కె నాకు దర్శనం బొసంగ ని
ద్ధరన్ స్ఫురింతు నంచు నిప్డు తాపకాకృతిన్ గృపా
కరుండు చక్రి తోఁచె నాయఘంబు లెల్లఁ బాసె శ్రీ
హరీ! భవత్పదాశ్రితుండ నయ్య నన్నుఁ గావవే. 106

వ. అని ప్రార్థించుచు నీశరం బమోఘంబు గావున నన్నేయక మన్నిర్మితస్వర్గమార్గంబు లేయు మన శ్రీరాముం డట్ల కావించె నంతఁ బరశురాముండు రఘురామున కభివంద నంబు లాచరించి వీడ్కొని చనియె నంత. 107

క. శ్రీరామచంద్రుఁ గౌఁగిట
గారవమునఁ జేర్చి విభుఁడు కడుముద మొప్పన్
భూరి శుభధ్వను లులియఁగ
నూరేగుచుఁ జేరె నయ్యయోధ్యాపురమున్.

క. చేరి సతీతనయాదుల
తోఁ రాజిలుచుండె దశరథుండు సురేంద్రున్
గేరెడువిభవముతో నా
శ్రీరామునిమహిమ జనులు చెలఁగి నుతింపన్.

మాలిని.—

సురుచిరమృదులాంగా క్షోణిజాపద్విభంగా
సురవిమతవిదారీ సుస్థిరానందకారీ
ఖరకరకులదీపా ఖండితాశేషపాపా
వరసుగుణవిలాసా భద్రశైలాధివాసా.

గద్య. ఇది మంత్రికులోదార రామయకుమార భద్రాచల నివాస తూము సీతారామదాస ప్రణీతంబయిన సీతారామ రామాయణకావ్యంబునందు బాలకాండకథాసంగ్రహ మేకాశ్వాసము.



శ్రీ ర స్తు

# సీ తా రా మ రా మా య ణ ము

## అ యో ధ్యా కాం డ ము.



మద్భద్రధరాధర
ధామ, గుణస్తోమ, దనుజదళనిర్దళనో
ద్దామ, రిపుభీమ, కలుషవి
రామ, శుభప్రదసునామ, రాఘవరామా.

వ. అవధరింపు మట్లు దశరథుండు తనపుత్త్రచతుష్కంబునకుం బెండ్లిండ్లుచేసి సుఖంబున నుండఁ గేకయరాజుచే నర్థింపఁబడి భరతశత్రుఘ్నులు తద్భూపతిపాలికిఁ జని రంత. 2

శా. శ్రీరామున్, సుగుణాభిరాముఁ, గదనస్థేమున్ దగన్ యౌ
వరాజ్యార్హుఢి న్నెలకొల్ప నాదశరథుం డామోదమ
గ్నాత్ముఁడై, పౌరశ్రేష్ఠులఁ జీరి వారలయభిప్రాయంబుల
న్దెల్పఁగాఁ, గోరన్ మేలని రందఱొక్కగతి దిక్కుల్
మెండు మార్మ్రోఁగఁగన్. 3

ఉ. అంతట నవ్వసిష్ఠుఁడు శుభావహమైనముహూర్త ముంచి
భూకాంతునితోడఁ దెల్పఁగఁ దగన్ బురవీథు లలంక
రింపఁగా, సంతసమొప్పఁ బంచి రఘుసత్తము రామునితోడ

నీవు నీ,కాంతయు నీమమొప్ప ననఘస్థితి నుండుఁడు పొమ్మటంచనన్. 4

వ. అంత మంత్రిపురోహితదాసదాసీజనంబులు శ్రీరామున కభిషేకంబునకుఁ దగినకార్యంబులఁ బ్రవర్తిల్లుచుండ. 5

మ. పురమత్యంత మలంకరించెడువిధంబు న్గాంచి శంకించి మంథర తద్ధేతు వెఱింగి రాముఁ డెపుడో తన్ దన్నినాఁడన్న ముష్కరభావంబున రామచంద్రు నభిషేకప్రాప్తికిన్ విఘ్నముల్, నెరపంగాఁ దఱియంచుఁ గైకకడకున్ జేరెన్ దురిచ్ఛ న్వేసన్. 6

వ. ఏగి మంథర మహాశ్చర్యశోకభయరసంబు లభినయించుచుఁ గైక కిట్లనియె. 7

శా. కైకా! కంటివె యెట్లు వాటిలెనో దుష్కార్యంబు లివ్వేటిలో నీకాంతుం డలరామభద్రునకు క్షోణీరాజ్య మీఁబూనె నా హాకర్తవ్యముఁ గాంచవైతి భరతుం డా రాముసేవించినన్ గాకిద్ధాత్రి మనంగఁ బోలునె మహాకష్టం బెటుల్ సైఁచెదే. 8

చ. అన విని కైక యిట్లనియె నారఘురాముఁడు యోగ్యుఁడన్నిఁటన్, ఘనతరరాజ్యమయ్యతఁడు కాంచుటకంటె శుభంబు కల్గునే, కను ననుఁ గూరిమిన్ భరతుకంటెను హెచ్చుగ రాముఁ డేల నీ, మనమున దుర్విచారిమది మానుము మాన్యుఁ డతండు మానినీ. 9

క. అన మంథర యిట్లనియెన్
వనితరో నీకంటె వెఱ్ఱిపడఁతులు కలరే
మనమున సవతికుమారుని
ఘనతకు ముదమంది చెఱుపుఁ గాంచెద వవలన్. 10

చ. భరతుఁడు వీటనుండని యుపాయము ముందుగఁ బన్ని
ధారుణీ,వరుఁడు నిజాగ్రపుత్రుని ధ్రువంబుగ రాజ్యపదస్థుఁ
జేయఁబూ,నె రమణి! దీనినైనఁ గననేరక యూరక రాము
వైభవ,స్ఫురణముఁ బొంగె దిట్టి ననఁబోఁడిని లోకమునందుఁ
గంటిమే. 11

ఉ. అక్కడ నక్కడుండెడునిజాప్తుల నెల్లరఁ జేర్చి తజ్జనుల్
మక్కువఁ జెందఁజేయును గుమారులశోభనముల్ గృహస్థహా
యిక్కరణిన్ దనూజు లొక రిద్దరి నిల్వెడలించి గ్రక్కునన్
దక్కినపుత్రువైభవవిధానముఁ బూనెడుతండ్రియుండునే.

ఉ. స్వల్పపుఁ గార్యమా సుతుని క్ష్మాతలరాజ్యమహాపదంబునన్
నిల్పుట యట్టి గొప్పపని నిన్ ఘటియించెడువేళఁ దక్కుపు
త్త్రు ల్పగవాండ్రె యిల్వెడచి దూరపథంబున నుండ వారలన్
బొల్పుగఁ జీర కాశుభము భూపతి పూనుట వింతకాదొకో.

సీ. పతికి నీపై మెండువాత్సల్యమంచందు
విట్టిదేనా నీహృదీశుప్రేమ
"మల్లాలు బెల్లాలు నక్కగారికిని నా
వటిపాక్కు లెల్ల బావకనునట్లు
కౌసల్య కాత్మజక్ష్మాపతిత్వానంద
మిచ్చె నీమొగమున కేమికలదు
పతియొక్క శుష్కవాగ్భణతుల నాలించి
పొంగిపొంగి తుదకు బోర్లపడెద
తే. భావుకాపచ్ఛయంబుఁ బోల్పంగలేవు
రాముఁడే భూమిభుండైన భామ నీదు

పట్టికీని నీకు జీవనోపాధులున్నె
పక్కలో బాఁ కతండని పడఁతి కనుము.

క. భూవిభుఁడు నీకు నప్రియుఁ
డై వెలసె నికేల సంశయము నీవు కనక్
లేవేలనొ ప్రత్యక్ష
ప్రావిర్భూతాహితక్రియార్థము లైనన్.

క. నీయుప్పు పులుసుఁ దినుచుం
టో యమ్మరో యూరకుండ నొల్లక రానో
నీయాపల నైల్పితి
నీయిష్టం బవలవిధుల నెట్టఁడరంబే.

క. నీ కీదుర్దశ యేటికి
కాకుత్థ్సుఁడు మున్ను నీకుఁ గరుణ నొసఁగెన
స్తోకవరద్వితయం బీ
వాకాంక్షింపంగరాదె యవి యిష్టబలా.

క. భరతునకు యౌవరాజ్యం
బరణ్యగతి పదియునాలు గబ్దంబులు ము
ష్కరుఁ డగురామునకును నీ
వఱమర లేకుండఁగోరు మావరయుగమున్.

క. ఈరీతి వరయుగంబుల్
గోరిన సిద్ధించు నన్నికోర్కెలు నీకుఁ
జేరును శుభములు కావున
నూరక చెడిపోక నాదుయోజన వినుమీ.

క. ఇక్ష్వాడ్కు వేగతులఁ గై
కష్ట కెఱుఁగఁ జెప్పఁజెప్పఁ గడకొడఁబడె, లో

కమ్మునఁ జెప్పినమాటల
బమ్మకయిన దిమ్మతెగులు వాటిలుఁగాదే. 20

వ. అట్లాడఁబడి కైక తన తొడవులను విడిచి కోపగృహంబునఁ
బ్రవేశించె నంత. 21

చ. కువలయ భర్త కైకకడకుఁ జని యాసతి కుంపు కోపహే
తు వెఱుఁగఁగోర మున్ను దయతోఁ గృపనేసిన యావర
ద్వయిఁ, బ్రవిమలసూనృతవ్రతపరాయణ! నాకు నొసంగు
మిప్డనఁ, యువిద! యొసంగినాఁడ నెవి యో యవి చెప్పుమటం
చు రాజనెన్. 22

ఉ. అంతటఁ గైక సంశయము నాత్మ నొకింతయుఁ గాన కోమహీ
కాంత! ధరాధిపత్యమునఁ గ్రాలఁగ భరతు స్థాపించి వ
న్యాంతరసీమలందుఁ బదునాలుగువత్సరముల్ చరింపఁగాఁ
జింతిలకుండఁ బంపుము విశిష్టగుణుఁ రఘురామునంచనన్.

క. పిడుగులఁబోలెడు నీకడు
బెడిదఁపు నుడువులకు రాజు వివశాత్ముం డై
పుడమిఁ బడి మరలఁ దెలివిని
బడసి సతి న్గాంచి యిట్లు పలుకఁదొడంగెన్. 24

క. జగదభిరాముఁడు రాముఁడు
పగతుఁడె ఘోరాటవుల నివాసము సేయఁగ
సుగుణమణి యాకుమారుఁడు
మగువా! నేనతని విడచి మననేరఁజుమీ. 25

క. కాలాహివై భళీ యీ
పోలికనన్నఱచి చంపి పుణ్యవిశాలుఁ

బాలుఁ రాముఁ వనముల
పాలొనరించి యెట్టిమేలుఁబడసెద జలధీ.

క. కలనైన నెంచనైతిని
చెలిమిన్న నుఁ జంపునట్టి చేడియవనుచుఁ
దలఁపకు మెగ్గును రఘుకుల
తిలకులకని పతి వచింపఁ దెలిప కినుకతోన్.

క. అనృతవచశ్శీలుఁడ వని
మనమునఁ గననైతి వహ్నా ప్రగ్గద నీవాం
డనిన నని పడఁతి పల్కఁగ
ఘనమూర్ఛ మునింగి విభుఁడు క్ష్మాతలిఁ ద్రాలెన్.

వ. అంత నా కైకేయి శ్రీరాముని దోడితెమ్మని దశరథుం డాన
తిచ్చినట్లు చెప్పి దూతన్బంప, నాతం డాకుమారుని కడకేగి
దెల్ప మంగళస్నానంబు లొనర్చి సర్వాభరణభూషితులై
యున్న సీతారాములు లక్ష్మణసహితంబుగా రథారూఢులై
కైకమందిరంబున కేతెంచి భూతవివశుండైనట్లు పడియున్న
తండ్రికిని కైకేయికిని నమస్కారంబు లొనర్చి యిట్లు తండ్రి
పడియుండుటకుఁ గారణం బేమని శ్రీరాముం డడుగఁ గైక
యిట్లనియె. 29

క. మును నీజనకుఁడు నేఁగో
రినయప్పుడు దక్కకుండ రెండువరము లి
త్తు ననియె నిపు డవి నేని
మ్మన నిచ్చితి ననుచు వివర మడిగె న్నన్నున్.

క. అన్నా ! భరతుని రాజ్యప
దోన్నతుఁ గావించి నిన్ను నుగ్రాటవిలో

నన్నాలుగుబడెయబ్దము
లున్నిలుపఁగఁ గోరితిని గడుఁక ప్రియమారన్.

తే. తండ్రివాక్యంబు నిల్పు నాత్మజుఁడనైనఁ
గినుకనొందక యడవికిఁ జనుము నేఁడె
మునివిధంబున వల్కలాజినములూని
యనిన రాముఁడు మందస్మితాస్యుఁ డగుచు.

క. తమ్ముఁడు ధరనేలుట నే
నెమ్మిఁగ సన్మానిసేవ నిలచి మనుటనా
యమ్మకు నయ్యకు నీగతి
సమ్మతి నే మెలఁగుటయుఁ బ్రశస్తముకాదే.

క. తల్లీ! సందేహింపకు
ముల్లోకములందు నాకుఁ బొసఁగని కార్యం
బుల్లేదేవని నెప్పినఁ.
జెల్లించెద వల్కలములఁ జేప్పుమటన్నన్.

వ. కైక హర్షించి వల్కలాజినంబులఁ దెప్పింప శ్రీరాముం డది
వఱకు ధరించి యున్న దుకూలాంబరమణిఖచితస్వర్ణాభరణం
బుల విసర్జించి నారవస్త్రంబులు ధరించి రాజర్షివేషంబున భాస
మానుండగుచు ధరిత్రిపైఁబడి దుఃఖసముద్రంబులో మునింగి
యున్న దశరథునకుఁ బ్రణమిల్లి కైకకు నమస్కరించి యిల్వె
డల నమకట్టుచుండ లక్ష్మణుండుదగ్రకోపంబున ఖడ్గం బంకించి
కైకను మంథరనుఁ ద్రుంచివైచెద, నిన్న నీకుఁ బట్టంబు కట్టెద
నని వసిష్ఠాదులయెదుట సభలోఁ బలికి తప్పుటయుఁ, దనకాంత
కుఁ దానెపుడో యెవ్వరెఱుంగకుండ నిచ్చినవరంబులు నడపు
టయు ధర్మంబగునే, తండ్రియయ్యు న్యాయంబు విడచి

ప్రవర్తించినఁ దనయుఁ డాదరింపనేల యని ధీరాలాపంబు లాడ రాముఁ డతని వారించి జానకిఁ గాంచి యిట్లనియె. 35

తే. అత్తమామలపాదసేవానురక్తి
నిలుపుమింతన నాసతి నిన్ను వీడి
మనసు క్షణమైన, రావలదనినఁ జత్తు
ననిన రాముఁడు సతిరాక కనుమతించె. 36

క. సౌమిత్రిఁ గాంచి భరతున
కామోదముతోడ సాయమై యుండుమనన్
నేమన నిన్వీడి క్షణముఁ
స్వామీ! మీతోడ నిపుడె వచ్చెద ననుచున్. 37

క. మునివేషము తానును దా
ల్చి లక్ష్మణుఁ డనుజుతోడఁ గూడి నిలువ ని
ట్లినకులుఁడు తమ్ముఁడును భూ
తనయయు వనమునకుఁ బోవ దరలుచు వారల్. 38

వ. కౌసల్యా సుమిత్రల చెంతకేగి మ్రొక్కి వారలకు యావద్వృ త్తాంతంబుఁ దెల్ప నాసతులు మహారోదనంబు లొనర్చుచు వివిధంబులఁ బరితపింప వారల నెట్టకేలకొప్పించి రాముండు సీతా లక్ష్మణసహితుండై సుమంతుండు తేరుఁదోల రథారూఢుండై పురంబు వెడలి చనుచుండఁ బౌరులెల్లరు రామాదుల వనగమనంబున కడలుచు నయ్యయ్యో! యఱువదివేలవత్సరంబులు బిడ్డలులేని దొడ్డయడ్డంబులఁ బొగిలి పొగిలి యేపుణ్య లేశంబుననో కాంచిన మన్మథాకారు లగుకుమారుల నిట్లు నట్టడవులపాలునేసెడి తండ్రి కలఁడే యనువారును, తండ్రి యాఁడుదానివలపులకు లోనై పుత్రులఁ దొలఁగినను గడు

పునఁ గన్నతల్లు లెట్లోర్చి రనువారును, సవతితల్లి తనసుతు నకు రాజ్యంబుఁ గోరిన్ గోరుఁగాక తక్కినకుమారుల నిల్వె డలఁద్రొబ్బి యరణ్యంబుల కంపునే యనువారును, వార లట్లు పంపినను ధీరులగు నీకుమారు లేల వనంబుల కేగ వలయు ననువారును, తపోనిష్ఠుం డగు నవ్వసిష్ఠుం డైన హితాహితవివేచనంబునేసి యిట్టి కట్టిడంబులగు నిక్క ట్టులఁ దప్పింపఁడయ్యెఁగా యనువారు నింతేల ధైర్యమంద రుండును లోకైకసుందరుండు నగు దశరథాగ్రనందనున కెగ్గుగావించిన పాపసింధువగు నమ్మంథరకంధరంబుఁ దెగ వ్రేయవలదా యనువారు నొక్కయాఁడుదానివలన నెంత విప్లవంబు వాటిల్లె ననువారు నిట్లు పురంబున బహుతెఱం గుల మహాకల్లోలధ్వనులు పుట్టి పౌరులెల్ల రిట్టి పుణ్యులు లేనిపురంబునఁ గాపురంబునేయుకంటె నీకుమారులతో నర ణ్యంబుల కేగుట లెస్సయని నిశ్చయించి యేకగ్రీవంబుగ శ్రీరాముని రథంబువెంట నేగుచుఁ దద్దివాంతంబునకుఁ దమసానదీతీరంబుఁ జేరి దాశరథులతో నచట విశ్రమించి యుండిరంత. 39

పురజనములు తము వీడక
యరదముతో వచ్చు టరసి యర్కకులుం డి
ట్లరుదేనగునే మిాకుం
దిరముల కేగుఁడన వారు తిరుగకయుండన్. 40

ఆనాఁటిరాత్రి వేకువ
భూనాథునిసుతులు లేచి పురజనులుకనక

రానివిధంబున నవలికిఁ
బోనెంచి సుమంతుఁ జూచి భూవిభుఁడనియెన్. 41

ఉ. పౌరులెఱుంగకుండ మము వాహినిదాఁట నొనర్చినీవు వే
మారికిఁ దేరుతోడఁ జను మెయ్యననంచనెనంత రాసుతుల్
త్మారమణీజఁ గూడి తమసానది దాటఁగఁ బౌరులెల్ల నా
శ్రీరఘువీరులన్గనక శీఘ్రగతిన్ బురిఁ జేరిరంతటన్. 42

ఉ. ఆవల జానకీసహితులై రఘువీరులు జాహ్నవీలస
త్పావనవాహినీతటిని తద్దివసాంతమునందుఁ జేరి స
ద్భావు గుహున్ హితోక్తుల శుభప్రదుఁజేసి నదిన్దరించి వే
నావలికేగి రందలి వనాంతర చిత్రములారఁగాంచుచున్. 43

వ. త్రోవ మృణాళఖండ హింగుదీపిణ్యాకంబులచే క్షుద్బాధలఁ దీర్చికొనుచు సరోవరంబుల నిర్మలోదకంబులఁ ద్రావుచు ముందుకుఁ జనిచని భరద్వాజాశ్రమంబుఁ జేరిన నమ్మహామహుఁడు. శ్రీరామాదుల యాగమకారణంబెఱింగి యాతిథ్యం బొసంగె. మఱునాఁడు దాశరథులు సీతాసహితులై చిత్రకూటాచలంబుఁ జేరి విశ్రమించియుండిరంత నయ్యయోధ్యాపురంబున. 44

క. శ్రీరామాదు లరణ్యముఁ
జేరన్ జనుటెఱిఁగి రాజు చిత్తము వ్రయ్యన్
హా రామ రామయంచున్
బోరున నేడ్చుచు ధరిత్రి మూర్ఛన్ వ్రాలెన్. 45

వ. ఇట్లు వ్రాలి కొంతవడికిఁ దెలిసి క్రూరేక్షణంబులఁ గైకన్ జూచి నీవొక గోముఖవ్యాఘ్రంబ వింక జనశూన్యంబగు నీరాజ్యంబు నీనెత్తిన్ గొట్టికొనుము. నీమొగంబుఁ జూడ

మహాపాపంబు వాటిల్లు నీవు నాకు సతీరూపక మృత్యువ
వైతివి నీకతంబున నేను ప్రాణంబుల విడువనున్నాఁడనని
వచించి కైకగృహంబు వీడి దశరథుండు కౌసల్యాసౌధంబున
కేఁగ నాకాంత నాథున్గాంచి 46

క. మీరును మీ ప్రియసఖియుక్
శ్రీరామాదులను వనముఁ జేర్చితి రింకన్
గోరికలార సుఖంబున
నూరేగుచు నుండుఁడేను నుసుఱుఁ విడుతున్. 47

మ. అకటా! కైకకు రాజ్యమిచ్చినను నీయన్యాడియాఁగాని యా
యకలంకుండగు నాసుతుం డెవరికే యాపత్తు గావించె వ
న్యకఠోరస్థలవాస మొందఁ, బితయే యన్యాయముక్ జేయ నే
రికగున్నాదనఁ గైకపైని వలపాహా! యెంత గావించెనో. 48

వ. అని యిట్లనేక విధంబులఁ దన్నతి నిష్ఠురోక్తు లాడుచున్న
కౌసల్యన్గాంచి దశరథుండు నన్ని ట్లేల నొప్పించెదు నాకు
వెనుక వాటిల్లిన మునిశాపంబున నిప్పుడు పుత్రవియోగ
దుఃఖంబునఁ బ్రాణంబులఁ బాయనున్నాఁడఁ దచ్ఛాప
వృత్తాంతంబుఁ దెల్పెద వినుమని యిట్లనియె. 49

సీ. ఒకముని తనయుఁ డెంతో భక్తి నంధులౌ
తనవృద్ధ మాతాపితలను దీర్థ
యాత్రాస్థలములకు నర్థిఁ గావడిలోన
మోసుకపోవుచు గాసికోర్చి
చనుచుఁ ద్రోవను దాహజలము వారడిగినఁ
గావడి నటడించి కడచి యతఁడు

చేరువఁ దనరెడు సెలయేటికేగి యా
  జలములఁ దనకమండలువు ముంప
తే బుడబుడధ్వని జలములఁ బుట్టిన విని
మృగమటంచుఁదలంచి నేఁ దెగువనేసి
శబ్దభేదిని నొకఘోరశరము విడువ
నయ్యది యమోఘగతి మునీశాత్మజునకు.
తే. అంగమున గాడ హాశివా యనుచు నతఁడు
ధరణి వ్రాలఁగ నే విని చాపుకేగి
యాకుమారకుఁ గాంచి మహాభయంబు
గదుర నిలచిన నతఁడు నన్గాంచి పలికె.

ఉ. నీ ముకుమోమెఱుంగని యనింద్యచరిత్రు మునీంద్రపుత్రున
న్నేమి యొనర్చినాఁడనని యేసితి భూవర ! సాధుఁ జంపి త
ద్భీమతరాఘు మొంద మది వేడుక పుట్టెనె యంచుఁ బల్కనే
నామహితాత్ముతోడ వినయంబున నిట్లని విన్నవించితిన్. 52

క. దేవా! మృగమనియేసితిఁ
గావుము నన్నంచు నతని కాళ్లఁ బడఁగా
భూవర! నాదగుచావున
కై వెఱువనుగాని వినుము కాఁగలపనులన్. 53

మత్తకోకిల(?):—
కలరట నాతలిదండ్రులు వృద్ధులు
  గాఢతపోరతు లంధులు వా
రలు నను దాహజలంబులఁ దెమ్మన
  రంజలి వచ్చితి నియ్యెడకే

జలములఁ గైకొని వారలఁ జేరియు
సంగము ముందుగ నంబువులన్
బలుకుము సత్యము వారలదాహముఁ
బాపి తదంఘ్రులపైఁ బడుచున్. 54

వ. రాజవరా! నేఁ జచ్చిన యొఱింగిన నాతలిదండ్రులు బ్రతుకరు. వారలఁ బ్రార్థించి మన్నింపుఁడని కోరుము. వారలు ప్రాణంబుల విడచిన యీవల నాకును వారలకును దహనాది కృత్యంబులు గావించి పొమ్మని చెప్పిన విని బాణవేదన సైఁపఁజాలక బాధపడు మునికుమారుని వక్షంబున గాఁడియున్న శరంబుఁ బెఱుక నాతండు ప్రాణంబుల విడచె నంత. 55

క. వెతనొందుచు నేనా దం
పతులకడకు నేగి జలము వారల కొసఁగన్
సుతుఁడా యిటు లేటికి దడ
సితి వన నేఁ బలుకకున్నఁ జెందిన శంకన్. 56

క. నీవెవఁడవు మాసుతుఁ డేఁ
డీ వివరంబొప్ప సత్యమెఱిఁగింపనిచోఁ
జావ శపించెద మనినన్
గావుఁడని నేను వారికాళ్లన్ బడితిన్. 57

వ. పడి లేచి వినయంబున నావృద్ధదంపతులకు జరిగినవృత్తాంతం బంతయుఁ జెప్ప హాసుతా! హాసుతా! యనుచు వారిరువురు వేరెలుంగునఁ బరిపరి విధంబుల దుఃఖించి ప్రమాదవశంబున నేఁ దప్పుఁ జేసినందులకు నన్నుఁ గొంతవఱకు మన్నించియు

నీవు మానవలెఁ బుత్రవియోగదుఃఖంబున మ్రగ్గెదవని పల్కి
వారెసవుడు ప్రాణంబుల వీడిరి కావున. 58

క. నాకాశాపం బిప్పుడు
తాఁ కెన్ మునివాక్యమేల తప్పి చనునటం
చాకాకుత్థ్సుఁడు శోక
వ్యాకులుఁడై విడచెఁ బ్రాణవాయువులంతన్. 59

వ. అంతట దశరథుని ముప్వురు కాంతలు హానాథ! హానాథ! యంచు మహాక్రందనంబులు సేయుచు నేడ్చుచుండ వసిష్ఠుడు లేతెంచి వారలదుఃఖోప శమనంబుగాఁ బల్కి భరత శత్రుఘ్నులకుఁ దక్షణంబు బయలుదేరి రండని జాబులంపి దరశథు శవంబుఁ దైలద్రోణిఁ బెట్టించియుండ నంత నేడవ నాఁటికి భరత శత్రుఘ్ను లేతెంచి యావద్వృత్తాంతం బెఱింగి రంత భరతుండు. 60

క. కైకన్ గని సీవొక పెన్
రాకాసివి తల్లి కావు రాము నడవికిన్
బోకడనేసితి మగనిన్
భీకరవధ నేసితింక వెలయుమి ధరణిన్. 61

మ. కలనైనన్నినుఁ గోరినాఁడనట యీాష్ఠారాజ్యసంపత్తు ను
జ్వలతేజోనిధియైన రాము నడవిన్ వర్తింపఁ బొమ్మంచటుల్
పలుకన్నోరెటులాడె నీమొగమినీ పాపంబు సూడంగ, నెం
తలుగావించితె లోకనింద కయినన్ శంకింప కోరాక్షసీ. 62

వ. అని భరతుండు శోకకోపవిభ్రమభరితమనస్కుం డై యుండ, శత్రుఘ్నుండు కైకశిరంబుఁ దెగనేసెదనని ఖడ్గంబుఁ దీయ భరతుండు మాతృహంతలని మనమొగంబులు

రాముండు నూడం డుడుగుమని వారింప శత్రుఘ్నుం డా
చెంతఁ దొంగిసూచుచున్న మంథరన్గని దీనికతంబున నిట్టి
యసంగతంబులయిన దోసంగు లెసంగె నని దాని శిరోజం
బులఁ బట్టి నేలం బడవైచి పాదతాడనంబు సేయుచుండ
భరతుండు వారింప నూరకుండె నంత నాయిరువురు భ్రాతలు
కౌసల్యాగృహంబున కేగి యామెకు నమస్కరించి మహా
రోదనంబు సేయఁ గౌసల్య భరతున్గాంచి యిట్లనియె. 63.

మ. భరతా! పానెను రామునడ్డ మసనీపాలుండు పేస్వేచ్ఛె నీ
ధరణీరాజ్యము నీవు నీజననివేఁ బాల్పంగ నౌనన్న నీ
శ్వరుఁడే సాక్షిగఁ జెప్పెదన్వినుము మనోవాక్కాయకర్మంబులం
దెఱుఁగన్నేఁ గయికేయికృత్రిమము తల్లీ సత్యమాలింపవే.

క. అని భరతుఁడనిన తత్క్ష
ణమున సత్యము సత్యమంచు బోరున గగనం
బుననుండి యొక మహాధ్వని
వినవచ్చెఁ జనములెల్ల విస్మయ మొందన్. 65.

వ. అంతఁ గౌసల్యా సుమిత్రలు భరతుఁ గౌఁగిలించికొని మహా
రోదనంబు సేసిరి. వసిష్ఠుండే తెంచి ముందుఁ గార్యక్రమంబుఁ
జూడుండని భరత శత్రుఘ్నులచేత దశరథు శవంబునకు
నగ్నిసంస్కారంబు సేయించి తక్కినయపరకర్మంబుల విధ్యు
క్తంబుగ నడపించెఁ బిమ్మట భరతుండు రాముని పాలికేగి
ప్రార్థించి యాతనిఁ దోడ్తెచ్చి పట్టంబు గట్టెద, మనమందఱము
పోదము రండని సకలసైన్యసమేతంబుగ వసిష్ఠ వామదేవ
జాబాలి ముఖ్యులతో మువ్వురు మాతలతోఁ దానును
శత్రుఘ్న సహితంబుగా వల్కలాజినధారియై కదలి చని

త్రోవను గుహునకు భరద్వాజునకుఁ దన భావం బెఱింగించి సీతాలక్ష్మణ సహితుండై శ్రీరాముండు విశ్రమించియున్న చిత్రకూటంబు డాయఁజనె నంత. 66

క. సేనాగమరవ మానృప
సూనులు విని హేతు వరయుచు న్గనుచుండన్
దీనాస్య మొప్ప భరతుఁడు
సానుజుఁడై వచ్చె రామునంఘ్రులఁ గాంచన్. 67

వ. వచ్చి సీతాలక్ష్మణోపేతుఁడైన రామునకు శత్రుఘ్న సహితుండై నమస్కరించి వారలచే గారవింపఁ బడియె. సీతారామలక్ష్మణులు ముగ్వురు మాతలకు వసిష్ఠాది మునులకు నమస్కరించి రంత నా శ్రీరాముండు భరతున్గాంచి తండ్రి సేమంబడిగిన నాతండు మనజనకుండు భవద్వియోగదుఃఖంబు భరింప లేక దివంబున కరిగె ననియె. 68

క. అనఁ బిడు గడఁచినగతి నా
మనుజేశుఁడు లక్ష్మణుండు మహిసుతయున్ ధా
త్రిని మూర్ఛలొంది పడి శో
కనినాదము లెసఁగ లేచి కలఁగిన మతులన్. 69

వ. బహువిధంబులఁ దండ్రి [illegible]లంచి దుఃఖింప వసిష్ఠాదులచేఁ దెల్పఁబడి దుఃఖోపశమనంబునొంది స్నాతులై తండ్రికిఁ దిలోదకపిండప్రదానంబు లిడి యొక్కెడ నందఱు నాసీనులై యుండ. 70

చ. భరతుఁడు లేచి నమ్రుఁడయి పాపవిమోచననామ రామ యి
క్కరణిని బుద్ధిహీన యగుకాంత విరుద్ధపుఁ బల్కు లెంచి దు

స్తరవనసీమకుఁ జనుట సత్కరుణాబ్ధికి నీకుఁ గాదు నే
శరణము వేఁడువాఁడ నిను సన్మతి రాఁగదె రాజ్యమేలఁగన్.

ఉ. కైకదురిచ్ఛ సైఁచి త్రిజగంబుల నామెకు శాశ్వతంబుగాఁ
జేకుఱు దుర్యశంబును నశింపఁగఁజేయఁగదన్న తమ్ముఁడన్
నీకుఁ బదాశ్రితుఁ డనను గణించి కటాక్షము మీఱ రాజ్యము
గైకొనుమన్న నాకు నుపకారము సేయఁగదన్న మ్రొక్కెదన్.

చ. అన విని రాముఁ డిట్లనియె నన్వయకీర్తులు వమ్ముసేయుచున్
జనకునియాజ్ఞఁ బోనడచి చయ్యన నే నిలు సేర వచ్చినన్
ఘనతరదుర్యశంబు నరకంబు ధ్రువంబుగఁ గల్గుఁగాదె యి
త్తనుసుఖమే ప్రధానమని ధర్మము వీడఁగనౌనె తమ్ముఁడా.

చ. సతికి వరంబులన్ బతియొసంగ సుతుండవి పాటిచేసి స
మ్మతి నడపింపకుండుటది మంచితవర్తనమౌనె నేను సు
స్థితి వనవాసినౌదు, నిరసింపక నీవు ధరాధిపత్యమున్
బితృహితవర్తివై కనుము వేడుకలొందఁ జతుర్దశాబ్దముల్. 74

వ. అన భరతుండు శ్రీరాముపాదంబులపైఁ బడి యిట్లని
విన్నవించె. 75

క. శరణార్థి నేను మఱిసో
దరుఁడను నీకృపకుఁ బాత్రతముఁడను విశ్వ
చ్ఛరణాగతవత్సల న
న్నుఱనేయక పురికి రాఁగదన్నా రామా. 76

ఉ. అగ్రజుఁడుండఁ జిన్నకొడుకర్హుఁడె రాజ్యవిభూతికాగమో
దగ్రవిధుల్ దొఱంగుటది న్యాయమె నీకొకయాఁడుదానిదు
ర్నిగ్రహవాక్యమూని యిటు నిష్ఠురకానల కేగనౌనె దు
ష్టగ్రహచార మీఁగతిని సల్పె క్షమించి పురంబుఁ జేరవే. 77

క. కైకేయిఁ బశ్చాత్తాపో
ద్రేకంబునఁ బొగులుచున్నది మహాత్మా త
చ్ఛోకముఁ బాపఁగఁ బుర క
స్తోకకృపన్ రాఁగదయ్య శుద్ధచరిత్రా.

వ. అన్నా నీవు మత్ప్రార్థన మంగీకరించి పురికి రాకున్న నేనిదె
ప్రాయోపవేశంబు నొంది ప్రాణంబులు విడచువాఁడ నన
శ్రీరాముం డిట్లనియె.

క. మనవంటిధర్మనిరతులె
జనకాజ్ఞను మీఱి నడువ జనసామాన్యుల్
మనుదురె ధర్మము తప్పక
యనుజా! నీకిట్టివెఱ్ఱి యర్థం బగునే.

క. అన విని వశిష్ఠముఖరులు
మనుజేశా! భరతుమనవి మన్నించి పురం
బునకున్ విచ్చేయఁగదే
యనిరల జాబాలి యీక్రియన్ వచియించెన్.

చ. జనకునిమాటఁబట్టికొని సమ్మతిఁ గానల కీవుపోయినన్
గని యలరారునే యతఁడు కాయము వీడినపిమ్మటన్ వృథా
తనువును గాసిచేయుఫలితం బది యేమిశరీరియైన జీ
వునకుఁగలారె బంధుజనముల్ మఱి తద్విహితాహితక్రియల్.

చ. పరము పరం బటం చెదియొ భావమున న్దలపోసి సిద్ధమై
దరికరుదెంచుసౌఖ్యములఁ ద్రాజ్యము సేయుట మింటితమ్మిచే
కుఱునని చేతితమ్మిఁ గయికొనక విసర్జన సేయుటొాఁగదా
యొఱిఁగి యెఱింగి కానలకు నేటికిఁ బోయెదు రమ్ము రాఘవా.

క. మరణం బొందినవానికి
నెరపంబడునపరకర్మ నికరం బాతం
డరసి గ్రహించునె తల్లా
భరతలు ధర మనెడునట్టివారలు కారే. 84

వ. అనిన శ్రీరాముం డిట్లనియె. 85

శా. ఏమీ నాస్తికు నట్లుపల్కెదవు లేదే పారమార్థంబు దే
హామోహంబె ప్రధానమందు విధియేనా నీతపస్సంభవో
ద్దామ ప్రాజ్ఞత చాలుజాలు నీక సత్యవ్యాప్తి పిత్రాజ్ఞనే
నేమాత్రంబును వీడ నీడువచనం బెవిశ్వసింపన్ జుమీ 86

వ. అని మఱియు వశిష్ఠు నాంచి యిట్లనియె. 87

మ. పురికిన్ రమ్మనె దీవుకూడ గురుసంభూతోక్తికం బెన్ మహా
దరణీయంబులు తల్లిదండ్రులవిధుల్ తత్పుత్రకశ్రేణికిన్
గురువర్యా పితృనాజ్ఞవీడి పురమందున్ జేర నేవచ్చినన్
స్థిరధర్మంబును వమ్ముచేసినటుగాదే మీరె యోజింపుడీ. 88

క. ఇనచంద్రులు గతిదప్పిన
వనవాసవ్రతమ్ముమాన బదునాల్గేండ్లున్
మునులార నేడు పిత్రా
జ్ఞనుమీఱ నన న సంయమియంతన్. 89

ఉ. పాదుకలిమ్ము రాఘవ! కృపన్ భరతుం డవిగొంచు నేగి స
మ్మోదముమీఱ వానికి బ్రభుత్వము నిల్పి ప్రధానివై ఖరిన్
గాదనకుండ రాజ్యమును గాంచుచునుండుచతుర్దశాబ్దముల్
నీదగునాజ్ఞ నన్ను గరుణించి యొసంగె నతండు పాదుకల్.

వ. అంత భరతుం డప్పాదుకలు దలపై దాల్చి రామా! నీవు
పదునాలుగేండ్లు గతించిన మఱునాడ యోధ్యకు రాకున్న

నేఁ బ్రాణంబులు డచువాఁడ నని పల్కి జానకీ లక్ష్మణ సహితుండైన శ్రీరామునకుఁ బ్రదక్షిణనమస్కారంబులు గావించి వీడ్కొని జననీ జ నా ను జ ము ని యు క్తుం డై సైన్యంబుతోఁ గదలి రామశూన్యంబగు నయోధ్య నుండ నొల్లక తత్సమీపగ్రామం బగు నందిగ్రామంబున నిలచి శ్రీరామ పాదుకలకుఁ బట్టాభిషేకంబుఁ జేసి భరతుండు శత్రుఘ్న సహితుండై రాజ్య మేలుచుండె నంత నిక్కడ.91

ఉ. రాముఁడు చిత్రకూటశిఖరంబుననుండి సుమిత్రసూతితో
భూమిజతోడ డిగ్గి వనభూములఁజూచుచుఁబోయిపోయి యు
ద్దామతపోగరిష్ఠుఁడును ధర్మరతుండును నైన యత్రినిఁ
గామితమారఁ జేరఁజనఁగా మునివర్యుఁ డెఱింగి ప్రీతుఁడై.

గీ. అర్ఘ్యపాద్యాదివిధులచే నాదరించి
విష్ణునంశజులని వారి వినుతిసేసి
దివ్యఫలములచేత నాతిథ్య మొసఁగి
తన శుభాశ్రమమున నిల్పె దాశరథుల 93

ఉ. ఆమునిపత్ని సద్గుణ సమంచితయౌ ననసూయదీపితో
ద్దామ పతివ్రతామణి ముదంబున సీతను గాంచి తద్వివా
హామృతతుల్యవార్తలఁ బ్రహర్షమున న్విని ప్రీతినిచ్చె నా
భూమిజ కుజ్వలన్మహిమముల్ దనరారెడి కుంకుమంబునున్.

మాలిని. అమలినమునిసంగా యాశ్రితక్లేశభంగా
సముచితమృదుభాషా క్ష్మాసుతాచిత్తతోషా
కమలమృదుదళాక్షా కమ్రకారుణ్యవీక్షా
విమతమదవిదారీ విద్వదానందకారీ. 95

గద్య. ఇది మంత్రికులోద్ధారక రామయకుమారభద్రాచలనివాస తూము సీతారామదాసప్రణీతంబయిన సీతారామరామాయణకావ్యంబునం దయోధ్యాకాండకథాసంగ్రహ మేకాశ్వాసము.



తనరు నున్దండదండకోదగ్రవనము
లోన జానకితోఁగూడి భానుకులుఁడు. 3

మ. చనుచుఁ గోమల దేహయైన జనకక్ష్మాపాల సత్పుత్రి య
వ్వనమందుం నడువంగలేక చరణాబ్జంబుల్ గడున్నొచ్చి యె
త్తినబారన్, దను వెల్లఁ జెమ్మటలు గారన్, నోట నీరార, నా
థునికై పండల నండగాఁ గొనుచు నెంతో కష్టభూయిష్ఠయై.

క. అడుగులు తడబడ నెడనెడఁ
దడయుచు బతితోడ నెంత దవ్వింకవనిన్
నడువఁగవలె నని యడుగుచు
నడు గామడగా ధరాజ యరుగుచునుండన్. 5

క. పిడుగులఁబోలెడు నొకచ
ప్పుడు వినఁబడి సీత యడల భూవరసుతు లి
బ్బెడిదఁపురవ మేదిక్కునఁ
బొడమెనొ యని యటుల నిటులఁ బొడఁగనుచుండన్. 6

సీ. ఇనమండలము లటు లెఱ్ఱనై గుండ్రనై
ప్రభలీను కన్నవఁ గ్రాలువాఁడు
మేఘగర్జనలను మించు కంఠధ్వని
కడలి పాఱు మృగంబు లదరువాఁడు
కరి హయాదులఁబట్టి కఱకఱ నమలుచు
నుగ్రధ్వనులు సేయుచుండువాఁడు
సాల సన్నిభమైన శూలంబు నొకకేల
గొని మృగంబులఁ గుదిఁ గ్రుచ్చువాఁడు

తే. గగనమును ముట్టు పొడవును తగినలావు
నెసఁగి నడగొండ యన నొప్పు నసురు దిక్కు

బవర నృపహాసముఁ జేయునట్టి వాని
విస్మయంబునఁ గాంచి రా వీరవరులు.

క. కని నృపసుతుఁ డీ వెవ్వఁడ
వన చరుఁడ ఘనతపస్విజనావళిఁ దినుచున్
మనెద విరాధుఁడ మీ రీ
వనిత నొసఁగుఁ డంచు సీతఁ బట్టె రయమునన్. 8

చ. కొని చనుచుండ లక్ష్మణుఁడు క్రూరశరంబుల నేదు గాడనే
యసుర తఁడు శూలము న్వ్రయిన నారఘురాముఁడు దాని
ధాత్రి ద్వ్రాల్చ నిశితబాణమేసి పగిలించెను దైత్యునివక్ష
మంత సీతను నటఁ డించి రాసుతుల దర్పమెఱుంగక పట్టె
దైత్యుఁ డపున్. 9

ఉ. పట్టి భుజంబులందు నిడి పాఱుచునుండ ధరాజ గాంచి న
న్నట్టడవిన్ త్యజింపఁదగునా యని యేడ్వఁగ రామలక్ష్మణుల్
నెట్టన దైత్యుబాహువుల నిష్ఠుర ఖడ్గహతిన్ ధరన్ బడన్
గొట్టి ధరిత్రి పట్టి కడకున్ జనుదెంచిరి విక్రమోద్ధతిన్. 10

వ. అంతఁ బాంథవిరోధుండగు నవ్విరాధుండు విలుంఠిత బాహుండై ధరిత్రిఁ గూలి దాశరథులన్ జూచి వారి వృత్తాంతం బెఱింగి నమ్రశిరుండై యిట్లనియె. 11

తే. అధిప నేఁ దుంబురుండను యక్షవరుఁడ
రంభతోఁ గూడి తన్నుఁ దిరస్కరింప
శాపమిచ్చెఁ గుబేరుఁ డీచక్కి నసుర
దేహమూని మృగంబులఁ దినుచునుండ. 12

తే. అంత నే నామహామహు నర్థివేడ
రామలక్ష్మణు లెప్పు డుగ్రముగ నీదు

బాహువులు ద్రుంతు రపుడు శాపంబుఁ బాసె
దనుచు వచియించెఁ గాన నో యనఘులార. 13

వ. మీకృపావశంబున నిపుడు నాశాపంబు పాసె నింక నాస్వస్వ రూపంబునఁ బోయెద నిటనుండి శరభంగు నాశ్రమంబున కేగుం డాతండు మి మ్మాదరించు నని తెల్పి విరాధుండు ప్రాణంబులు విడువ నాతనిగాత్రంబు ధాత్రిఁ బాతిపెట్టి యమ్మువ్వు రవ్వలి మార్గంబునఁ జని. 14

చ. చని శరభంగు నాశ్రమము చక్కికి నేగ సురేంద్రుఁ డమ్మునిన్
గొని చనవచ్చియుండి రఘుకుంజరు నాగమనంబుఁ గాంచి
యా, యనఘుని దర్శనార్థమనువౌసకుయంబడి కాదటంచుఁ
బో,యె నృపుల నాదరించుమని యేర్పడ మౌని కెఱుంగఁ
దెల్పుచున్. 15

వ. అంత నామునీంద్రుం డారాఘవుల నెదుర్కొని నమస్కృతుండై వారలఁ దనయాశ్రమాంతరంబునకుఁ, గొని చని యాతిథ్యం బొసంగి రామునితో నిట్లనియె. 16

క. నరవర త్రిదివంబున కే
నరుగఁ దలఁప నింద్రుఁ డిటకు నాగతుఁడై మి
మ్మెఱిఁగి చనె నేను మీకా
దరమున నాతిథ్య మొసఁగఁ దడసితి నిచటన్. 17

క. అనఘుల మిముఁ బూజించిన
ఘనతర సుకృతమునఁ దపము కాంచెను సిద్ధిన్
జనవర నీకేది కావల
సిన నిచ్చెదఁ దెల్పుఁడనిన క్షితిపతి పల్కెన్. 18

వ. మునీంద్రా ! నీకటాక్షంబున మాకు నన్నియు సులభంబులై

గనున్న యది. మే మీవనంబున నెందుండఁ దగునో యాన
తిమ్మనిన నమ్మునీంద్రుఁ డిట్లనియె. 19

క. శ్రీపతి కలఁడు సుతీక్ష్ణుని
భూరితరాశ్రమము మీకుఁ బొం డచటికి నా
సారతపోనిధి యిమ్ములఁ
గోరికలారంగ నిల్పికొను నని పల్కెన్. 20

వ. అని పల్కి దాశరథులకు మఱునాఁడు సుతీక్ష్ణాశ్రమంబునకుఁ
ద్రోవ సూపించి తానగ్నిముఖంబున మహేంద్రలోకంబుఁ
జేరె నంత రాఘవులు సుతీక్ష్ణాశ్రమంబుఁ జేర నేగిన. 21

క. ఆమునివర్యుఁ డెదుర్కొని
రామాదులు మ్రొక్క సాదరంబున వారిన్
గామిత మారఁగఁ గొని చని
యేమేమో తెచ్చి విందు లేర్పడఁ జేసెన్. 22

చ. మునివరు లెందఱో యటకు మోదముతోడుత వచ్చి
దైత్యనాశనమున కారమావిభుఁడు క్ష్మాతలి శ్రీరఘు
రామమూర్తియై, వనగతినున్న వాఁడని తపఃపరిపాకముచే
గ్రహించి మమ్ము నసురబాధఁ బాపి కృపఁ బ్రోవు మటంచు
నుతించి వేఁడుచున్. 23

క. ఒక్కొకదిన మొక్కొకముని
మక్కువ నెక్కొనఁగ స్వాశ్రమముఁ జేరంగా
నక్కరుణాళులఁ గొని చని
చక్కని యాతిథ్యముల నొసంగుచునుండన్. 24

రాఘవు లాప్రాంతంబుల నుండు దైత్యుల ననేకుల వధించి,
మునుల కామోదంబుగావించుచు నరణ్యంబులఁ దనరారు

బూఁదేనియలఁ గందమూలఫలాదులఁ దెచ్చి మహానుల
కొసంగుచుఁ గాలంబుఁ గడపుచుండ నొక్కనాఁడు జానకి
యొరులెవ్వరు వినకుండ శ్రీరాముని కిట్లనియె. 25

క. దనుజు లెపుడు మన కహితం
బొనరింపరు వారిఁ జంపఁబోలునె మీకున్
జనునె యకారణవైరం
బును దైత్యులతోడ మనకుఁ బూనుట నాథా. 26

క. అన జానకి హితబుద్ధికి
మనమున రఘురాముఁ డలరి మానిని నీచె
ప్పినమాట సత్యమైనన్
దనుజులు సత్సాధుజనవితానవిరోధుల్. 27

చ. అడవుల నాకలంబుఁ దిని యాత్మవిచారముల న్దినంబులన్
గడపుచు సర్వభూతహితకాములుగాఁ దనరారుమానులన్
గెడపుచు హింసచేయుచు వినిందితవృత్తిఁజరించు దైత్యులన్
మడియఁగఁజేసి సాధుల కమందసుఖం బొనగూర్చు టొప్పదే.

వ. అని సీతకు సమాధానంబు సెప్పె నంత రాఘవు లయ్యెడఁ
గల మునికదంబంబుల కనేకవిధంబుల హితంబుసేసి రాక్షస
బాధలుపాపి యన్యోన్యాశ్రమంబుల దశాబ్దంబులు గడపి
యమ్మానుల వీడ్కొని యగస్త్యాశ్రమంబుఁ జేర నమ్మహా
ముని దాశరథుల గారవించి భవసాగరతరిద్దైన శ్రీహరి
భూభారహరణార్థమై మాయామానుషరూపంబున వచ్చె
నని మనంబున ఘనంబుగఁ గుతూహలంబు గాంచి తనయొద్ద
నున్న యక్షయతూణీరకోదండకృపాణాదుల సమర్పించి

పలుకుచుండ శ్రీరామచంద్రుం డమ్మునీంద్రు నవలోకించి
యిట్లనియె. 29

క. వనవాసశేష మయ్యెడ
మనసగునో యూతఁ దెల్పు మౌనీంద్ర యనన్
మునిచంద్రుఁ డించు కాలో
చన సేసి వచించె రామచంద్రునితోడన్.

క. గోదావరినదియొడ్డున
మోదావహ మైనక్షేత్రము కల దొకఁటి య
మ్మేదినిఁ బంచవటి యనం
గాఁ బగు నందుండ నొప్పు క్ష్మావర యనినన్. 31

చ. వినమితులై యగస్త్యముని వీడ్కొని జానకిఁగూడి రాఘవుల్
చనిచని గౌతమీతటి నెసంగెడు పంచవటంబుఁ జేరి యం
దనుజుఁడు వాస్తుశాస్త్రహిత మారఁగ నొక్కకుటీరముఁ ఘ
టించ రఘుశేఖరుండట వసించె ధరాజనుగూడి వేడుకన్.

సీ. ఉదయంబుననె లేచి వదినె కన్నకు మ్రొక్కి
కాలోచితక్రియల్ గడపి యవలఁ
గానకు నేగి చక్కని కందమూల ఫ
లాహారములఁ దెచ్చి యనుజుఁ డొసఁగ
జానకీలక్ష్మణసహితుఁడై రాముఁ డా
యాహారములఁ దృప్తినంది మనుచు
సతియుఁ దమ్ముఁడు తన్ను నతిభ   సేవింప
వనవాస మది శుభావహము కాఁగ

తే. రాముఁ డటనుండె మునిహితకాముఁ డగుచుఁ
గొన్ని యబ్దంబు లావలఁ గ్రూరదైత్య

హారణ మొనరింప విధివశంబైనయట్టి
సమయ మేతేర నొకదివసంబునందు. 33

చ. వనమున కేగి లక్ష్మణుఁడు బంధురకాంతులనీను చయ్యెడన్
గనఁబడు నొక్కఖడ్గమును గైకొని యంపలివేణుసంఘమున్
మొనకొని కూల్ప నందొకమనుష్యుఁడునున్ హతుఁడై ధరన్
బడన్, జనవరసూనుఁ డాతఁ డొకసంయమి యంచుఁ
గలంగి భీతుఁడై. 34

చ. అనుజునిఁజేరి మ్రొక్కి గతమైనప్రమాదముఁ దెల్ప రాముఁ
డున్, మనమున భీతినొంది యట మౌనులఁ గొందఱిఁ
గాంచి మ్రొక్కి వ్వారి నడుగ నీదుతమ్ముఁ డొనరించె
మహోపకృతిన్ ధరిత్రిఁగూ,లిన యతఁ డొక్కదైత్యుఁడు,
చలింపకుఁ డంచు వచించి రామునుల్. 35

వ. అంతఁ గొంతసేపటికి శూర్పణఖ తనకుమారుం డగుజంబు
కుమారున కాహారంబుఁ గొనివచ్చి యాతం డటఁ జచ్చిపడి
యుండుటఁ గాంచి శోకకోపపరవశంబున మహాక్రందన
ధ్వనులుసేయుచు నాచెంతనుండు మౌనులకడ కేగి తన
తనూజుఁ ద్రుంచినవానిఁ జేర్కొనకున్న మిమ్ముంబఱిఁ దెగ
టార్చెదనన్న వారు భీతులై పంచవటీతీరంబుననున్న రాజ
కుమారుం డొకండు నీతనయు ఖండించెనని తెల్ప వానినిఁ
బరిమార్తునని మహారోషావేశంబున నటకుఁ జని. 36

చ. కనె నచట న్నవనీలమణికాంతులనీను మనోజదివ్యరూ
పు నొకని స్వర్ణదేహరుచిఁ బొల్చు మఱొక్కని, లోకమం
దెటన్, వనరని మేనిసొంపుగల తన్వి నొకర్తెను, గాంచి

యిట్టి సొంపెసఁగు మహోజ్జ్వలాంగులను నెన్నఁడు ము
గ్గురం గాంచి ద్రాంతరైరి. 37

సీ. ఈస్వసాత్మజులతో నెనసివర్తించెడు
 చెలువంబుఁ గనవట్టె చెలియ చెలియె
యీలలితాంగుల నాలింగనములచేఁ
 బెంపొందనిమగువ సొంపు సొంపె
యీసరోజముఖులతో సరసగతుల
 ముద్దులాడనికాంత పొలుపు పొలుపె
యీవిభవాఢ్యుల మోవితేనియలాని
 సౌఖ్యనియతిలివేణి సుఖము సుఖమె

తే. యీస్మరాకారులను గూడి యెల్లయపుడు
రతులఁ దేలని తరళాక్షి బ్రతుకు బ్రతుకె
యనుచు బహుమోహవివశయై యట్టి కాంచి
మనుజపతిరూప మూని యామనుజకాంత.

చ. తనయునిచావుకైన పరితాప మెటుల్ సనెనో సుతు న్వధిం
చిన నృపసూనుఁ ద్రుంప మదిఁజెందిన కోపము డెందుఁబోయె
నో, వనితగతస్థితుల్ మఱచి భావజరూపుల నానృపాలురఁ
గనుగొని మోహబద్ధయయి కాముని డాకకు మెందు
నొచ్చుచున్. 39

తే. రామచంద్రు డాసి రాజ మీరెవ రివ్వ
నమున కేల వచినా రనంగ
నతఁడు తెల్ప సర్వ మాలించి చిరునగ
వాలయ నానృపాలుఁ గలయఁజూచి.

క. నినుఁగన్నది మొదలు మదను
సునిశితశరతాపమునకుఁ జొక్కితి పతులన్
దనుపుము నన్నన రాముఁడు
దనుజాంగనఁ జూచి సుస్మితముఖుఁ డగుచున్. 41

చ. కలడిదియే మదీయసతి కాంత లికేటికి నాకు నన్న నీ
చెలి యతిముగ్ధ, దీనసుఖసిద్ధి యొసంగఁడు నీకు దీని నేఁ
బొలియఁగఁజేసినన్ సురతపూర్ణసుఖంబులఁ దేల్తునంచు నా
జలజ పైఁ గవయ త్మాఁ దానవినాపి యిట్లనెన్.

చ. కనుమట నాదుసోదరుఁడు కాంచన సద్రుచి గ్రాలువాఁడు నీ
కనువగునాతని న్గలయ నయ్యెడ కేగుమటంచుఁ జెప్పి త
మ్ముని గనుసన్న సేయ నది పోయి సుమిత్రకుమారుఁ జూచినన్
మనసిజకేళిఁ దేల్పుమన త్మాపతిసూనుఁడు నవ్వుచు న్వెసన్. 43

మ. కలికి రష్మని దానవిన్ గడిసి రక్తంబొల్క ముక్కున్ జెవుల్
బలవంతంబుగఁ గత్తిచే దునుము నవ్వాపాత్మురా లేడ్చుచున్
బలుకన్గూడని తిట్లు దిట్టుచు మిమున్ ఖండించి మీ మేను కం
డలు గ్రద్దల్దినవైతుఁ జూడుఁడనుచున్ బాఱెన్ రుషావేశయై.

వ. అంత నక్కాంత దిగంతంబుల ద్రువ మహాక్రందనధ్వనులు సేయుచు ఖరాసురుపాలికిన్ జని జరిగినవృత్తాంతంబంతయుఁ దెల్ప నాతండు దురంతక్రోధస్వాంతుండై యానరాధములు నాపరాక్రమం బెఱుంగరు కాఁబోలు నిఁక నెఱింగెదరు గాకయని వారల వధించి రండని యేడ్గురమహాబలాఢ్యు లగుదానవులఁ బంప వారలఁ దోడ్కొని శూర్పణఖ రామాశ్రమంబుఁ జేరన్ జన. 45

క.
శ్రీరామాంబకసంస్తకమునఁ బ[illegible] స్గాల్పన్
[illegible] శోకక్రోధభ
యామంబధ్వనుల దిక్కులద్రువఁగ బాఱెన్. 46

[illegible] పోఁజే ఖరుని పాదంబులపై వ్రాలి యన్నా! యిట్లీ వెంబడించిన నాకెందునలఁజేఁ జంపఁబడుటయే కాని వారలఁజంప సమర్థులు కారు. నీవు సర్వసైన్యసమేతుండవై వచ్చి నాయిరువుర భ్రాతలఁ గడతేర్చి సౌందర్యబంధురమైన యారాముని సుందరిఁ దెచ్చి యనుభవింపు మింతకంటె నుపాయంబు లేదన ఖరుండు హర్షించి యిట్లనియె. 47

క. ఈయల్పమనుజాధములను
బోరిగొన నేఁటు భూరిసైన్యము వెడలి చనినన్
ధరణీజనములు నగరే
తరమే రాక్షసుల నెదుర దాశరథులకున్.

క. అన దానవి యిట్లనియెన్
మనుజులెవారుగ్రదైత్యమండలిఁ ద్రుంపన్
జనియించిన హరిహరులనఁ
జనువారలె తగుదు రెల్లజగముల నడపన్.

వ. అన ఖరుండు క్రోధోద్ధురుండై తన యావత్సైన్యంబునకు యుద్ధయాత్ర ప్రకటించిన. 50

సీ. పదునాల్గువేలశుంభప్రభృతికాసుర
శ్రేష్ఠులు తమవెంటఁ జేరి కదల
కరియూథములు ఘోటకప్రతానంబులు
భూరజం బెగయ నేపారినడువ

ధనురస్త్రఖడ్గగదాతోమరాదులు
దాల్చి యగ్రమునఁ బదాతులు నన
పటహభేరీశంఖపటుభయదధ్వనుల్
దశదిశలను బ్రతిధ్వనులఁగొల్ప
తే. శత్రుమారణోగ్రవీర్యదుస్తరుఁడు ఖరుఁడు
దోర్బలవిభీషణుం డగుదూషణుండు
కడు భయంకరుఁ డగుత్రిశిరుఁడును గలసి
రాము నెదిరింప వెడలి రుగ్రమున నంత. 51

క. దూరమున మహితసేనా
వారధ్వని విని రఘుప్రవరుఁ డది రక్షో
ఘోరాంగన కృతబహుదు
ర్వారపటాటోపమంచు భావించి వెసన్. 52

వ. లక్ష్మణుఁ జీరి యిట్లనియె. 53

చ. కనుమదె లక్ష్మణా మనలఁ గారియ బెట్టినదైత్యకాంత దు
ర్దనుజచమూసమూహముల దర్పితవృత్తిని దెచ్చుచున్నదో
యనుజ! ధరాజ చూచిన భయంపడుఁ గావున నాసతిన్
వెసన్, గొని చనుమద్గిరీంద్రమునకున్ బహుజాగ్రత నుండు
మయ్యెడన్. 54

తే. సంగరావేశ నొందు పల్కంగఁబోకు
మెఱుఁగుదును నీదుబాహుసమిద్ధబలము
నేనొకండనె యీసర్వసేనఁ గూల్తు
గాంచుచున్నాఁడవిజయలక్షణము లిపుడు. 55

వ. అని లక్ష్మణునితో ధరాసుతను బంపి కవచకార్ముకబాణతూణీర
ఖడ్గాదియుద్ధసాధనంబులు ధరించి శ్రీరాముండు రక్ష

సైన్యంబుల నెదుర్పఁబోవుచుండ సురలు రణవీక్షణాతు
రులై విమానంబులెక్కి వచ్చి వియత్తలంబున నిల్చి. 56

క. ఒక్కఁడు రాముఁడు దనుజులు
పెక్కురెటుల నీరణంబు వెలయునొ యంచున్
వెక్కసమునఁ గన రాముఁడు
గ్రక్కున నరి మార్కొనంగఁ గన్గొని దనుజుల్. 57

మ. ఇతఁడే రాముఁడు చంపుఁ డేయుఁడని యెంతేనిన్ గ్రుధా
వేశపూరితులై దానవు లాయుధంబులను దోర్వీర్యంబు
లే [illegible]ఁగా, క్షితినాథోత్తము మీఁదవైనఁగదనస్థేముండు
రాముం డుగ్రతనన్నింటి నడంచి ఘోరనిశితాస్త్రజ్వాలల
గ్రప్పుచున్. 58

మ. శరవర్షంబున శత్రుసైన్యసమితిన్ జక్కాడుచున్ రాముడు
ధరకోదండకళావిజృంభణమునన్ దోర్దర్పమున్ జూప నా
సురసేనల్ చెయికాళులాడక రణక్షోణీతలిన్ గూలె, భూ
వర సామర్థ్య మమానుషం బని సురవ్రాతంబెద న్మెచ్చఁగన్.

క. శరములఁ దొడుగుట విడుచుట
లరయఁబడక ధనువు గుండ్రనై యుండుటయున్
సురశత్రులు కూలుటయున్
బరికింపం బడుచునుండెఁ బవరమునందున్. 60

క. విఱిగెడు తేరులు కూలెడు
హారులున్ ధరఁద్రెళ్లు కరులు నవనిన్ బడునా
సురుల శిరంబులు కలదై
పరగెను రఘురామురణము భయదం బగుచున్. 61

వ. ఇట్లు సకలసేనానివహంబు కూల ఖరదూషణత్రిశిరులు తమలోఁ
దా మొక్క నరునకుఁ బెక్కండ్రు చిక్కుటకంటెఁ బరిభవంబు
కలదే యని వితర్కించి యానరాధముఁ గూల్పక పోరాదని
రోషావేశంబున నమ్మువ్వు రొక్కుమ్మడి రామునిపైఁ గవిసి.

మ. పటుశస్త్రంబుల నేయుచు న్మిగుల దుర్వారోద్ధతిన్ సంగరో
ద్భటుఁడౌ రాముని మేన రక్తము స్రవింపన్ జేయ నావీరుఁ డు
త్కటరోషంబున వారల న్విరథుల న్గావించి నొప్పించి దు
ర్ఘటశౌర్యున్ ద్రిశిరున్ దలల్ దెగి పడంగా నేసి బిట్టార్చినన్.

క. అటు ద్రిశిరుఁడు ధరణిన్ బడఁ
బటుతరకోపమున ఖరుఁడు వాని యనుజుఁడున్
జటులగతి రాముపై సు
త్కటముగ బాణంబు లేసి కడు నొప్పింపన్. 64

మ. అలుకన్ రాముఁడు వారివిండ్లఁ దనయస్త్రాళి న్విదారించి దు
ష్ప్రళయాగ్ని ప్రదరంబు లేసి దనుజేశద్వంద్వమున్ రక్తధా
రలు కారన్ ధరఁగూల్చె యొక్కఁడును సప్రాణుండు కాకుండ
[illegible]రల నిశ్శేషము చేసె సర్వజగముల్ రంజిల్లి మేల్మేలనన్

వ. అంతఁ జుప్పనాక రామునమానుషపరాక్రమంబునకు వెఱంగు
పడి మహాకోపవిభ్రమవ్యాకులయై హాహానాదంబులు
సేయుచు లంకకుఁ బాఱె సురలు విరులవానలు గురియ
దేవదుందుభులు మ్రోఁగ దివిజకాంతలాడ మునిసంఘంబు
లేతెంచి సాధుబాధావిరాముం డగు రఘురాము వేనోళ్ల
వినుతించి రంత సీతాలక్ష్మణు లేతెంచి మ్రొక్క వారలతో
యుద్ధవార్తలు ప్రకటించుచు శ్రీరాముండు స్వాశ్రమధా
ముండై సుఖంబున నుండె నంత 66

క. శోకధ్వని దిక్కుల ను
ద్రేకంబుగఁ బర్వఁ బొలసుదిండిగరిత లో
కైకద్రావణు రావణుఁ
డాకులమందఁగ వాని యంఘ్రుల వ్రాలెన్.

వ్రాలఁగఁ గని యాతఁ డనిక
జాలింబడఁ జేసినట్టి జనుఁ డెవ్వం డు
ద్వేలపరాక్రము నన్ననఁ
జాలఁడొ మనపలఁవు లేవొ క్ష్మాతలమందున్.

యిట్టులఁ బలికె నాసఖి పంచవటీతటంబునఁ
మనుజవరేణ్యు లిద్వురను మానిని యొక్కతె యున్నవార
లా, ఘనులసమానబాహుబలగర్వము నన్నను నిట్లొనర్చి
యే, మనఖరదూషణాదినిఖిలాసురవీరుల వ్రాల్చి రుగ్రతన్.

మ. వినుమా మర్త్యులు మర్త్యులే త్రిజగముల్ విధ్వంసముం
జేయనో, జినబాహాబలధుర్య్య లాహరిహరుల్ విశ్వంబ
దైత్యంబు సే, య నిలఁ వారయి పుట్టిరో తెలియరా దర్వీ
రులఁ గెల్వ నీకు నసాధ్యం బని తోఁచు నింక వినుమా
క్షోణీజలావణ్యమున్.

సీ. ఆసతి సౌందర్య మజునకైనను దెల్పఁ
గా దట్టికాంత లోకమున లేదు
మోమువైఖరి కోడి సోముఁడు నభ మెక్కెఁ
గనుల కందక నీటఁ గలసెఁ దమ్మి
చనులకు సరిగాక చక్రముల్ తరువెక్కె
సతికోడి సుమమయ్యె స్మరశరంబు

నడలముంపఱచిగ దుడుపయ్యో నంచ ప
ల్కుకుజంకి పాఱెను శుకపికంబు

తే. లజ్జసృష్టి యనం జన దాతయణిసి
లచ్చి యాదూపమున నిగి నచ్చునేమొ
చక్క వర్ణింప మాటలు చాలవన్న
చూచినను గాకతీఱ దానుపతిసొంపు.

క. కనువారల చేతనముల
చనువునఁ గన్రెప్ప ప్రాల్పఁజాలక యువతిన్
గనుచుం బ్రతిమ లై మోహిం
త్రనఁ బురుషుల మాటయేటి కయ్యో తెల్పన్.

శా. అన్నా నావగు యోజన న్వినుము నీ వాకీపలన్ యుద్ధమం
దెన్నండున్ బరిమార్పలేవు కుహనాహీః      రంబు నే
నన్నద్దమ్మునిఁ గానకేగఁ బగుకార్యం బందు సంధించి యా
పెన్నివే సని సంగ్రహింపఁ దగుఁ బ్రావీణ్యంబున న్రావణా.

క. అవ్విధిఁ జేసినవా రా
జవ్వని బొడఁగాన లేక చచ్చెదరు వనిన్
నెవ్వగచే సుఖముగ నీ
వవ్వనిత న్గూడియుండ నగునని పల్కెన్. 74

గీ. మంచియోజన సెప్పితి మగువ యనుచుఁ
బలికి యట్టులఁ జేసి నీపరిభవంబు
దీర్చెదను పొమ్మటంచు నాతెఱవ నంపి
తలఁచె నీరీతి రావణదైత్యవరుఁడు. 75

మ. మును నేనల్ల సనత్కుమారువలనన్ బొల్పార విన్నట్లు వి
శ్వనియంతుం డగువిష్ణు విష్ణు డినవంశంబందు రామాఖ్యసం

జనసం బంది కమాసమేతముగ మత్స్యంహారముఁ జేయవ
చ్చె నిదే మోక్షపుజాడ యంచు బహుహర్షించెఁ దశా
స్యుండెవన్. 76

ఉ. నేనొకఁడ న్విముక్తిసుఖనిర్మలసిద్ధిని గాంచుకంటె నా
తో నఖిలాఘముల్ వలిపి దుర్జనులైననిశాచరాళులుఁ
శ్రీనిలయోగ్రబాణహతిజీవములన్ నెడబాసి మోక్షసు
స్థానముఁ జేరఁటొప్పునని దైత్యవరుండు నిరూఢచిత్తుఁడై. 77

క. సీతాఖ్య నొక్క లక్ష్మిఁ
బ్రీతిఁ గొని తెచ్చి రామపృథ్వీశునిచే
భూతలి సకలాప్తహిత
వ్రాతముతోఁ జచ్చి ముక్తిఁ బడసెద నంచున్. 78

వ. అని తనలోఁ దా భావించి చూపఱులమ్రోల నుదగ్ర
క్రోధంబు బ్రకటించుచు మారీచుఁ జీరి సీతాపహారణంబు
నందుఁ దనకు సహాయంబు కమ్మని కోరి ముందు నడుపవల
సినకార్యక్రమంబుఁ దెల్పి పిశాచముఖాశ్వంబులుకల రథం
బధిరోహించి వెలువడుమన మారీచుండు భయకంపితసర్వా
వయవుండై రావణు న్గాంచి యిట్లనియె. 79

ఉ. రావణ! నీవెఱుంగవొకొ రాము నమానుషవిక్రమక్రమం
బే విశదంబుగా మును గ్రహించితిఁ దత్సమధైర్యశౌర్యబా
హావిలసద్బలాఢ్యుఁగన మాతని చిన్నటినాటి యేటుచే
నే వనరాశిలోనఁబడి యెట్టులొ ప్రాణముతోడ నిల్చితిన్.

సీ. మదగజేంద్రసహస్రమహితబలాఢ్య యౌ
మాతల్లిఁ దాటక మహిని గూల్చె

నినుజయించినయర్జునుని వధించినభయం
    కరుభృగురామునిగర్వ మడఁచె
దిక్పతులకునైనఁ దెవులుగొల్పు మహాప
    రాధుఁడైనట్టి విరాధుఁ గూల్చెఁ
బదునాల్గువేలశుంభత్సైన్యములతోడ
    ఖరముఖాసురుల నొక్కండె త్రుంచె

తే. నట్టి దుర్జయశౌర్యున కపకృతంబు
సల్పి బ్రహ్మకునైనవశంబె బ్రదుక
నిద్రితాహిని మేల్కొల్పి నెట్టనేల
కూడునే పాలుబండ్ల కంఘ్రులనుజాప. 81

ఉ. కావున నెంతయో సుఖముగా మనుచుండెదు నీవు నిట్టిదు
ర్భావ మదేలపుట్టె నసురప్రళయంబు సమీపమయ్యెనో
నీవును నేను మృత్యుముఖనిర్గతమౌగతి డాసినప్పెనో
రావణ! నాదుమాట విని రామునిజోలికిఁ బోకు మానుమీ.

వ. అన రావణుండు వికటభ్రూకుటీముఖుండై మారీచు న్గాంచి
యిట్లనియె.

శా. ఓరీ నీచ యెవండురా సముఁడు నా కుర్వీతలిన్ దండ్రి ఛీ
పోరాయంచన విల్లువీడి గహనంబున్ జేరు మర్త్యున్ని రా
ధారున్ రాముని గీము మింటి పొడవెత్తన్ జూచె దిప్డీవు నా
తో రాకున్నెడ నీతలన్నఱకివైతున్ దక్షిణం బంచనన్. 84

ఉ. వీఁడతిముష్కరుండు రఘువీరునిచే హతుఁడౌట నిక్కమేఁ
బోడిమి నెంతసెప్పినను బుత్తెను బుట్టినబుద్ధి సుంతయున్
వీడఁ డితండు నే నితనినిష్ఠురఖడ్గముపాలుగాక మా
రాడక పోయి రామునిశరాహతిఁ గూలి విముక్తిగాంచెదన్.

గీ. అనుచు మారీచుఁ డేఁచి యాయసురుతోడఁ
చనిరి రాఘవు నాశ్రమక్ష్మాతలంబు
డాయ రావణుఁ డొక్కెడ డాగి యతని
మసగి కార్యం బనుష్ఠింపు మన నతండు.

సీ. రత్నకాంతులనీను రమణీయశృంగముల్
ఘననీలమణులొప్పు కనులుకల్గి
స్వర్ణప్రభ వెలుంగు భాసురాంగంబును
మరకతచ్ఛాయలమచ్చ లమరి
బెదరినమృగ మట్లు బిత్తరిచూపుల
నలుదిశాభాగముల్ గలయఁ గనుచు
రామాశ్రమముచెంత రంజిలి తిరుగుచు
గఱికల సంపదఁ గొఱికి తినుచు
తే. సీత మ్రోలను గ్రాల నాచెలియ యలరి
యీయపూర్వమృగంబును నెన్నఁడైనఁ
గంటిమే యంచు విస్మయకలిత యగుచు
రామచంద్రుని జేరి యో ప్రాణనాథ
యిట్టిమృగ మెన్నఁడైన సీక్షించినావె.

క. అనిపల్కి విభునితోడన్
జనవర! యీమృగముఁ జంప స్వాంతమలరు దీ
నినిబట్టి కట్టిపెట్టిన
ననుపమగతిఁ బ్రొద్దుపుచ్చ నగు మన కనినన్.

క. రాముం డాకాంచనమృగ
సామీప్యముఁ జేర నది వెస న్గంతుచుఁబో

సౌమిత్రిని రక్షణకై
భూమిజకడ నిల్పి తాను బోసమకట్టెన్. 89

ఉ. అన్నను గాంచి లక్ష్మణుఁ డహా కనుగొంటిమె యిట్టిలేడి ము
న్నెన్నఁడుగాని, యియ్యది మహీవర! రాక్షసమాయ
యంచు దోఁచు న్నెఱిఁగాంచుమన్న దనుజుం డయినన్
ధరఁగూల్తు లేడియై, నన్నళినాక్షి కిత్తు జతనంబునఁబట్టి
యటంచుఁ బల్కుచున్. 90

వ. రాముండు ధనుర్బాణధరుండై మృగంబు వెంటఁ బాఱ
నది చేఁ జిక్కక పెక్కుతెఱంగులఁ జెంగుచెంగున గంతు
లిడుచు నెడనెడ రామునిఁ దిరిగిచూచుచుఁ బాఱిపాఱి
యొక్కొక్కయెడ నలసి నట్లు నిలచి వారకు నసుభ్రాంతి
గల్గించుచుఁ జేరఁబోవ దూరం బేగుచు ని ట్లగమ్యంబైన
నయ్యరణ్యంబున నవ్విభునిఁ గడుదవ్వులకుఁ గొని చన
రాఘవుండు శంకించి యక్కురంగంబుపై శరంబుఁ బ్రయో
గింప నది యొకఘోరదానవాకారంబున "హా లక్ష్మణా"
యని పేరెలుంగునఁ జీరుచు నేలంగూల. 91

క. తమ్ముఁడు సెప్పినకరణి మృ
గ మ్మొకఘోరాసురుండుగా మాఱె నహా
యమ్ముగుద యనుజుఁ డెట్టివి
ధమ్మున నీధ్వనికి మదివితాకు న్గనిరో. 92

వ. అని విచారించుచుఁ ద్వరితగతుల రాముం డేతెంచుచుండ.

క. ఇట జానకి యాదైత్యుని
పటుతరరవ మాలకించి పతియెలుఁగని యా

పటువుగ లక్ష్మణుఁ గని య
క్కట శ్రీరామునకు నెంత కష్టమొదవెనో.

క. సినుఁజీరెఁ బొమ్ము లక్ష్మణ
యనుజున్గన నన్ను నాతఁ డవనిజతోడన్
పిను మబలా యని దైత్యుని
సినపము రాముండు పిలుచు నే నన్నన్నన్.

క. జానకి సౌమిత్రిని గని
దానవుఁ డెట వచ్చె రాము ధ్వని యది వెసఁబొ
మ్మా నానుడివిని యన నతఁ
డేనెఱుఁగుదు రాముదార్ఢ్య మేల వెఱపనన్.

శా. శోకక్రోధపరీతచిత్త యగుచున్ క్షోణీజ సౌమిత్రితోఁ
గాకుత్స్థాగ్రణిఁ గానఁ బొమ్మనినఁ జక్కన్లైనన్నా భాషింతునన్
గ్రైకోఁ జూచెదో రాము కీడు మదిలోఁ గాంక్షించి నీవింక వేఁ
బోకున్నన్ భరత ప్రగ్గుడాన నననప్పుణ్యుండెదన్నొచ్చుచున్.

ఉ తల్లిరో రాము నానతిని దప్పక నీకడ నిల్చినాఁడ న
న్నుల్లము నొవ్వదూరు టది యొప్పునె నే నినుఁబాసి
పోయినన్, బెల్లుగ నీకుఁ గీడొదవు నేనిదెపోయెద నింక
నీకు సుత్ఫుల్లసరోజనేత్ర వనభూములె కాపని పల్కుచున్
జనెన్. 98

వ. అంత. 99

సీ. మేనునిండ విభూతి మెత్తి కాషాయవ
స్త్రంబులు దాలిచి క్రాలువాఁడు
తలనుండిపాదవున మొలదాక వ్రేలాడు
నురుజటాభరముచే నొప్పువాఁడు

## ఆ ర ణ్య కాం డ ము.

మెండురుద్రాక్షలదండలు మెడనిండ
ధరియించి తపసిగాఁ దనరువాఁడు
దండకమండలధారియై శంకరా
యంచు నీశ్వరుని స్మరించువాఁడు

తే. నగుచు మునివేష మూని దశాననుండు
పర్ణశాలకు నేతెంచి పటువిచార
కలితయైయున్న జానకి కడకువచ్చి
కాంత మేను నెగాడిగఁ గాంచి కాంచి.

తే. కాంచి యెవ్వతె వీవిట్టి కాననమున
నొంటి నుండంగఁ గతమేమి యొప్పఁ జెప్పు
మన్న నాసతి సర్వవృత్తాంత మెఱుఁగఁ
దెల్పి కూర్చుండుఁ డంచు నాతిథ్య మొసఁగి.

వ. రామలక్ష్మణు లిప్పుడె వచ్చెద రందాక నిట విశ్రమింపుం డన నా కుహనాముని నీచంపం బెఱింగించి తింక నాచం దంబుఁ దెల్పెద వినుమని.

సీ. అజుఁడు నాముత్తాత యలపులస్త్యబ్రహ్మ
తాత విశ్రవసుండు తండ్రి నాకు
సకలరాక్షసకులసార్వభౌముఁడ నేను
లంకాధిపతి నకలంకయశుఁడ
రావణాభిఖ్యవిరాజిలువాఁడను
సురల గెల్చిన భయంకరబలుండ
నాపేరు వినుమాత్రన వడంకుజగములు
వనజాతభవదత్తవరబలుండ

తే. సొంపుబోణులఁ దెచ్చి భోగించువాఁడ
నొక్కపరసతిపొందునుగూడి స్రుక్క నీకు
నేల నీపాసు నన్గ్రక నేలికొమ్ము
రమ్ము నాతోడ లంకఁ జేరంగ ననిన.

క. ఆమాటలు విని కొంతయు
భీమశరము లంగమందు వెసఁదాకినటుల్
భూమిజ మది నొచ్చి యహో
రామునిశరవహ్ని మ్రగ్గ రంజిలితివా కో.

క. అనిపల్క రామణోటుల
ననిఁ గూల్చెద క్షణములో నటంచు బలుకుచుఁ
గనుఁ గుడె నారూపం బని
దనుజేశుఁడు స్వస్వరూపధరుఁడై నిలచెన్. 105

వ. అంత ధరాజ యాభయంకరాకారంబుఁ గాంచి బెగ్గడిల్లి మూర్ఛిల్లి రావణుం డాసాధ్విని బట్టికొని తనరథంబుపైఁ బెట్టికొని యతిత్వరితగతుల నేగుచుండ నాకాంత మూర్ఛ దెలిసి హాహారవంబులు సేయుచు నిట్లు విలపింపఁదొడంగె.

సీ. హా రామ హా లక్ష్మణా నన్ను నిదె దైత్యుఁ
డొకరుఁడు కొంపోవుచున్న వాఁడు
పదితల లిరువదిబాహువుల్ కలవాఁడు
పొలసుదిండుల కధిపుఁడట వీఁడు
తనకాపురము లంక యనుచుఁ దెలిపినాఁడు
బలిమిని వీఁడు నన్బట్టినాఁడు
తనరథంబున నన్నుఁ గొనిపోవుచున్నాఁడు
వెనుభూత మటులఁ గన్పించువాఁడు

తే. కనరె సురలార నరులార క్ష్మాతలేశుఁ
డైన దశరథుకోడల నర్కవంశ
జలధిసోముని రాముని సతిని నేను
లేరె నన్విడిపించెడువార లెందు. 107

వ. అని యాధరాసుత పేరెలుంగునఁ జీరుచు నేడ్వ నయ్యెడ నొకశైలోపరిస్థలి నున్న జటాయువు వాధ్వని విని దనపూర్వసఖుండైన దశరథుని కోడలును శ్రీరామునిపత్నియునైన సాధ్వీమణిని దైత్యునిబారినుండి విడిపించుట పరమధర్మం బని విచారించి. 108

శా. పక్షద్వంద్వము విప్పి యుగ్రతనభోభాగంబుకు న్దాటి యా
పక్షీంద్రుండు దశాననున్నఖములన్ భంజించుచు న్జీరుచున్
రక్షోనాథు రథాశ్వసూతులధనుర్దండంబునున్ ద్రుంచ లో
కక్షోభంబుగ దైత్యుఁ డాఖగము ఱెక్కల్ ధారుణిన్
గూల్చెఁగన్. 109

క. ఱెక్కలు వ్రాల రుధిరమున్
గ్రక్కుచు జానకిని గాంచి ఖగపతి యార్తిన్
బొక్కుచు ధరఁబడి యుండఁగ
గ్రక్కున రావణుఁడు దాటె క్ష్మాసుతతోడన్. 110

వ. అంత నాదైత్యుండు జానకి నెత్తికొని తన్మహాక్రందనధ్వనులు దిగంతంబు లంటుచుండ వియత్పదంబున నేగుచు.

ఉ. రాముని మోఘబాణనికరంబులు వెల్వడి యెందునుండి యు
ద్దామముగాఁ బయింబడి వధం బొనరించునొ తన్నటంచు సు
త్రామవిరోధి బెబ్బులిని దప్పిపరుంగిడు లేడియట్టులన్
శల్ కనుచు భీతిహుటాహుటిఁ బోవుచున్నెడన్.

చ. క్షితిసుతదైత్యుచంక విలసిల్లుచుఁ దన్విడిపింప నెవ్వ రా
గతులగుజాడఁ గానక యఖండతరార్తరవంబు సేయుచు
న్నతమగు నొక్కపర్వతము నగ్గపివీరులు కొందఱుంటఁ గాం
చి తనకు కొన్నిసొమ్ములను జెచ్చెరస్వాంగమునుండి తీయు
చున్. 113

తే. కట్టుచీరెను జీఁజీ యాఖండమందు
నగల ముడిఁగట్టి దాని నానగమునందుఁ
దనరుచుండెడుకపులమధ్యమున విడచె
విభున కవ్వాఁడు దానిఁ జూపెడ రటంచు. 114

వ. అంత నారావణుండు సీతాసమేతుండై తదుగ్రశోకారవంబు
లింక లంకానగరం బాహత్యాగరంబున మునుంగునని తెల్పు
గతి బ్రతిధ్వనులీసరిప్పాడిగట్టి తెచ్చినట్లు సీతన్దెచ్చి నట్టింటఁ
జెన్నొంబముగఁ జేర్చినలీల నాసాధ్వీమణిని దనసౌధంబునఁ జేర్చి
యందుండు నవరత్నఖచితస్వర్ణాభరణాదులఁ జూపి తన్నుఁ
గైకొమ్మని ప్రార్థింప నాకొమ్మ దైత్యునిజూడనొల్లక రాము
శరాగ్నికింధనం బగుదుకాక యనిపల్కి శోకదగ్ధ యగు
చుండె నంత నప్పురంబున మహోపద్రవకరంబులగు నుత్పా
తంబులు పుట్టు టారసి యాప్తులగు వృద్ధరాక్షసులు
కొందఱు రావణునితో నిక్కాంత దైత్యాంతక కాన
దీనిఁ బురంబున నుంచక పురోపవనంబున నుంచుట మేలన్న
రావణుం డవ్వనిత నశోకవనంబునఁ బెట్టి రాక్షసస్త్రీలఁ
గాపుంచె నంత. 115

మ. అట రాముం డెదురేగుదెంచు నతిఖిన్నాత్ముఁ సుమిత్రా
సుతుఁ, బటుశంక నని యేలవచ్చి తిట కన్నఁ లక్ష్మణుం

డాయెహహో, దుర్ఘటమై త్ర్యక్షటినీరవం బని మదిఁ భావించి
నన్గూరి యారటము నొందుచు సీత నన్నునిచేఁ గ్రూర
క్రోధమగ్నాత్మనై. 116

క. అన జానకి యవ్యక్తం
బునకుఁ మది నొచ్చి రాఘవుఁడు భూమిజ కె
వ్వనివలన నేమి కీడొద
వెనొకో యని సంశయమున విహ్వలుఁ డగుచున్. 117

వ. హుటాహుటి న్జని రామలక్ష్మణులు పర్ణశాల న్జేరి చూచిన.

సీ. జననివాసము లేనిసౌధంబుపోలిక
శారిక లేనిపంజరమురీతి
నంబులు లేనిపద్మాకరం బటు విగ్ర
హము లేని దేవాలయంబుకరణి
సతి లేని యట్టిసంసారి గేహము గతి
దళములు లేనిపాదపముభంగి
రాజవరుఁడు లేనిరాష్ట్రంబు భాతిని
చంద్రుఁడు లేనిరజనివిధమున

తే. బోటి లేనట్టి యోవనవాటిఁ గాంచి
సతిని గానక గుండెలు ఝల్లు మనఁగఁ
దరుణి నవ్వుల కెంపైన దాగెనో యని
పేరెలుంగునఁ జీరి యవ్వేళఁ దిలేమి. 119

క. కలఁగినమతి నల్దిక్కులఁ
గలయ వెదకి చీరిచీరి కాంత నెచటనుఁ
దిలకింపలేక దుఃఖా
కులుఁడై రాముండు మూర్ఛతో ధరిఁ వ్రాలెన్. 120

వ. ఇంతః సమ్మోహము తెలిసి లేచి పర్ణశాలముందు రథచక్రచ్ఛాయలు గని యెవ్వండో సీతను దేరుపైఁబెట్టికొని పోనోపునని యాజాడల వెంటఁబోవుచు రాముండు భ్రాంతుం భంగి.

సీ. మాతంగమా! యింత జాతునా మాకాంత
ఫలములు భక్షింపవచ్చెనేమొ
పున్నాగ! నిన్జేరి యున్నదా మన్నారి
విరులఁ గోయ నచటి కరిగెనేమొ
గిరివరా! నీకోటి కరిగెనా మాబోటి
విహరింపఁగా నట వెలసె నేమొ
గౌతమీ! నీమైత్రి చేత మాభూపుత్రి
జలములఁ ద్రావంగ నిలిచెనేమొ
తే. యనుచు రాముఁడు బహువిభ్రమాత్ముఁ డగుచుఁ
బాదపాద్రినదీజలప్రముఖశబ్ద
జడపదార్థంబులనుగూడఁ బడనివట్టి
జాడ లడుగుచుఁ దమ్ముని చక్కఁజూచి

సీ. శుకపికాదులకుఁ బలుకులను నేర్పంగఁ
బోయెనో తమ్ముఁడా పొలఁతిఁ గనుమి
గంధేభములకు నడకలఁ జూపి కఱపంగ
నేగెనో లక్ష్మణా యింతిఁ గనుమి
సింహములకుఁ దన చిన్నినడుముఁ జూపఁ
దరలెనో యనుజ యాతన్విఁ గనుమి
భ్రమరకోటికిశిరోజములసొం పెఱిఁగింపఁ
జనెనో సౌమిత్రి యాచానఁ గనుమి

తే. యనుచు వేలీలలను వనవనిత నెంచి
తలఁచి తలఁచి మహాకృపాకలితుఁ డగుచుఁ
దమ్ముఁ డావిల్లుఁ దెమ్మనఁ దరుణి కాన
రానియెడల జగంబులు వ్రాల్తు ననుచు. 123

మ. నరకోటి న్వెదలింతు దేవవితతి న్సాధింతు రక్షోజనో
త్కరము న్నీచమడంతు యక్షులను విధ్వంసంబు గావింతుఁ గి
న్నరులన్ ద్రుంతు నిలేలఁ జెండెనని తాంత బ్రహ్మాసుసృష్టి నా
శరవహ్ని న్దహియింతుఁ జూడుమని తీక్ష్ణక్రోధసంరంభుఁడై.

వ. కన్నులనిప్పులురాలఁ గోపజ్వాలలు నల్దెసలఁ గ్రాల బ్రళయ
కాలరుద్రునిలీల రామభద్రుండు కేల నొకకోలఁ దాల్చిన.

చ. అతిభయవిహ్వలుం డగుచు నన్నుఁ గనుంగొని లక్ష్మణుం
డహో, యతులితశాంతమూర్తి వొకయంగనకై యిటు లోక
నాశనోద్ధతగతిఁ బూనఁబాడియె కృధక ధరణీజవిధంబుఁ
గాన నీ,తిటిఁ గనవచ్చు తెరుగతి చేరికఁ బోపము రమ్మటం
చనన్. 126

వ. రాముండు తమ్మునివాక్యంబుల నాదరించి శమించి యారథ
చక్రపుచారల ననుసరించి యేగుచుండ నాముందు మేదినీ
తలంబున నావేదనం బొందుచున్న యొకమహాఖగంబును
వికీర్ణంబులైన శరశరాసనరథరథ్యంబులను గాంచి వీఁడొక
రక్కసుండు సీతను మ్రింగి యిబ్బంగి మనలరాక నెఱింగి
నటించుచుండ నోపునని రాముండు శరప్రయోగంబు
నేయ గమకించునెడ జటాయు విట్లనియె. 127

చ. నరవరులార! నేను ఖగనాథుఁడఁ బేరు జటాయువందు రా
ధరణిజఁ గొంచు రావణుఁడు దర్పితుఁడై చనుచుండ నే నెది

ర్థి రణముకంపు వానిఁ గడుఁ జేడ్పడఁజేయఁగ నాదుపక్ష
ముల్, పెఱుఁగఁగ గొట్టి వాఁ డరిగె బృథ్వీసుతన్గొని లంక
వెక్కునన్. 128

వ. అనిపల్కి పాశపక్షులు జటాయువుఁ డాసి సీతావృత్తాంతంబు విశదంబుగా ని యాఖగపతి ప్రాణంబులు విడువ రామలక్ష్మణు లాతనిచావునకై విచారించి పరలోకక్రియలు సంఘటింప నాతం డుత్తమలోకప్రాప్తి నొందె నావల. 129

క. పక్షిపతి తనరెడులం
కాక్షేత్రపుదిక్కుఁ జనుచుఁ గాంచి రెదుట నా
సుక్షత్రియవీరులు బా
హుక్షతపాంథుఁ గబంధునుబలసింధున్. 130

వ. వాఁడునరంబున శిరం బమరి పాదంబులులేక యోజనాయత దీర్ఘబాహుండై శాపవశంబునఁ గబంధంబు పోలిక నయ్యరణ్యంబున నొక్కెడఁ బడియుండి తన కరంబుల కందిన జంతువులఁ బట్టి తినుచుఁ గాలంబుఁ గడపుచుండ. 131

శా. ఆరాత్రించరు దీర్ఘబాహులతలం బర్కాన్వయుల్ చిక్కిన
వ్వారిఁ బట్టి యతండు నిజోదరముఁ జేర్పన్ లాగుచుండంగ
నా, వీరుల్ తద్ఘనబాహుదండములఁ బృథ్విన్గూల్ప వాఁ డా
ధరి,త్రీరంగంబునఁ గూలి యార్తుఁడయి యాధీరద్వయిన్
గాంచుచున్. 132

వ. మీ రెవ్వరని యడిగి వారల నెఱింగి తా నారామలక్ష్మణుల కృపారసంబున శాపవిముక్తిఁ గాంచితి నని హర్షించి యావిరుద్ధదేహంబు విసర్జించి దనువనునామంబుకల తన స్వస్వరూపంబు ధరించి రాముం డడుగ సీతాపహర్తయైన

రావణువృత్తాంతం బంతయుఁ దెల్పి బహుసైన్యసమేతుం డైనదైత్యు నిర్జింప మీరు లోంటిజనులకంటె సుగ్రీవునితో సఖ్యంబుసేసి తద్విరోధి యగువాలిఁ దున్మి వానరసేనా సహాయంబున రావణుఁ జంపఁబోవుట లెస్స యని దెల్పి వాఁడు నిజమార్గంబునఁబోయె నంత. 133

తే. ఆకబంధుఁడు సెప్పిన యట్టిగతిని
రాకుమారులు సనుచు మార్గమునఁ గనిరి
మానిపసేవరాజిలి మహిమ దనరు
నారి నొకతెను శబరియన్ బేరుదాని. 134

క. తన గురువుల నానతి నా
వనిత రఘుప్రవరులను సభ న్గని య
వ్వనమున నాతిథ్య మొసం
గ నిలిచి ఫలములనుగూర్చి కాచుచు నుండెన్. 135

చ. తరణికులుల్ వనాంతరపథంబున వచ్చుచునుండ వారి నా
సరసిజనేత్ర డాసి యరుసంబున మ్రొక్కి నుతించి స్వాశ్ర
మాం, తరమున నిల్పి సత్ఫలవితానముఁ దృష్టిగఁబెట్టి దేహ
మున్, దొఱఁగి చనెన్ దివిన్ స్వగురుదుర్లభసద్గతి నివ్వ
టిల్లఁగన్. 136

ఉ. అంతట నాక్షితీశులు వనాంతరదుర్గమమార్గవర్తులై
చింతిలకుండ నేగి తుదిఁ జేరిరి జీవచయానుకంప న
శ్రాంతసుఖప్రదానవిలసజ్జలపూరితపంపఁ జేరి వా [లన్.
రెంతయుఁ బ్రీతిఁ గ్రుంకులిడి స్వేచ్ఛను దత్తటినుండి రిమ్ము

మాలిని:—

వరగుణశుభజాలా భక్తలోకానుకూలా
దురితచయవినాశా తోషితోద్యద్గిరీశా
చరణదళితపాపా సన్మహత్వప్రదీపా
పరమశుభదనామా భద్రశైలాగ్రధామా. 138

గద్య. ఇది మంత్రికులోదార రామయకుమారభద్రాచలనివాస తూము సీతారామదాసప్రణీతంబయిన సీతారామరామాయణకావ్యంబునం దరణ్యకాండ కథాసంగ్రహ మేకాశ్వాసము



శ్రీ స్తు

# సీతారామరామాయణము

## కిష్కింధాకాండము.

క. ఘోరాసుర సంత్రాసా
పారావారోగ్రమదవిపాటనకరదు
ర్వారమహాస్త్రవిలాసా
భూరియశోభాసభద్ర భూభృద్వాసా. 1

వ. మహాత్మా! భవదనంతర వృత్తాంతంబు మత్కలుష ప్రశాంతం
బునకై పల్కెదఁ గృపారసం బొల్క నాలకింపుము. 2

శా. పంపాతీరమునందు రాఘవులు దుర్వార ప్రభన్నిల్వనా
కంపం బొందుచునర్కసూతికని తత్ ఖండింపనయ్యింద్రజుం
డంపెన్వీరలనంచు భీతిలి యుదగ్రార్తిన్బడ న్వారిశో
ధింప న్బోయెదనంచు వాయుజుఁడు తద్వీరద్వయిన్గాంచఁగన్.

క. మనుజాకృతిఁజని యతఁడా
యినకులులఁ జేరి మ్రొక్కి యెవ్వరు మీరీ
వనమున నుండఁగ నేలన
జనవరులెఱిఁగించిరా ప్రసంగమునెల్లన్.

మ. మఱియున్ రామునిఁజూపి తమ్ముఁడనెనీ మాయన్న దుర్వార
బంధురదోస్సారపటుత్వసిద్ధి నసమానుండయ్యు సుగ్రీవునా

పరమున్నాచెఁగ నిట్లు రావలసెనే తత్కార్యమందింక నీ
చరితంబున్వినుపింపుమన్నఁ బలికె న్స్వామీరియాతీఁగాన్.

క. ఆయర్కజుసచివుఁడనే
వాయుసుతుఁడ వనచరుండ భానుసుతుఁడునన్
మీయాగమనవిధ మెఱుఁగఁ
బోయి వెసన్నమ్మటంచుఁ బుచ్చెన్నన్నున్. 6

క. ఇనకులలామా మీవలె
నినజుండును సతినిఁబాసి యిల్వెడలఁగఁద
న్ననుజుండు తఱుము దుఃఖం
బునఁగృశుఁడై యున్నవాఁడు పొల్పరివినుఁడీ. 7

క. రామార్కజులకు నెయ్యము
వేమఱుసిద్ధించునే వ వెసనేగిభవ
త్స్వామీ సత్యముగను నతనిన్
గామితమారంగఁ దెచ్చి కలిపెదనంచున్. 8

మ. చనియాయర్కజుతోడఁ దెల్పి యతనిన్ క్ష్మాపాలురన్గాంచఁ
దోడ్కొని రానాతఁడు రామమూర్తులకు మ్రొక్కుల్ మ్రొక్కి
రామాజ్ఞ గూర్చునె సంతన్ రఘురాముఁడున్ రవిజుఁడు
జ్జ్వాలానలోక్షన్య కృష్టనికాయంబుల ముచ్చటించుకొని
గాఢస్నేహాబద్ధాత్ములై.

తే. వాలిఁజంపెదనని రఘువంశవిభుఁడు
వానరులతోడ రావణ వధకుఁదోడు
వచ్చెదనటంచు రవిజుఁడు ప్రతినలారఁ
జేసిరగ్నిని సాక్షిగాఁ జేసికొంచు.

గీ. అంత సుగ్రీవుఁ డానిన మనుజవరుని
వలన బల్మినిఁ గొంపోవఁబడుచు నొక్క
కొమ్మ తనమేనితొడవులు కొన్ని వేసి
పుట్టమును జీరి దానితో మూటఁగట్టి.

క. మే మిటనుండఁగఁ గన్గొని
యామూటను వైత్త్య వంకమందుంచి తె
భూమి పిగజార్చె నాకడ
నీమానిని దేమొ దానిఁ గ్గనుఁగొనుమీ.

క. అనిపల్కి కపిజుఁ డామూ
టను దెచ్చి రఘుప్రవరుకడ న్బెట్టఁగ
జనపతి యాతొడవులఁ గ
న్గొని హా యని మూర్ఛమున్గి త్రోఁజెన్నడిరాముఁడ్.

వ. పడి లేచి యిట్లు విలపింపం దొడంగె.

సీ. తొడవులారా మీరు పుడమిపట్టి యవస్థఁ
దెల్ప నాకడ కరుదెంచినారె
మణిమండనములార మాజానకీదేహ
సంగతి నెటు వీడఁజాలినారె
నగలార పడతి దానవుచేతఁ జిక్కి యే
మనిచెప్పెనో నన్ను వినఁగనీరె
యాభరణములార యసురుఁ ద్రుంచెదనైపు
మని తెల్ప నాసతిఁ గనఁగఁబోరె

తే. మిమ్ముఁ గనుగొన్న ధరణిజ మేనుఁగన్న
కరణి హర్షంబుకల్గెనుగాని యెపుడు

హావప్రదుఁడు నాదు దృష్టిపథమునఁబడునో
యెపుడు త్రుంతునో యంచుఁ దీవ్రపడుమనము.

క. జానకి దేహంబందు న
నూనప్రభ వెల్గుచు న్గనులకుండువుగాఁ
గాంచుదు మీరిపుడే లా
ఘనుశోకాగ్ని ముంచి యలచెద రకటా.

క. అని బహుభంగుల నేడ్చెడు
జనపతిఁ గని లక్ష్మణుండు సవితృతనూజుం
డును దేర్పఁ గొంతవడి కా
మనుజేశుం డుపశమించి మఱి యటనుండన్.

వ. అంత సుగ్రీవుండు రామునకు వాలి జ్జంపఁగల దోస్సారంబు కలదో లేదో యని శంకించి వాలికాలఁ దన్ని యోజన దూరం బెగురఁజిమ్మిన దుందుభికళేబరంబుఁ జూపి దాని న్గాలఁ దన్నుమన రాముం డట్లచేసిన నది పదియోజనంబుల దూరం బెగసె నంత సుగ్రీవుం డదియుఁ జాలదని వాలి తన చేతులతోఁ బట్టి వంచిన తాళసప్తకం బొక్కశరంబున నేయుమన రాముండు మందస్మితముఖారవిందుండై. 18

క. వడి నొకబాణం జేసిన
బిడుగుంబలెఁ దచ్ఛరంబు పెళపెళరవముల్
బొడమఁగఁ దరుసప్తకముఁ
బుడమి న్గూల్పంగఁ గపివిభుం డడరొందవన్.

క. శ్రీరాముపాదములపైఁ
జేరంబడి కపివిభుండు చిత్తంబడలన్

భూరిబలుండవు వాలిని
దారించుట నీకు నెంత ధరణీకాంతా. 20

వ. నీబాహుబలంబు శోధింప నేనెంతవాఁడ నే నవ్యక్తుండనై చేసినపరీక్షకు నన్ను క్షమింపుమని వేఁడిన శ్రీరాముండు సుగ్రీవుఁ గాంచి యిట్లనియె. 21

శా. వాలిన్ యనిన్గడంగు మతనిన్ బాహాబలప్రౌఢి మీ రాలంబందుఁ బెనంగుచుండు సమయంబందేను వృక్షంబు చా టై లక్షించి శరప్రయోగమున నీయన్నన్ ధరన్గూల్చెదన్ లిలన్ బోదము రమ్మటంచు నటకున్ వేఁజేరఁబో సిద్ధుఁడై.22

వ. లక్ష్మణహనుమత్సుగ్రీవసహితుండై రాముండు కదలి కిష్కిం ధోపరిక్షేత్రంబుఁ జేరి యొక్కవృక్షంబుచాటునఁ దాముండి సుగ్రీవు న్బంప నాతండు తత్పురద్వారంబుఁ జేరి మహాధ్వని సేయుచు నాహవంబునకు వాలిన్బిలిచె. 23

ఉ. ఆరవ మాలకించి దివిజాధిపసూనుఁ డుదగ్రకోపమే పారఁగవచ్చి యర్కసుతు నట్టె కనుంగొని చావవచ్చితే రార యటంచు ద్వంద్వరణరంగమున న్గవయంగ నిర్వురున్ బోరిరి శైలయుగ్మముల పోలికఁ దుల్యబలాతిరేకులై. 24

వ. అట్టియెడ. 25

ఉ. వారలఁ గాంచి రాఘవుఁడు వాలియు నర్కజుఁ డేకరూపమే పారఁగ నుంట నందు నెవఁ డర్కతనూజుఁడో వాలి యె వ్వఁడో, యారయ లేని శంకఁబడి యస్త్రము వీడక యుండె వీడుచో, నారవిసూనుఁ డాఘునశరాహతి మ్రగ్గునో యంచు 26

క. ఆలోక నర్కతనయుఁడు
వాలి మహాముష్టిహతుల బడలి నిలువఁగా
జాలక రాముని కై
చాలము విడి పాఱివచ్చె సతతఖిన్నుండై.

క. వచ్చి రఘుప్రవరున్గని
యచ్చోటిని వాలి చావు మని నన్నటులన్
బుచ్చితెయన రాముఁడు కడు
నొచ్చి యిటులఁ బలికె నాదు నుడి వినుమంచున్.

శా. నీవు న్వాలియు నేకరూపమునఁ గన్పింపంగ నే నాతనిన్
భావింప న్మది సంశయించితిని నాబాణం బమోఘంబు నీ
వో వాఁడో హతుఁడౌదు రేను ప్రదరంబు న్వైడినన్ గాన సు
గ్రీవా! నీకొక యానవాలిడుదు నార్తి న్బాసి వేఁబొమ్మికన్.

వ. అని చెప్పి లక్ష్మణా! సుగ్రీవున కొక యానవాలిడుమన, నాతఁ
డొకపుష్పమాలిక నతని కంఠంబునఁ గట్టె నంత నాభాను
జుండు క్రమ్మఱఁ గిష్కింధాపురద్వారంబుఁ జేరి సింహ
నాదంబులు సేయుచు వాలి న్జీరిన నారవం బాలకించి యింద్ర
జుండు మహారోషావేశంబున వీఁడు మరలవచ్చె నిత్తఱి
న్వీని న్బరిమార్తు నని వెడలుచుండ నాతనిదార యగుతార
రయంబున నడ్డంబువచ్చి యిట్లనియె. 30

చ. వలదనికిన్ గడంగ నినవంశభవుం డగు రాముఁ డిప్పు డా
జలరుహమిత్రపుత్రునకు సాయమువచ్చి నిను న్వధింపఁగా
సలిపెను ప్రత్యయం బను ప్రసంగము నంగదునుండి వింటి న
త్యలఘుఁడు ధర్మపాలుఁ డసహాయబలుండట రాముఁ డాజి
లోన్. 31

క. అన నింద్రజుఁ డించుక మన
మునఁ దాఁబరికించి ధర్మబుద్ధికలుగు నా
యనఘుఁడు రాముం డూరక
ననుదొడరునె తొడరిన న్మనంగలఁడె మహిన్.

గీ. మాననీయుఁడు రాఘవక్ష్మావిభుండు
నిర్నిమిత్తంబు నాతోడ నిష్ఠురంపు
వైరమునుబూని యేమిశుభంబుఁ బడయుఁ
గాన మానిని నీకేల గలఁగ మదిని

వ అనిపల్కి కన్నుల నిప్పులురాల నిత్తఱి సుగ్రీవు విగత
గ్రీవుఁ జేసెదనని నిశ్చయించికొని దిక్కులద్రువ నార్చుచుఁ
బుడమియదల దుముకుచు, వచ్చి యక్కజు న్దలపడె నంత
వారలిర్వురు సింహశార్దూలంబులలీల బాహాబాహిఁ బెనం
గుచు, ముష్టాముష్టిగ్రుద్దికొనుచు, నఖానఖిఁ గీకికొనుచుఁ,
జెట్లకొమ్మలతోఁ గొట్టికొనుచు, శిలల ఱువ్వికొనుచుఁ,
బట్టుచు నెట్టుచుఁ, ద్రోయుచు, వ్రేయుచు, మలంగుచుఁ,
దొలంగుచు ఘోరంబుగాఁ బోరుచుండ. 34

ఉ. భండనభీముఁ డైనరఘువర్యుఁడు వాలిని సంహరింపఁ గో
దండము నెక్కువెట్టి నిశితప్రదరం బరిఁబోసి లాగి దో
ర్దండబలంబుతో విడువఁ దన్నిశితాస్త్ర ముదగ్రవృత్తి
ఖండలసూను పేరురముగాడ నతం డిలఁగూలె నార్చుచున్.

వ. అట్లు కూలి కొంతవడికిఁ దెలిసి తనయురంబు వ్రచ్చి వెన్ను
దాకదూఱిన యారఘువీరుఘోరశరంబునఁ గల్గువేదనంబున
నొచ్చుచు నాలో లక్ష్మణహనుమత్సహితుండై తన్నుఁ జేర
వచ్చిన శ్రీరాముఁ గాంచి యిట్లనియె. 36

సీ. ఏమిశుభం బొందఁజేసితి రాఘు
వా పగఁగలదె యొడ్డైన మనకుఁ
శూరుండ వైననాతో రణక్షితి నిల్చి
జెనకకుండంగ నన్నెదురరావె
చాటునగల నొక్కధారుణీజము వెన్క
నెగడి నన్నేయుట మగతనంబె
యిరువురుపోరాడ నింకొక్కఁ డేతెంచి
తగిలియేయుట రణధర్మమగునె
తే. ధార్మికుండ వంచు నినునమ్మి తప్పి
వెలఁది హితబోధ నేఁ జెవిబెట్టనైతి
క్రూరమతిపితృణావృతరూపసముఁడ
వంచు నిన్గననైతినే నక్కటకటా. 37

ఉ. సీతనుగొంచుఁ జన్నయల చెన్నటిదైత్యు నెదుర్ప నీకుఁ దో
డై తనరార నక్కజునహాయముఁ గోరి యొనర్చి తిట్లు త
త్ప్రీతికి స్వార్థలోలత వివేకవిహీనుఁడనై, త్రిలోకముల్
పాతకవర్తి వంచు నినుఁ బల్కవె ధర్మవిదూర రాఘువా. 38

ఉ. రావణుతోడఁ బోర ననురమ్మనికోరిన నాతని౯ దృటి౯
దేవత లడ్డమైనను నెదిర్చి వధింపనె సైన్యయుక్తి బృ
థ్వీవర! జానకి౯ గడిమిఁ దెచ్చి వెసన్నినుఁ జేర్పకుండునే
కావరమారనీవిధముగాఁ జరియించితి దుష్టబుద్ధివై. 39

తే. మాంసమునకిట్లు నన్నేయ మసలితనినఁ
గోతిమాంసముఁ దిందురే క్షోణిజనులు
కుమతి! యేటికి నన్నేసి కూల్చితొక్కొ
తెలుపు మీకారణముఁ దెల్పఁగలిగియున్న. 40

వ. అనవిని శ్రీరాముం డిట్లనియెను. 41

క. గురిగింజ తనకుఁ గ్రిందను
బరగెడునలు పెఱుఁగనట్లు పల్కెద హా సో
దరుసతిఁ గొని బల్మిని సో
దరు నిల్వెడలించు టది యధర్మము కాదే. 42

క. కుజనులశిక్షించుటయున్
సుజనుల్ రక్షించుటయును క్షోణీశున కిం
ద్రజ! కనఁదగుధర్మంబులు
వృజిన మొదవ దట్టిపనిని బృథ్వీశునకున్. 43

వ. రాజ్యవిహీనుఁడ వైననీవు పృథ్వీశుండ వెట్లైతివం టేని. 44

క. భరతుఁడు రాజతఁ డవనిన్
బరగెడుఖలులను వధింపఁ బంపె న్నన్నున్
బరమాఘవర్తి వగునిన్
ధరఁగూల్చితి ధర్మసిద్ధి తనరఁగ నింకన్. 45.

క. ఇనజుఁడు నను శరణొందిన
నిను బాపరతున్ వధింప నేశపథంబున్
గొని నిను ద్రుంచితి వృక్షము
వెనుకన్ డాగి నను నేల వ్రేసితి వన్నన్. 46.

మ. నిను బ్రత్యక్షమునం దనిన్ దొడరి క్షోణి న్గూల్ప నెవ్వానికై
నను రాకుండ వరంబుఁబొందితివి కాన న్నీకుఁ గన్పట్టకుం
డ నిలన్గూల్చితి నేవిధి న్నిను దురన్యాయప్రచారు న్వధిం
చిన మేలేయగుఁగాక దాన నఘముల్ సిద్ధించునే వానరా. 47

వ. కాన నింక నీయారాటంబు మాని నీదురితంబు నీవెఱింగి.
క్రోధంబు విడచి శాంతుండవుకమ్ము మత్కృపావలోకనంబున.

సత్తమగతిఁబొందెననఁ గాంతుండు ముదితస్వాంతుండై శ్రీరామునకు నమస్కరించి తన యనుంగుసుతుం డైన యంగదు నమ్మహాత్మున కొప్పగించి ప్రాణంబులు విడువ వాలి కాంత యేతెంచి బహుభంగుల విలపించి రంత నంగదుండు సుగ్రీవసహితుండై వాలికిఁ బరలోకక్రియ లాచరించె నావల. 48

క. ఇనసుతుఁ గిష్కింధకు నా
థునిఁ జేసెను రాముఁ డంతఁ దోతెంచె వటా
కనదీజలపూరితమై
తనరెను వర్షాగమంబు దశదిశలందున్. 49

ఆప్రావృట్కాలంబున శ్రీరామలక్ష్మణులు ప్రవర్షణగిరిన్నిలచి యుండిరి. సుగ్రీవుండు వర్షంబు లుడుగుతోడనే నానాగిరికాననాంతరవర్తులైన వనచరుల రావించి సీతాన్వేషణంబున కంపెద నని రామున కొప్పఁజెప్పి తననగరంబునఁ దారారుమాదికాంతలన్గూడి వైభవంబుననుండె నంత. 50

సీ. ఉఱుములు మెఱుము లత్యుగ్రంబులై క్రాల
నెడనెడఁ బిడుగులు పుడమి వ్రాల
నర్కమండలము దృశ్యాదృశ్యమై యొప్ప
జలదముల్ కడువియత్తలముఁ గప్ప
నాకసంబున తూటు లమరెనా యన నీర
ధారలు కుండపోతలయి కారఁ
బృథ్వియంతయుఁ దృణావృతమయి కన్పింపఁ
దరులెల్ల నూత్నపత్రముల నింపఁ

తే. బఱీవర్ణంబు పృష్ఠాగ్రభాగములను
గూండ్లు నిర్మించుకొని యుందుఁగూడి మెలఁగఁ
జెఱుప్ర ఱేలు కదునిడకనలొంద
వర్షపాతంబు తనరె నుత్కృష్టగతిని.

సీ. మఱి క్రిమికీటకోత్కరములు కుప్పతె
ప్పలుగ జన్మించి భూతలముఁగప్పె
బహుమనోహరముగా పక్షుల పల్కులు
సొంపుగాఁ గను నాలకింపఁబడెనుఁ
బృథ్వీజముల నిండఁ బిందెలు కాయలు
చిగురుటాకులు పూలు మిగులఁదోఁచె
నడవిమృగావళు లధికములై రేఁగె
జనచయంబునకు సంచార ముడిగెఁ

తే. బాతకొంగలు చెట్లు గుభాల్గుభాల్ర
వములతోఁ గూలె నిర్ధవంతులకును
నిర్ధనులకోలె సుఖదుఃఖనిలయమైన
వానకాలంబు వచ్చె నవారితముగ.

క. రవ్యారాధకు లుపవా
సవ్యథఁ బవలెల్లఁ దమదుచక్షుర్వ్యగమే
కవ్యార్తం నింగి నిడి క
ర్తవ్యము లేమరిరి సూర్యదర్శనపరులై.

క. ఆవర్షకాలమున విర
హావేదన మఱఁగుచుండె నవనిజను మదిఁ
భావించి భానుకులజుఁడు
రావణవధ యెప్పుడని త్వరపడుచు మఱియున్.

సీ. అళికులఝంకార మాలకించి కలంగుఁ
గలఁగి సీత శిరోజములఁ గణించు
శోకపికధ్వని చెవిసోకిఁ గడునుల్కి
నుల్కి ధాత్రీసుతపల్కులెంచు
నింపువెన్నెలఁ గాంచి మెంపుతాపము జెందుఁ
జెంది జానకినవ్వుఁ జింతసేయు
విరులగుంపులఁ జూచి పరితాపమునఁ జొక్కుఁ
జొక్కి యావిరిబోడిసొబగుఁ దలఁచు

తే. బయఁ డొకండు సతిఁ బల్మిఁ బట్టినట్టి
పరిభవస్మృతి సిగ్గున శిరమువంచు
వంచి తలయెత్తి యుగ్రకోపమువహించు
రాము డిటులుం బహుళభ్రాంతుఁ డగుచు.

వ. అంత వర్షంబులుతక్కి శరదృతు వెక్కినను సుగ్రీవుండు రామికి వెక్కసపడుచు శ్రీరాముండు గ్రక్కున లక్ష్మణుని గిష్కింధ కంప నాతండు నిష్ఠురోక్తులాడి సుగ్రీవుఁ దోడ్కొనిరా నాతండు రామునకు వినమితుండై యిదె వానరసేనలు వచ్చుచున్నయవి యనిపల్కి ముందుఁ జేయవలసినకార్యక్రమంబు యోజింపుచుండ భూమి యీనినట్లు గోట్లకొలందిఁ గీశబలంబు లేతేర రాముండు హర్షించి సీతాన్వేషణార్థంబు తూర్పునకు మైందునిఁ బశ్చిమంబునకు సుషేణు నుత్తరంబునకు శతబలిని దక్షిణంబునకు హనుమ దంగదజాంబవంతాదిమహాబలిష్ఠు లగు వానరవీరులను దగు దళంబులతోఁ దిరిగి రా నొక్కమాసంబు గడువుపెట్టి పంపుచు హనుమంతు న్గాంచి శ్రీరాముం డిట్లనియె. 56

ఉ. మారుతపుత్ర నీవగు నమానుష ధైర్యమనోబలోగ్ర శా
రీరపటుత్వసంపద చెలంగి మదీప్సితకార్యసిద్ధి నీ
డేరఁగఁజేసె దీనను మహాకృతిరంజిత సీతఁ గాంచి యీ
నారతనంపు టుంగరము నాతికి నిమ్మొక యానవాలుగాన్.

వ. అనిపల్కి శ్రీరాముం డుంగరం బొసంగి యాతండు
మ్రొక్క దీవించి పంపించె. 58

క. సీతఁ గనలేక కీశ
వ్రాతం బరుదెంచెఁ గ్రమ్మఱఁ దక్షిణాది
గ్భాతలి కేగినమారుత
సూతి తదనుచరవనాటశూరులుతక్కన్. 59

వ. ఇంక దక్షిణదిక్కున కేగినయక్షీణపరాక్రము లగునాహను
మదాదులు సకలవనశైలపట్టణగ్రామజలాశయాదులనెల్ల
వెదకి సతి గానక దురంతచింతాక్రాంతులై యొక్కెడఁజేరి
యీలీల నాలోచన సేయఁదొడంగిరి. 60

చ. ముదిత గానక క్రమ్మఱఁ మనము రాముఁ జేరఁగాఁ బోయి
నఁ, మదిశోకించి యతండుచచ్చు నిఁక నమ్మార్తాండసూనుండు
భీ, ప్రదుఁడై మాసము దాటె నంచు మనలఁ బాధించెడు
గాన నెమ్మది బ్రాణంబుల నిందె వీడు టది క్షేమం బంచు
జింతించుచున్. 61

వ. అంగదాదు లీలీల నాలోచించి ప్రాయోపవేశంబొంద సమ
కట్టుట గాంచి సంపాతి యనుఖగనాథుండు తనకు దైవి
కంబుగఁ బ్రాయోపవేశపరులైనవనచరు లాహారంబునకుఁ
బ్రాప్తించిరని హర్షించుచు మెల్లమెల్లనఁ దానుండు
రంబుననుండి దిగివచ్చి. 62

క. వనచరులకడకు ఖగపతి
చని మీ రెవ రేల యిచటఁ జావఁగ నున్నా
రనియడుగ వారు తెల్పిరి
వినయంబునఁ దమదు సర్వవృత్తాంతంబున్. 63

వ. అంత నాసంపాతి తనసోదరుండైన జటాయువు రావణునిచే హతుండైనవార్త నాలించి దుఃఖించి దశాస్యు నెంచి రోషించుటఁ గాంచి వనచరులు నీ వాదశానను నెఱుంగుదే మాకు సీతావృత్తాంతం బేమైనఁ దెల్పఁగలవా యన నాఖగపతి యిట్లనియె. 64

ఉ. రావణు నేనెఱుంగుదు దురంబున నాతని ధాత్రిఁ గూల్పఁగాఁ
జేవయు నుండెఁగాని యటు సేయ దహించెను నాదుపక్షముల్
దైవికకర్మతంత్రమున దానవు నిప్డనిఁ దాకనేర సీ
తావిషయంబుఁ దెల్పెద యథాస్థితి నాదుతపోబలంబునన్.

క. అని దివ్యదృష్టిఁ గన్గొని
జనకజకల దసురువీటఁ జనుఁ డచటి కటం
చనిపల్క జాంబవంతుఁడు
వనధి న్దాటెడువిధంబు వ్రాకుచ్చుమనన్. 66

వ. నాకుమారుండు లంకకేగి సీతన్జూచి రాసమర్థుం డాతని నేనిప్పుడ రావించెదనని తనమనంబునఁ దలంప ముహూర్తమాత్రంబున నాఖగేంద్రతనయుం డేతెంచి కపుల యావద్వృత్తాంతంబు విని నే లంకకేగి సీతఁ జూచివచ్చెద నన నంగదుం డతని వారించి యక్కార్యం బే మెచేసెద మని పల్క నంత వానరులెల్లరు హర్షసాగరమగ్నులై సాగరంబుఁ

జేరనేగి యట మింటికెంటియున్న మహేంద్రధరాధరం బధి
రోహించి యయ్యెడ. 67

క. ఎవ్వఁడు దాటసమర్థుఁడో
యివ్వననిధిఁ దెల్పుఁడని కపీశవరులఁ దా
నవ్వాలితనయుఁ డడుగన్
నవ్వుచు నొండొరులఁ గనుచు నగచరు లుండన్. 68

వ. కొంతవడికి గజుండు లేచి తాఁ బదియోజనంబులు దాఁటెద
ననియె. గవాక్షుం డిరువదియనె, శరభుండు ముప్పది, ఋష
భుండు నలువది, గంధమాదనుం డేబది, మైందుఁ డఱువది,
ద్వివిదుండు డెబ్బదియోజనంబులును దాటఁగలమని పల్కి
రంత.

తే. జాంబవంతుండు పల్కెఁ దాజలధిదాటఁ
గలుగుసామర్థ్య ముండె ము న్దానిసురలు
రాక్షసులు నాదియుగమున రణముసేయు
తఱిని నాదగుజానువు విఱుఁగుకతన. 70

క. తొంబదియోజనములు ధై
ర్యంబున దాటంగఁగల నటం చతఁ డన నే
నంబుధిదాటెదఁగాని ర
యంబున మరలంగ లేనొ యనె నంగదుఁడున్. 71

వ. అంత జాంబవంతుండు హనుమంతు న్గనుంగొని యిట్లనియె.

చ. పలుకవదేల మారుతి భవద్బలవిక్రమధైర్యశౌర్యముల్
దెలియవె మాకు, నోపియుఁ జలింపకయుండెదురామకార్య
ముల్, సలుపఁగ నీవుకాక మఱేఁ జాలినవాఁ డెవఁ డిందుఁ

దావకో,జ్జ్వలమహిమంబుఁ జూప నిది చక్కనికాలము
జాలమొప్పునే. 73

సీ. జనియించుతోడనె సవితృమండలమును
బండనిపట్టినగండఁ డెవఁడు
కేతుగ్రహంబును గేలబిట్టడఁచి గ్ర
హణము నాపిన యట్టియలఘుఁ డెవఁడు
ఐరావతంబుపై కరిగి తెల్లనిఫల
మంచు భక్షింప హర్షించె నెవఁడు
ఉదయాస్తగిరులపైఁ బదయుగళం బూని
నిగమముల్ రవినుండి నేర్చె నెవఁడు

తే. అట్టి హనుమంతుఁ గీర్తిదీప్యద్దిగంతు
నిన్నుఁగా కన్య నడిగిన నున్నెసిద్ధి
రామకార్యధురీణుఁడవై ప్రబలయశము
గాంచుమయ్య బలంబున మించుమయ్య.

తే. మించు నీమహిమంబు గ్రహించికాదె
క్ష్మావరుం డిచ్చె నీకు నుంగరము మొన్న
గాన నీకార్యమన్యుల పైనిఁబెట్టి
యట్టె వేఱుండ నొప్పునే యనిలతనయ.

వ. అని పొగడిన హనుమంతుం డుత్సాహస్వాంతుండై తన
బలంబుఁ దానెఱింగి దిక్కులు మార్మోగ నార్చుచుఁ గపుల
న్గాంచి యిట్లనియె. 76

క. శతయోజనమాత్రము పరి
మితిగల యీజలధి నధిగమించుటకై యీ

గతిఁ గుందనేల నేను
ధృతిసప్తసముద్రములను దాఁటెద లీలన్. 77

ఉ. లంకకు నేగి వేడ్క నకలంకగుణాన్వితసీతఁ దెచ్చెదన్
బొంకమడంచి రావణునిఁ బోర వధించెద నేనె లేనిచో
లంకఁ బెకల్చి తెచ్చి పదిలంబుగ రాముని మ్రోలనిల్పెదన్
శంకలు వీడుఁడన్న నరుసంబును జెందిరి సర్వవానరుల్. 78

మాలిని:—

అకుటిలసుచరిత్రా యబ్ధికన్యాకళత్రా
చకితభయవిదూరా శత్రుసంహారధీరా
వికటదనుజకాలా విశ్రుతానందజాలా
ప్రకటజగదధీశా భద్రధాత్రీధరేశా. 79

గద్య. ఇది మంత్రికులోద్ధార రామయకుమార భద్రాచలనివాస
తూము సీతారామదాస ప్రణీతంబయిన సీతారామ రామా
యణ కావ్యంబునందుఁ గిష్కింధాకాండ కథాసంగ్రహ
మేకాశ్వాసము.



# సీతారామ రామాయణము

## సుందరకాండము.

క. భద్రధరాధరధామా
కద్రూసుతతల్పఘోర కలుషవిరామా
చిద్రూపపుణ్యనామా
క్షుద్రజనవిరామరాజ కుంజరరామా.

క. ఆవలికథ విను మాసీ
తావనజదళాక్షి ననిలతనయుఁడు కాంచన్
రావణుపురి కేగి జయ
శ్రీ వెలయఁగ వచ్చినట్టిచెల్వొప్పుగతులన్.

శా. అంత న్మారుతి యబ్ధిదాటు సమయం బందబ్జజున్ శ్రీరమా
కాంతున్ శంకరు నెంచి మ్రొక్కులిడి యక్కాకుత్స్థపాదా
బ్జముల్, స్వాంతంబందుఁ దలంచుచు న్వెస మహోత్సాహం
బున న్వానరుల్, గంతు ల్వేయుచు మేల్భళీయన నగాగ్రం
బెక్కె యుగ్రాకృతిన్. 3

మ. నడుమున్ లెస్స బిగించి యూపిరిఁదగన్ బంధించి మేన్వంచి
యెక్కుడుపూన్కిన్ గిరినంఘ్రులూని పయికిన్ గుప్పించి
లంఘించి యాజడధి న్దాటి నభంబుపైకి నెగురన్ సామీరి
సత్త్వోద్ధతిన్, బుడమిన్ గ్రుంగె మహేంద్రశైలము పడెన్
భూజంబులున్ ధారుణిన్. 4

## సుందరకాండము.

క. ఆకరణి నెగిరి యాయి
క్ష్వాకునిశర మనఁగ మింటఁ జనుచుండఁగ మై
నాకగిరి జలధిపంపున
నాకపిమాత యగునట్టు లంబుల దేలెన్.

క. దానిఁ గని వాయుజుఁడు తన
కానగము విరోధ మూని యత్యవరోధం
బై నిలచె నంచు నశనిస
మానోద్ధతి దానిఁ దాకె మహితాస్ఫటితోన్.

క. తాకిన నాపర్వత ము
ద్రేకంబుగఁ దూలి తనదుశృంగంబున మ
ర్త్యాకారంబునఁ గన్పడి
నీకూతగ నిలచితిని వనేచర వినుమీ.

సీ. రాముకార్యార్థివై నీవు రయముతోడ
గగనపథమునఁ బోవుటఁ గాంచి జలధి
నీకు విశ్రమమీయఁగా నిలువుమంచుఁ
గోరవచ్చితి శ్రమఁదీర్చుకొను మనంగ.

క. ఈపాటి పని యొనర్చుట
కేపాటిశ్రమంబుకల్గు నిటుఁ దడయంగా
నోపనని సుంతఁ గరమున
నాపర్వత మూని చనియె నగచరుఁ డంతన్.

సీ. అవల మారుతి యసహాయుఁడై యొకండు
పోవుచున్నాఁడు లంకలో భూరిబలులు
రక్కసులు పెక్కులున్నవార లెటులగునొ
యనుచు దేవత లతనిదార్ఢ్యం బెఱుంగ.

క. సురస యనునాగమాతను
దరుచరునిఁ బరీక్ష సేయఁ దరలుమనంగా
సురురవము సేయు చవి యం
బరవీథిని నిలచెఁ గపికిఁ బ్రతిహత మొదవన్.

గీ. నిలచి యోజనవిస్తీర్ణ బిలముగాఁగ
నోరు పెంచ్చించి వాయుతనూజుఁ గాంచి
క్షుత్తుఁ బాయంగ నానోటఁ జొచ్చు మనఁగఁ
గాయమును బెంచె నద్దానికంటె నతఁడు.

సీ. సురస యాతనిగాంచి సరగున దననోరుఁ
బది యోజనము లగుపగిదిఁ బెంచెఁ
దరుచరుం డదికని తనమేను నిరువది
యోజనాయతమయి యొప్పఁ జేసె
నంతఁబోకయ్యది యాముడల్ ముప్పదిఁ
గాఁ దనభూరివక్త్రంబుఁ దెఱచెఁ
గపివీరుఁ డద్దానికన్న వృద్ధినిగాంచ
నది వానికంటె నోరట్టివిప్పె

తే. వాయుజుం డావిధంబు చొప్పడదటంచు
సూక్ష్మ రూపంబుఁగొని దానిశుంభదుదర
బిలములోఁ జొచ్చి తోడనె వెలికివచ్చి
యడఁగెనే నీదుక్షుద్బాధ యనుచు నడిగె.

క. అన సురస విస్మయంబున
వనచర నీవుజ్జ్వలప్రభావుఁడ వెందుఁ
దనుజభయం బొదవదు పో
మ్మని పథమీ నతఁడు మింట నరుగుచు నుండన్.

క. ఛాయాగ్రాహిణియగు నొక
మాయారక్షోగ్రహంబు మారుతిదేహ
చ్ఛాయనుబట్టి మహాంబుధి
తోయంబుల కతనినీడ్వఁ దొడరుచునుండన్.

చ. అనిలజుఁ డంతఁదానెటుల నవ్వలికేగ జవంబుసూపినన్
జనవలనొప్ప కబ్ధిజలసన్నిధికిన్ దిగుచుంటఁగాంచి నె
మ్మనమునసంశయించి జలమధ్యమునం దొకసింహికాఖ్య దు
ర్ధనుజనుగాంచి దానిని వధంబొనరింపఁగ నిశ్చయించుచున్.

క. ఆరాక్షసి గర్భంబున
మారుతి సూక్ష్మాంగుఁడై యమానుషశక్తిన్
దూరి యటఁ దనువుఁబెంచి య
వారితగతి దానిపొట్టఁ బగిలిచి త్రుంచెన్. 17

క. త్రుంచి మరలమింటికిఁ గు
ప్పించియెగసి రామబాణవేగోద్ధతి శే
షించినమార్గముఁజని నే
వించెన్ లంకన్ బరప్రవేశాతంకన్. 18

మ. వెసనాతంకచయంబునెల్ల నిటు లావీరాధివీరోత్తముం
డసమజ్ఞాన బలాతిరేకమున సుంతైనన్మనోదేహ నీ
రసముల్ పొందక యుక్కడంచి యరిగెన్ రక్షోపురిన్ జేరఁ ద
న్నసహాయోగ్ర మహాబలుండనుచు దేవానీక మగ్గింపఁగన్.

వ. ఇట్లు హనుమంతుండు రవి పశ్చిమాబ్ధిఁగ్రుంకువఱకు సము
ద్రంబు దాఁటి సువేలాద్రిన్ జేరి తాఁ దాల్చియున్న యమ్మ
హాకాయంబునఁ బురంబుఁబ్రవేశించుట యుక్తంబుకాదని
తలంచి సంకుచితదేహుండై లంకాముఖద్వారంబుఁ జేరనేగె.

చ. కనెనట నాంజనేయుఁ డధికస్ఫుటఘోరరవాట్టహాస గ
ర్జనలొనరించుచుంన్ దనుజరాజపురోపతటీ కవాటమై
తనరెడు లంకయ న్భయదదైత్యవధూటిని దన్ని కొటియున్
వనచరుఁ గాంచి యేటికిట వచ్చితి వెవ్వఁడ వీవటం చనన్.

క. తరుచరుఁ డిట్లనె నే నీ
పురము గ్గనవచ్చినాడఁ బోనిమ్మనినన్
సురలకునైన న్జొరదు
స్తర మీపురి వానరునకు దాఁటఁగవశమే. 22

వ. అని యద్దానవి వానరుఁ ద్రోసివైవ నాతండు దాని నశని సంకాశంబగు ముష్టిఁబొడిచిన నది రుధిరంబుఁ గ్రక్కుచు మూర్ఛిల్లి తెలిసి మున్న జుండు సీతాన్వేషణార్థం బెప్పు డొక్కవానరుండువచ్చి నిన్ను నొప్పించు నప్పటినుండి దాన వనాశం బగునని చెప్పె నీవప్పనికై వచ్చిన వానరుండ వగుదు లేకున్న నన్నొరుండు నొప్పింపఁగలఁడే నీవు దుర్వారబలుండవు కాన నాటంకరహితుండవై నీవిప్పు రంబుఁ జొచ్చి నీవచ్చినపనిఁ జూచికొమ్మని చెప్పి త్రోవ యిచ్చిన నవ్వానరవీరుండు లంకాముఖద్వారము దాటి సూటినొప్పుచు. 23

శా. భేరీభాంకృతులున్మృదంగరవముల్ వేణుధ్వనుల్ డిండిమా
పారారావము లత్యుదగ్రపటహాధ్వానంబులున్ గాహళో
దారప్రస్ఫుటనాదముల్ కలసి సాంద్రంబై సముద్రోగ్రగం
భీరప్రోద్ధతభూరిఘోషగతి నవ్వీటన్ గడు న్బర్వఁగన్. 24

ఉ. ఆనినదంబు లాసురమహారవముల్ చెవుల న్బగుల్ప నెం
తేనియు సూక్ష్మరూపమున నేగి పురంబును జొచ్చి యామరు

త్సూనుఁడు తన్మనోహరగతుల్ పరికించుచు విస్మయావహుం
డై నృపసూనులు న్గపుల హా యెటులో ర్తురో యంచు
నెంచుచున్. 25

సీ. బహుయోజనంబులు పర్వినవీథులు
సరళరేఖలగతిఁ జక్కనిగుడ
నిరుగెలంకుల సౌధనికరంపుఁ బైకప్పు
లేకమై నడచిపో నిరవొసంగ
వీథుల కిటునటు విరులీనుతరువులు
విద్యుత్ప్రభాదీపవితతు లెసఁగఁ
జంద్రకాంతశిలావిశాలసోపానముల్
క్రాలెడుపద్మాకరంబు లొప్ప
తే. నమితశృంగారవనములు దృఢధ్వజములు
మండపంబులు గోపురమండలములు
కోటలును వాటములయిన వాటికలును
బరఁగి శోభించుచుండె నప్పురవరంబు. 26

మ. కరు లుష్ట్రంబులు తేరులున్ హరులసంఖ్యాకంబులున్ రాక్ష
సోత్కరసైన్యంబులు కోటు లర్బుదములున్ దత్పట్టణంబందు
నం, దరుదౌ వస్తువు లేదు సృష్టి నెట సర్వైశ్వర్యసంపత్తుల
ప్పురిలో వర్ధిలు నెందు లేని దచటన్ బొందంగనౌ నెప్పుడున్.

తే. మేదినీమధ్యగతమైన మేరువట్టు
లమ్మహాపురినడుమఁ జెల్వమ్ముగాఁగ
స్వర్ణనవరత్నచయమయోదీర్ణమైన
యుజ్జ్వలద్దైత్యపతిధామ మొప్పుచుండె. 28

క. ఆపాలసుదిండి ధామము
దీపితనవరత్న ఖచితదీప్యద్బహుసౌ
ధోపవన స్తంభలస
ద్గోపురమణిమండపములతోఁ దనరారున్.

సీ. ధనదునిపురి రావణునిపట్టణము మ్రోల
దివిటిముందఱఁ జిన్న దీపికళిక
సురనాథునగరంబు సురవైరపురికడ
దిగదీసి విడిచిన వెగటుచోటు
కైలాసపురము లంకానగరము ముందు
జంద్రుని మ్రోల నక్షత్ర కాంతి
యబ్జజువీడు దశాస్యుధామము చెంత
వజ్రము ముందొక్క పలుగుఱాయి

తే. యనఁగ నసమానవైభవంబున వెలుంగు
రాక్షసాధీశ్వరుని సౌధరాజిఁ గాంచి
విభ్రమాశ్చర్యభయములు పెనగొనంగఁ
గలఁగి మ్రాన్పడి మారుతి తలఁచె నిట్లు.

తే. మయుఁ డజుండును [illegible]యును గలసి
రావణునిధాక కడలి యీరమ్యమైన
పురవరంబును నిర్మింపఁబోలుఁ బ్రౌఢి
త్రిజగములలేని యసమానతేజ మమర.

వ. అని తలఁచి కొంతసేపు నిలచి చూచి యోజనాయతం బగు
రావణుమహాపరిధిఁ జొచ్చి యందలి ప్రాసాదంబు లరసి
చూడ లక్షలకొలంది లక్షణవంతులైన స్త్రీపురుషులు భక్షణా

వీక్షణ సంభాషణవిహారణశయనాదికార్యంబులఁ దనరారు చుంటఁ గాంచి వితాకొదవి యిట్లని తనలోఁ దాఁ దలంచె.

శా. ఆహా యెయ్యెడ నిమ్మహాపురమునం దాసించి శోధింతు వై
దేహిన్ జూచుట నాకెటుల్ కలుగునాదేవిన్గనన్ లేదు ము
న్నా వాఃపోహము లెట్లు వర్తిలునొ యన్యుం డెవ్వఁడా సా
ధ్విన, ద్రోహప్రక్రియ నాకుఁ జూపు భగవంతుం డేమి
కావించునో. 33.

వ. అని శ్రీరామచంద్రపాదాబ్జంబుల సంస్మరించి యుత్సాహ సమన్వితుండై సర్వస్థలంబుల శోధించి చూచెదగాక యని నిశ్చయించికొని ప్రతిగృహాంతరవర్తులను వెదకుచు రావణాంతః పురంబునెల్లఁ బరిశోధింప నందొక్కభర్మహర్మ్యంబున నవరత్నస్థగితడోలికలో హంసతూలికాతల్పంబుపై దశాస్యుప్రక్కఁ బవళించియున్న యొక్కమహాసుందరిఁ గాంచి సీత యని శంకించి యిట్లని వితర్కించె. 34.

మ. అకటా! రామునిసాధ్వి యిక్కరణి దైత్యాధీశుతోఁగూడి
యో, డకపాపంబున కొప్పియుండునె జడుండన్గాన నాకిట్టి
పా, తకచింతల్ పొడమెన్ దశాననుని చెంతన్ జేరి యున్నట్టి
యీ, వికచాబ్జానన వానిభార్య యగునే వేతేల భావింపఁ
గన్. 35.

వ. అని తనయపోహమునకుఁ దన్ను నిందించికొనుచు నాసౌధంబుఁ బాసి ప్రతిగృహంబుఁ జొచ్చిచూడ నందంద రక్షో సుందరులు సందడిమాని మందగతుల శయనగృహంబులఁ జేరుచుఁ గొందఱును, జేరి శయనించి తమ స్తననాభీదేశంబులఁ జీరెలు తొలంగు టెఱుంగక గాఢనిద్రావశలై కొంద

ఉ. వారలతో నడంగుదురు వారలవారలు వారివారలి
ట్లారఘువంశముఖ్య రవిజు నన్వయము న్దెగటారు నేసత
ద్ఘోరవినాశనస్థితిని గూర్చెదుకారణ మాటకంటె నే
వారక యుద్దె చచ్చుట శుభంబగు నంచు నెదన్దలంచుచున్.

వ. నిరుత్సాహుండై యుండి కొంతవడికి మరల నిట్లని విత
ర్కించె. 40

క. ఆసతి యిట లేకుండుట
యే సత్యం బైనసీత యిందున్నదటం
చాసంపాతి యనృతముల్
వాసికి వచియించునట్టివాఁడే యనుచున్. 41

క. మతిఁ దెల్పికొని కపీంద్రుఁడు
వెతఁగనఫలమేమి దనుజు వీట నెటనొ యా
సతియుంట నిజము శాంత
స్థితి నరసెద నింక నెల్లదిక్కులనంచున్. 42

వ. దృఢనిశ్చయుండై శ్రీరామచంద్రుపాదాబ్జంబులఁ దలంచి
నభోతలంబున కెగసిమూఁడ దూరంబున నొకవనంబును
నం దచ్చటచ్చట గృహంబులును మిన్కుమిన్కున దీపకలిక
లును దనరారుచుంటఁ గని వాయుపథంబున నయ్యెడ కేగి.
యందెల్లెడల వివరంబుగా నరయుచుండునెడ. 43

సీ. చెక్కిటఁ జెయిఁజేర్చి చింతాభరంబునఁ
గన్నీటిచుక్కలఁగార్చుదానిఁ
గేశముల్ జడగట్టి క్రిందికి వ్రేలాడ
యోగినివలె నొప్పుచుండుదానిఁ

ఉ. వారలతో నడంగుదురు వారలవారలు వారివారలి
ట్లారఘువంశముల్ రవిజు నన్వయము న్దెగటారు నేనత
ద్ఘోరవినాశనస్థితిని గూర్చెదుకారణ మాటకంటె నే
వారక యిప్డె చచ్చుట శుభంబగు నంచు నెద న్దలంచుచున్.

వ. నిరుత్సాహుండై యుండి కొంతవడికి మరల నిట్లని విత
ర్కించె. 40

క. ఆసతి యిట లేకుండుట.
యే సత్యం బైనసీత యిందున్నదటం
చాసంపాతి యనృతముల్
వాసికి వచియించునట్టివాఁడే యనుచున్. 41

క. మతిఁ దెల్పికొని కపీంద్రుఁడు
వెతఁగనఫలమేమి దనుజు వీట నెటనో యా
సతియుంట నిజము శాంత
స్థితి నరసెద నింక నెల్లదిక్కులనంచున్. 42

వ. దృఢనిశ్చయుండై శ్రీరామచంద్రుపాదాబ్జంబులఁ దలంచి
నభోతలంబున కెగసిచూడ దూరంబున నొకవనంబును
నం దచ్చటచ్చట గృహంబులును మిన్కుమిన్కున దీపకళిక
లును దనరారుచుంటఁ గని వాయుపథంబున నయ్యెడ కేగి
యం దెల్లెడల వివరంబుగా నరయుచుండు నెడ. 43

సీ. చెక్కిటఁ జెయిఁజేర్చి చింతాభరంబునఁ
గన్నీటిచుక్కలఁగార్చుదానిఁ
గేశముల్ జడగట్టి క్రిందికి వ్రేలాడ
యోగినివలె నొప్పుచుండుదానిఁ

గడుమాసినవలువగట్టి ధూళిపరీత
మై కృశించినదేహ మమరుదాని
నిగుఱుగప్పిన యట్టినిప్పుకై వడి మసి
యందుండురతనమ ట్లమరుదాని

తే. శింశుపావృక్ష మండగాఁ జేరి యొదిగి
దీర్ఘనిశ్వాసముల హా విధీ యటంచుఁ
దీండ్రమగువేదనం బడుతెఱవ నొకతెఁ
గాంచి మారుతి సంశయాకలితుఁ డగుచు.

క. కనుచీకటిమఱుఁగున నా
వనితను దగఁగానలేక వడి నావృక్షం
బున కెక్కి లెస్స నాసతిఁ
గనుచుండెను హనుమ యాస కడుగడలుకొనన్.

వ. అంతఁ గొంతసేపటికి.

సీ. కొక్కొరొకో యని కోళ్లు మెండుగఁ గూసెఁ
గలకలధ్వనులతో ఖగము లెగసెఁ
గాంతులఁ బాసి చుక్కలదృశ్యతను జెందె
వెలవెలఁబాఱె దీపిక లడంగె
జారచోరులగూఢసంచారము లుడిగె
గూబలు గొందులఁ గూర్చి యఱిగెఁ
దలక్రిందు లగుచు గబ్బిలములు వ్రేలాడె
విధుల నొనర్పంగ బుధులు సనిరి

తే. తమము విరిసె దిశల్ తెలు పమరి క్రాలెఁ
బ్రాచిపనులకు లేచిరి పడఁతులోలి

రావణునిజీవితం బింక ర క్తిఁబాసి
తెల్లవారెడు నన నాఁడు తెల్లవారె. 47

ఉ. అంతట హర్షమొప్ప దనుజాంగనలెల్లరు నిద్రలేచి య
శ్రాంతమనోవిచారశిఖ ప్రగ్గెడు భూసుతచుట్టుఁజేరి దు
శ్చింతలఁగూర్చువాక్యములఁ జేడ్పడఁ బల్కుచుఁ బుండు
మీఁద ము,ల్లెంతయు లెస్సఁ గ్రుచ్చునటు లేచఁబోడంగిరి
రాముపత్నినిన్. 48

క. ఉదయశిఖరి రవితోఁచెను
ముదమునఁ బురమందు వాద్యభూరిరవంబుల్
పొదవెను దైత్యులు తమతమ
సదమలవిధులందు మెలఁగసాగిరి వరుసన్. 49

క. అనిలజుఁడు పగటిపూటను
వనితనుఁ గని రాఘవుండు వాక్రుచ్చినయా
తనునైభవవస్త్రాభర
ణనికాయముఁ గాంత మేను నన్గన్గొంచున్. 50

చ. మఱియు నిశాచరాంగనలమాటల జానకి పల్కుపల్కులన్
వెరవున నాలకించి యట వెల్గెడునాతిరొ సీతయంచు సు
స్థిరముగఁబోల్చి యానిశినిఁ జేడియతోఁ బలుకాడ నెంచి త
త్తరువున డాగియుండె విదితంబుగ సీతయవస్థఁ గాంచుచున్.

చ. పొడమిన యట్టికాలమున ముద్దుగ నందఱు సూడ నొప్పుచున్
బడుచుదనాన నెవ్వరు కనన్గనట్టి భయప్రదస్థితిన్
నడచుచు వార్ధకంబున వినమ్రతసత్ప్రభఁ బాసి తూలుచున్
బుడమిఁ జరించుభూతములపోలిక వర్తిలె భాస్కరుండునున్.

క. కనుఁగొన భూతంబులకుఁ
జననాదులు కల్గు నొక్కసారి మనుగడకుఁ
దినకరున కొదవునటుగా
కనుదినగండంబు నాయు దబ్దశతంబున్. 53

వ. అట్లాహనుమంతుం డెప్పుడు సూర్యుఁ డస్తమించునో యెప్పుడు రాక్షససుందరులు సందడిమాని నిదురింప నేగెదరో యెప్పుడు తనకు సీతాదేవితో సంభాషించుసమయం బగునో యని నిరీక్షించుచుండ. 54

సీ. రవి కంతకంతవార్ధక్యంబు నెలకొనె
నెండవేడిమి ధర మెండు తగ్గె
దుర్నిరీక్ష్యస్థితిఁ దోఁచిన సూర్యుండు
ప్రభఁ దక్కి యపరవారాశిఁ గ్రుంకె
సంధ్యాసమయమయ్యె జనులు పనులనుండి
వచ్చి రిండ్లకుఁ జలి ప్రబలమయ్యెఁ
గ్రమముగాఁ జీకట్లు గవిసె భూతలమున
మింట దారలు మిన్కుమిన్కులాడె
తే. నిష్ఠ లంకాపురాంగన నీలిచీరెఁ
దాల్చి శిరమున శితపుష్పదామ మూని
నీరధిని స్నాన మొనరింప నిలిచె నన(గఁ
దనరె నాదీవపభూనభస్థలములబ్ధి.

క. ఇఁక జానకి నిన్గాంచి ప
లుకఁదగుతఱి డాసె నంచు లోఁదలఁచుచును
త్సుకుఁ డయి మారుతి యుండఁగఁ
బ్రకాశముగఁ దోఁచె నబ్జవైరి నభమునన్.

వ. అంత నారాక్షసస్త్రీలు మజ్జనభోజనాదులు ముగించి సీత న్విడచి క్రమక్రమంబున నిద్రావేశలై నిష్క్రమించి యర్ధ రాత్రంబు దాపగువేళఁ బవనతనయుం డించుకసేపు దడసి పడఁతిని గని భాషించెద నని యలరుచుండ. 57

క. లంకేశుం డారాతిరి
నంకాపాంకాలుగా ధరాత్మజయెడ మీ
నాంకజ్వర మొదవి మదిఁ
శంకింపక శయ్యవిడచి చయ్యన లేచెన్. 58

సీ. లేచి సుగంధవిలేపనంబులు లెస్స
తనదు దేహమునిండఁ దనర నలమి
యలమి యుజ్వలవస్త్రములఁగట్టి నవరత్న
ఖచితాభరణములఁ గడఁగి దాల్చి
దాల్చి పన్నీరు నత్తరు మేన వెదజల్లి
తగినతాంబూలఖాదన మొనర్చి
యొనరిచి యటు నిటు యోషిజ్జనంబులు
క్రమముగ వింజామరములు విసరఁ
తే. జాలనలువంకలను దివిటీలు వెలుఁగ
దానవస్త్రీసహస్రముల్ దగిలి కొలువఁ
గడఁగి నడిరేయి నయ్యశోకవనమునకుఁ
బృథ్విసుతఁ గాంచ రావణవిభుఁడు వెడలె.

క. ఎట్టిదో వానిమనోగతి
గట్టిగ ధరణీజ లక్ష్మిగా నెఱిఁగియు దా
నిట్టుల రా హేతువు గని
పెట్ట నెవని కగును దైత్యవిభునకుఁ దక్కన్.

వ. అట్లు రావణుండు బయలువెడలి యశోకవనంబు డాయరా నచ్చటిదైత్యకాంతలు భయవిభ్రమాశ్చర్యమనస్కలై తటాలున శయ్యలు వీడి లేచి దైత్యపతి కెదురేగి వినమ్రలై యాతని సీతాసాన్నిధ్యంబునకుఁ దోడ్కొనివచ్చిన బెబ్బులి న్గాంచి గడగడ వడంకుకురంగంబు తెఱంగునఁ దన్గని మహాభయంబునఁ బ్రాణంబు లఱచేతిలోఁ బెట్టికొని చెట్టు చాటున నొదిగియున్న యాసుదతి న్గాంచి రావణుం డిట్లనియె. 61

సీ. సదమలాహారముల్ సాపడ వదియేల
సుధఁబోలు సురఁద్రావి సొక్కవేల
ధౌతాంబరంబులు దాల్పఁబూనవదేల
సొంపులౌ నగలు ధరింపవేల
స్రక్చందనాదిచర్చలు కైకొన వదేల
తమలంబు నమలంగఁ దలఁపవేల
నీదుదాసుని నన్ను నెనరునఁ గనవేల
యసురకాంతలసేవ లందవేల
తే. యౌవనము జాఱిపోయిన యవలఁగలవె
దేహసౌఖ్యార్థవైభవస్థితులు పుడమి
దీపమున్నప్డె వెదుకంగ నోపకున్నఁ
జీకటిని గానరానివి చిక్కఁగలవె. 62

క. మానవముష్కరు నొక్కని
మానసమునఁ దలఁచి కుంది మహిఁద్రెళ్లినచోఁ
గానంగలవే సుఖములు
జానకి యీవెఱ్ఱితనముఁ జయ్యన విడుమీ. 63

# సుందరకాండము.

క. రాముఁడు నిన్నుఁ గానక
భీమవ్యథవనమునందె విడచెను దేహం
బామనుజునోదరుం డపు
డే మడిసె నిఁకేల వాండ్ర నెంచి వగవఁగన్.

క. మడిసినమగఁ డేగతిఁ గ
న్పడు నాతఁడు బ్రదికియుండినను రాఁగలఁడే
జడధినిదాటి యిచటికిఁ
విడువక వచ్చినను మనునె వేఁజాకుండన్.

క. ఇరువురు నరు లేగతి నీ
సురాసురాభేద్యమైనశుంభద్రక్షో
వరపురిఁ జేరి జగద్భీ
కరు నను గెల్వంగఁగలరు కాంతరో సెపుమా.

క. చులకనఁజేసెదు నను ని
న్వలచి యిటుల వచ్చియుంట వనితరో వినుమ
ద్బలవిక్రమసంపద జగ
ములసింహాస్వప్న మరుల మ్రోలనెటన్నన్.

సీ. కేల నాకైలాసశైలంబు నెత్తితి
శివలోకమంతయుఁ జేడ్పడంగ
సురల నోడించి యాసురనాథుబంధించి
వదలితిఁ దుది బ్రహ్మావచ్చి వేడ
యక్షవీరుల నక్కుపక్షులఁగావించి
ధనదుఁ బాఱఁగఁదోలితిని రణమున
నరనాయకులను జేర్కొననేల నెప్పుడు
కూరగాయలు మాకు వారలె సుమి

తే. యిట్టి మహితపరాక్రము నిట్టిదిట్ట
నిట్టిత్రైలోక్యభీకరు నిట్టిఘనుని
నన్ను ననిదాకి మనునాతఁ డున్నె జగతి
రాముపై భ్రాంతివిడుముడు రాజవదన. 68

తే. ఇట్టి ననుబొందఁగోరెద రిందుముఖులు
"కలవు నాదుకుం దేలుకుఁ గాళ్లుమూడె"
యన్న గతిఁ బట్టుదలను బాయ వదియేల
యేడ రాముఁడు గీముఁడు లేఁడు భూమి. 69

వ. ఇట్టి దుర్భాషలాడుచున్న దశముఖు నెంచి పెడమోమువెట్టి యొకతృణఖండం బడ్డంబుగాఁ బట్టికొని భూపుత్త్రి యిట్లనియె. 70

క. పరసతిఁ గోరుట దుర్భర
తరపాపం బంచు నెఱఁగి దైత్యాధమ! నర
గరమెద నొవ్వన్బల్కెదు
నరకనివాసంబునొంద నరిగెదవాక్కో. 71

ఉ. ధీరుఁడ వైనరాఘవు నెదిర్చి జయించి నను న్గ్రహించియుం
దోరినిశాట! రాముని బలోగ్రతకు న్వెఱపొందికాదెనర
జోరునిభంగిఁ దెచ్చితివి శూరుఁడ నేనని యేమొగంబుతో
నోరులు విప్పి పల్కెదవు నొవ్వక నాయెదుట న్బ్రగల్భముల్.

క. శ్రీరాముని శరవహ్నిని
వేరణమునఁ గూల నీకు విధి వ్రాయుటచే
ఘోరమగుబుద్ధి నీమతి
వారక జనియించె నీదు ప్రారబ్ధమునన్. 73

క. నేనే త్రుటిలోభస్మము
గా నిన్నపియింపఁగలనుగాని పతినుడిఁ
బూనమి నట్టులఁజేయ
న్మానితి మద్విభుఁడు నిన్ను మర్దించుటకై. 74

చ. అనలమునుండి తీక్ష్ణత లతాంతమునుండి తదీయవాసనఁ
వనరుహమిత్త్రునుండి తదపారవికాసముఁ బాపవచ్చునే
దనుజ! ననుఁ రఘుప్రవరుఁ దప్ప నొనర్చి గ్రహింప నీకు లో
నెనయు దురాశతీఱదు సరేకద మిమ్ములఁగూల్చు వెండియున్.

సీ. నీవెత్తలేనిగౌరీవిభుఁచాపంబు
నవలీలఁ దానెత్తి యట్టె విఱిచె
నినుజయించినయర్జునుని వధించినభృగు
రామునిదృటిని నిర్గర్వుఁజేసెఁ
గాముకేళినిగోరి కడిఁదివచ్చిన నీదు
చెలియలిముక్కును జెవులుకోసెఁ
బదునాల్గువేల నీబంధువర్గంబుల
నొక్కండె రణమున నుక్కడించె

తే. హస్తిమశకాంతరము నీకు నతనికెసఁగుఁ
గపటమున నన్నుఁ దెచ్చితి కాని యపుడె
రాముఁడే యున్న నిఁ దృటిప్రాల్పకున్నె
తొలఁగఁ డివైన నిన్ననిఁ ద్రుంపకుండ.

సీ. అడవివి నీవు దావాగ్ని యారాముఁడు
వనధి వీవు బడబవహ్ని యతఁడు
తూలంబ వీవు వాతూలంబు రాముఁడు
అంధకారంబ వీ వర్కుఁ డతఁడు

కాలసర్పమ వీవు గరుడుఁ డారాముఁడు
మదగజ మీవు సింహం బతండు
మూషకంబవు నీవు పోతుపిల్లి యతండు
క్రతుపశు వీవు తత్కర్త యతఁడు
తే. వినుము నామాట బ్రదుకంగ వేడ్కయున్న
రామునకు నన్ను వెస సమర్పణము సేసి
యామహాత్ముని సచ్చరణాబ్జములకు
నర్థిశరణార్థివగుము దయాబ్ధి యతఁడు. 77

వ. అని పల్కిన రావణుండు రోషారుణితనేత్రుండై మహాకోపంబున ఖడ్గంబుఁ బెఱికి జానకిశిరంబుఁ దెగనేయ గమకింప ధాన్యమాలిని యను దైత్యకాంత యడ్డంబువచ్చి యిట్లనియె 78

ఉ. మానినిఁ జంపనేల నవమానముఁ గాంచఁగనేల త్వాతలిక్
రానని పెన్గులాడు నుడురాజముఖి న్గవయంగ సౌఖ్యముల్
గానఁగవచ్చునే ననుసుఖంబుగఁ గూడుము మర్త్యకాంతకున్
దానవభర్త మోహపరతన్వశుఁడైన జగంబు నవ్వదే. 79

వ. అని పల్క నయ్యశోకవనస్త్రీలతో సీతకు మత్పరాక్రమవైభవసౌందర్యాతిరేకంబులఁ దెల్పి రెండునెలలలో నన్నొప్పకున్న నీకాంతన్ ఖండించి భక్షింపుఁడని పల్కి ధాన్యమాలిన్ గూడి సనియె నంత. 80

క. దనుజాంగన లంతట నా
మనుజాంగనఁ గదియవచ్చి మానిని మామా
టను విని రావణుఁగూడుము
నినుఁగొలుచుచునుందు మేము నెలతరో యెపుడున్. 81

# సుందరకాండము.

క. ఇలువెడలఁగొట్టఁబడి యడ
వులపాలై కుడువఁగట్టఁ బొసఁగక యగచా
ట్లఁబడుమగనిపయిన్ గడు
వలపేటికి వెట్టెదానవా తలప్రాతా.

క. సురవైరివలచివచ్చిన
మురిపెంబునకంటెఁ గలదె భూరిశుభ మిలన్
సిరిరా మోకాలొడ్డెడు
గరితన్ని న్నొక్కదానిఁ గంటిమి వసుధన్.

క. అసురవిభుఁడు మగఁడగుటకు
బిసరుహాలోచనలు తమిఁదపింతురు నీకున్
బొసఁగఁడె "బుద్ధిఃకర్మా
ను సారిణి" యటంచుఁ జెప్పు నుడి నిజమెకదా.

క. ఇనుమునఁ దైలముఁ దీయుట
యసాధ్యమైనట్లు దీనియాత్మను త్రిప్పన్
బొసఁగదు కావున దీనిన్
వెసఁదున్నిగ్రహింత ముడుకునెత్తురు నిపుడే.

సీ. ఒంటిఁజిక్కిన వంటయింటికుందేలవు
వెల్వడె దెటులని వినతపలికెఁ
బంజరంబునఁజిక్కుపడిన కీరం బెందుఁ
జననేర్చునని హావిర్జటవచించె
దైత్యేశుతోరూపధనబలంబులఁ దులఁ
దూగునే నరుఁడని దుర్ముఖియనె
నరుఁడేడ జలరాశిఁ దరియించి మముఁ ద్రుంచి
నినుఁగొంచుఁ జనుటేడ ననెఁ బ్రతపన

తే. చెప్పఁగా వినకుండినఁ జెడఁగఁ జూతు
మసురవిభుఁగూడకున్న నిన్నవనిఁగూల్తు
మంచు రాక్షససతులు కోపించి పలుక
సీత యిటులనె దుఃఖసమేత యగుచు. 86

చ. వనజదళాక్షులార! మది వ్రయ్యఁ గవాక్షిశితాస్త్రధారలఁ
ననుఁగడుబాధపెట్టు టది న్యాయముకాదు తటాలున న్శిరం
బును దెగనేసి భూరితరపుణ్యముఁ గాంచుఁడు గాసికోర్వఁజా
లననుచు నేడ్వఁజొచ్చెను గలంగి యిలాసుత దిక్కులేమిచేన్.

వ. అంత నప్పుడె నిదురలేచి కలఁగంటినని విభీషణపుత్రియైన
త్రిజట యేతెంచి సీతయు దైత్యాంగనలు వినఁ దనస్వప్న
వృత్తాంతంబుఁ దెల్పె నెట్లనిన. 88

ఉ. రాముఁడు లక్ష్మణుండును విరాజితపుష్పక మెక్కివచ్చి యు
ద్దామబలంబున న్సకలదైత్యులఁ ద్రుంచి ధరాజఁ గొంచుఁ బో
నీమనలంక నబ్ధిని లయించుటఁగంటిని ముందదెట్టులో
నోమహిజాత నొవ్వఁబరుషోక్తులఁ బల్కకుఁడంచుఁ దెల్పినన్.

వ. అంత నారేయి యర్ధరాత్రంబు దాఁటుటచే సకల రాక్షసాంగ
నలు నిదురింప నేగి రంత రామునికాంత తనలోఁ దానిట్లు
తలంచి శోకింపుచుండె. 90

ఉ. ఏటికివచ్చె లేడి హృదయేశ్వరు నేటికిఁ బంపితిన్ రవం
బేటికి నాకు విన్బడె సమిద్ధగుణాన్వితు నామఱంది న
న్నేటికి నొవ్వఁబల్కితి విధీ! యిదియంతయు నాదుపాపఁపుం
గూటమికాక యొండనగఁగూడునె నాగతి యేమొ
దైవమా. 91

ఉ. ఆనినదంబు రామునిదొ యాపటుదైత్యునిదో నృపాలుఁ డా
దానవుమాయలోఁబడెనొ తమ్ముఁడు సేరెనొ లేదొ యొంటి
ము, న్నా నరనాథుఁ డాసుర సహస్రములన్నునుమాడెనట్టిస
న్మానితవిక్రముండు పడునా యొకదానవుచేత దీనుఁడై. 92

ఉ. పంచవటిన్న నున్ననక భానుకులు ల్మదినెంతఁగుంది యే
పంచలఁబోయిరో యెటుల భావములందు ననున్దలంచిరో
యెంచఁగరానికష్టగతు లెంతటిలోఁ జనుదెంచె గృధ్రముఁ
గాంచిరొ లేదొ యాతఁ డిలఁ గాయమువీడకమున్నె
రాఘువుల్. 93

ఉ. రక్కసుఁ డీగతిఁ దము మొఱంగి నను న్గొనితెచ్చినట్టు లా
పక్కులఱేఁడు తెల్ప విని భానుకులు ల్ధకద్రుగ్గిరో మతే
చక్కని వీనిఁజంపఁగ విచారము సేసిరొ మానవద్వయం
బెక్కడ వార్ధిదాటు టది యెక్కడ యెక్కడ వీండ్ర
ద్రుంచుటల్. 94

మ. భరతుం డీవిధమాలకించి తనసౌభ్రాత్రంబునన్ సైనికో
త్కరముఁ బంపఁడె రాముఁ దోడ్పడఁగఁ దత్సైన్యంబుతో
రాఘువుల్, శరధిన్దాటి నిశాచరాళుల వినాశంబొందఁ
గావింపరే, సురలు న్మౌనులు నైన రాఘవమహీశుఁ జేరరే
సాయమై. 95

సీ. చచ్చిన మేలనఁ జచ్చిన యావల
వల్లభుం డిచటికి వచ్చునేమొ
వచ్చి రావణుఁ ద్రుంచి వఘనేను మడియుట
విని తాను ప్రాణముల్ విడచునేమొ

నేఁజూక యిటులున్న నిఖిలాసురశ్రేణి
తెగువ నన్నింక బాధింతురేమొ
వెస రాక్షసేశు శపించెద ననఁ బతి
కపకీర్తి జగములం దంటునేమొ
తే. వట్టి యడియాస నెందాక బ్రతికియుందు
ననుచు నేమియుఁదోఁచక యాలతాంగి
నిదురబట్టక ధ్వనులకు నదరిపడుచుఁ
జింతిలుచునుండఁ గని హనుమంతుఁ డంత.

క. ధరణిజఁ గని మాటాడఁగఁ
దరుణం బిదె యంచు వాయుతనయుఁడు వృక్షాం
తరమున నుండియె నారఘు
వరునిఁ స్మరియించె నిట్లవనిసుత వినఁగన్.

సీ. శ్రీరాముఁ డవ్వాని సీతను గోల్పోయి
యాజటాయువుసెప్ప నసురనాథు
డింతిని గొంచుఁ దా నీలంక కరిగిన
వార్త నాలించి యవ్వాలికి నేగి
యర్కతనూజు స్నేహముగాంచి తద్ధిత
ముగ వాలి నొక్కయమ్మున వధించి
వానరకోట్ల నాజానకి వెదుకంగ
దశదిశలకుఁ బంపఁ దవిలి నేను
తే. జలధిదాటి యిటకుఁ జనుదెంచి వెదకితి
సీత నింక నెందుఁ జూతునొక్కొ
యీకుజంబుక్రింద నేడ్చుచు నుండిన
యతివ రాముదేవి యగునొ కాదొ.

క. అనుపల్కుల విని భూసుత
మనమున విభ్రాంతిపొడమి క్ష్మాజముపైకిన్
గనుదృష్టిఁ బరపి కన్గొనె
వనచరు నాతఁడును డిగ్గి వచ్చి నతుండై.

క. అమ్మా! నాతోఁ దెల్పఁగ
దమ్మా నీవెవ్వరవొ సురారివిభుఁడు మో
సమ్మునఁ దెచ్చినరాముని
కొమ్మవొ సురసిద్ధసాధ్యకోటి నెవతెవో.

క. అన జానకి సమ్మదమునఁ
దనయాపత్స్థితిని దెల్పి తరుచరవర్యా
నినుఁ దెలియఁ బలుకుమన నా
హనుమంతుఁడు తనదు విధమునంతయుఁ దెల్పెన్. 101

వ. తెల్పిన నపారహర్ష విభ్రమాశ్చర్యంబులు మనంబున నిండ నాకపి న్జూచి. 102

చ. ఘనతరహర్షము న్గనుచు క్ష్మాసుత యంతనె సంశయాత్మయై
వనచరుతోడ నీపలుకు వాక్యము సత్యమె, నిన్ను రాముఁ
డంపెనె ననుఁగాంచలేక కపివేషమున న్నను బాధపెట్టవ
చ్చినదనుజుండవా నిజముఁజెప్పు మన న్హనుమంతుఁ డిట్లనెన్.

ఉ. మాతరొ నిక్కమే నినజుమంత్రిని రామునిబంట వాయుసం
జాతుఁడ వార్ధిదాటి రఘుసత్తము నాజ్ఞను నీదు క్షేమముల్
ప్రీతి నెఱుంగవచ్చితి గవేషణనేసితిఁ గంటి నిన్నిటన్
క్ష్మాతనయా! నిజంబిది మనంబున నమ్ముము నీదు భృత్యుఁడన్.

క. అన సీత రాఘవుని గుణ
తనురూప పరాక్రమములఁ దగఁ దెల్పుచు నన్

దనుజుఁడు తెచ్చినయావల
నినకులు లేమేమిచేసి రెఱిఁగింపుమనన్ 105

వ. మారుతి సర్వవిషయంబులు నిర్వక్రక్రియ నెఱింగించి శ్రీరాముండు నీకానవాలుగ నిమ్మనిపంపిన ముద్దుటుంగరం బిదె కొనుమని యిచ్చిన సీత యత్యాతురతతో దాని నందికొని దుఃఖహర్షోపేతయై మేనెల్లఁ బులకరింప, బాష్పధారలు స్రవింప, నయ్యుంగరంబుఁ గాంచి కరం బాదరంబునఁ గన్నుల కద్దికొని ముద్దులాడి యింతకాలంబు నన్వీడి యెట్లుంటివని పల్కుచు దుఃఖించి తాఁబడుపాట్లు మారుతికిఁ దెల్పిన నాతం డిట్లనియె. 106

క. తడ వేల తల్లిరో యి
ప్పుడె నిను నావీపుమీఁద బొల్పుగఁ గొని యా
పుడమివిభునికడ నిలుపుదు
జడుపేటికి రమ్మటంచు సామీరి యనన్. 107

క. జానకి నగు చిట్లనియెన్
వానర! బహుసూక్ష్మమా భవత్తనువున నన్
బూని యెటులఁబోయెదవన్
మానిని నారూప మరయుమా యనుచు వెసన్. 108

సీ. తాళసమున్నతిఁ దగినలావునుగల్గి
పింగళవర్ణంబు వెలయుమేను
నిప్పులగతి గ్రాలుఁ నేత్రయుగ్మంబును
ధగధగ మనుగొప్పదంతములును
బాదపశాఖలవలె నొప్పు బాహువుల్
తరుమధ్యము లనంగ దగినకాళ్లు

ధూమకేతువులీలఁ దోఁచువాలంబును
బటుఖడ్గములఁబోలు వాడిగోళ్లు
తే. తనరి భయదాకృతిని దాల్చి యనిలసుతుఁడు
లలనరో నిన్నె కాక యీలంక నెల్లఁ
బెఱికి రాముని ముందఱఁ బెట్టగలను
రమ్మటంచన నిటుల నాకొమ్మ పలికె.

ఉ. ఎంతకునైనఁజాలుదు వహీనబలుండవు పావనీ! ధరా
కాంతుఁడు దైత్యుఁద్రుంచి ననుఁ గైకొనిపోవుట కీర్తి కాని నే
వంతలకోడి కన్మొఱఁగి వచ్చుట దుర్యశ మన్యపూరుషుఁ
డింతయు నంట నన్ను దనుజుం డతిబల్మినిఁ దెచ్చె నీడకున్.

క. అన సంతసిల్లి మారుతి
వనితరో నాకొక్కయానవాలిమ్ము వెసఁ
జని యతిశీఘ్రంబుగ రా
మునిలక్ష్మణుఁ దెత్తు సబలముగ నిట కనినన్. 111

వ. జానకి హర్షించి తన చూడామణి నొసంగి తండ్రీ! నాదుర వస్థలన్నియు శ్రీరామునకు విన్నవించి నే ననన్యగతికురాల నని తెల్పుము. లక్ష్మణకుమారునితో నేబుద్ధిహీననై పరుషోక్తులఁ దన్ను నొప్పించిన నాతప్పు మన్నింపుమనుము. రామలక్ష్మణ సుగ్రీవాదులఁ గపిసైన్యంబుతో నతిత్వరితగతి సముద్రంబు దాటించి యిటకుఁ దోడ్కొనిరమ్ము. కపివరా! నీవు నాప్రాణదాతవైతివి నీవురాకున్న నాగతి యేమగునో తడవు సహింపనోప, శీఘ్రంబుగ రాఘవుల రప్పింపుమని యేడ్వ మారుతి యానారీమణి నూరడించి సాష్టాంగనమస్కృతు లాచరించి వీడ్కొని యచ్చోటువాసి యేగి. 112

క. మించితి జలనిధి నిట కే
తెంచితి శ్రీరాఘవుని సతిఁ గాంచితి భా
షించితిఁ జోరునిగతిఁ గా
వించితి నిది ధీరవర్యవిధమే యరయన్. 113

వ. కావున మద్బలపరాక్రమంబు లించుక వెల్లడించి మఱియే గెద
నని తలంచి యమ్మారుతి యశోకవనంబునకుఁ గవిసి. 114

సీ. పెళపెళరవములు పృథ్వి నెల్లెడఁబర్వ
వృక్షశాఖలనెల్ల విఱచి విఱచి
వృక్షాగ్రముల నుండుపక్షులారావముల్
సేయుచు నల్దిశల్ చేరఁబార
ఫలములుడొల్లఁ బుష్పంబులు ధరవ్రాల
దరుల మొదలికంటఁ బెఱికి పెఱికి
కావలివా రడ్డఁగా వారినందఱఁ
జెట్టుకొమ్మలతోడఁ గొట్టికొట్టి
తే. వనము భంగం బొనర్చి యావాయుసుతుఁడు
వానరులఁగూడి రవివంశవరులు వచ్చు
చున్నవా రసురేశు పప్పుడకదింక
రావణునిద్రుంప తెగునంచు అంకె వేసె. 115

వ. అంత హతశేషులైనకావలివారలు పాఱి లంకేశుతోఁ దెల్ప
నాతండు కోపోద్దీపితుండై ప్రహస్తతనూజుండైన జంబు
మాలి నావానరాధముఁ గూల్చి రమ్మని పంప నాతఁడు వెడలి
వచ్చి. 116

మ. ధృతకోదండశరాయుధుం డగుచుమౌర్వీటంకృతుల్ పర్వను
ద్ధతినవ్వానరు నొవ్వనేయ నటనుద్యత్తోరణస్తంభసం

స్థితమైయున్న మహోజ్జ్వలత్పరిఘముఁ జేతన్వెసన్దాల్చి మా
రుతియా రాక్షసు నేలఁగూల్చి విజయోరుధ్వానముల్ సేసినన్.

వ. అంత హతశేషులు పాఱి రావణునకుఁ దెల్ప నాతండు కోప విస్మయకలితచిత్తుండై తన సేనానాయకపంచకంబుఁజీరి యా కోతిని. జంపిరండని పంప, వారలు ససైన్యులై వచ్చి. 118

చ. అనిలతనూజు మేనున మహాభయదాంబకవృష్టి రాల్ప నా
ఘనుఁడు నిజోగ్రవాలమునఁ గాండములన్నిటిఁ గూల్చి దై
త్యకో,టినిబరిఘాహతిఁ జదిపి డీకొని మంత్రులవృక్షశాఖలఁ
మొనకొని కొట్టిచంపెను నభోగతి దేవత లుబ్బియార్వఁగన్.

వ. అంతఁ జావుఁదప్పి పాఱినదోషాచరులు రావణుఁ జేరి మ్రొక్కి జరిగినవృత్తాంతంబుఁ దెల్ప నతండు భయవిభ్రమాశ్చర్యకోపరసంబులు ముఖంబులఁ బ్రసరింపఁ దనచిన్న కుమారుం డగునక్షకుమారుఁ జీరి యిట్లనియె. 120

తే. ఏకు మేకయ్యె నన్నట్టు లిప్పు డొక్క-
కోతి రాకాసిమూఁకలగొంగయయ్యెఁ
జుల్క సేయక దానిని క్షోణిఁగూల్ప
గట్టిపని సేయుమన్న నాఘనుఁడు కదలి. 121

వ. రథారూఢుండై యమ్మహారథుండు వివిధశస్త్రాస్త్రంబులఁ గొని సైన్యసమేతంబుగాఁ గదలి చని కపివీరు న్గాంచి తనకోదండ పాండిత్యంబుఁ జూపుచు నాతని నశనిసంకాశశరంబుల రక్తధారలుగార నేసిన నమ్మారుతి యించుక చలించి. 122

క: పిన్న యనుచు నీరక్కసు
నెన్నియు పేక్షింపఁగూడ దీతఁడు బలసం

పన్నత నసమానుం డం
చు న్నెటఁ బరికించి యనిలజుఁ డుదగ్రుండై. 123

మ. శరవర్షంబును వృక్షఖండములచేఁ జక్కాడుచుఁ డాసి భూ
ధరశృంగం బొకటిన్ బెకల్చి వయివన్ దైత్యేశు తేరట్టె యు
ర్వర వ్రాలంగ నతండు పైకెగసి దుర్వారాస్త్రజాలంబు
వానరుపై నేయఁ గపీంద్రుఁడున్ జనె వియన్మార్గంబు
లంఘించుచున్. 124

మ. చని బాణాహతు లోర్చుచున్ గదిసి రక్షస్సూనుపాదద్వ
యం,బును బామున్ గరుడుండు పట్టెడువిధంబు న్దోపఁగాఁ
బట్టి చ,య్యన ధాత్రితలి కీడ్చిమోది మెయివ్రయ్యన్ శల్య
ముల్ రాలఁ దా,డనమున్ జేసి వధించె దైత్యు నతి
తీండ్రంబైన కోపంబునన్. 125

వ. అంత దానవసేనలు బెదరి పారి లంకేశునితోఁ దెల్ప నాతఁడు
మూర్ఛిల్లి హాహాకారంబు లెసంగఁ బుత్రు న్దలంచి పరిపరి
విధంబుల శోకించి ప్రహస్తాదులు తెల్పఁ దేఁ యుదగ్ర
కోపంబున నింద్రజిత్తు న్జీర యిట్లనియె. 126

క. వనచరుఁడు కాఁడు రక్షో
హననం బొనరింపఁ బద్మజాసనుఁ డొనరిం
చిన భూరిభూతమై యుం
డునటులఁ గాకున్నఁ గపియిటుల విలసిలునే. 127

ఉ. వాలి దినేశపుత్రముఖ వానరవీరుల నేనెఱుంగుదున్
జాలరు వారలైన బలసంపద వీరికి నీతఁ డెవ్వఁడో
కోలలువ్రేయ మాని బహుఘోరతరాస్త్రముచేత నీతనిన్
వ్రాలఁగఁజేయు మేమఱకు వానరుఁ డీతఁ డటంచు బుత్ర కా.

వ. సురేంద్రుఁబట్టి బంధించిన నీ కీయగచరేంద్రుం డెంత
యైనఁ జిన్నపామునైనఁ బెద్దకఱ్ఱతోఁ గొట్టవలెనన్న లోకోక్తి
మఱువక యప్రమత్తుండవై శత్రుని మార్కొనుమని చెప్పి
పంప నాతండు బహుసైన్యయుతుండై యేగి తోరణస్తంభ
స్థితుండైన హనుమంతు ఁగాంచి కాలాగ్నిఁబోలు శరంబుల
నేసిన నాతండు చలింపక వర్షధారల నోర్చు నెనుబోతురీతి
శరమండలి కెదురునడచుచు విహరింపుచుండుటఁ గాంచి
విస్మితుండై వీఁడతిదుర్జయుం డనితలంచి బ్రహ్మాస్త్రంబు వింట
సంధించి వైచిన. 129

ఉ. స్ఫురదురువిస్ఫులింగములు భూవలయంబును గప్పనెండు భీ
కరరవయుక్తిఁ గీలికలు క్రాల బెడంగుఁబిడుంగురీతి నా
శరము మరుత్తనూజు తనుసంధులబంధనసేయ నాతఁ డి
ద్ధరణిఁ విసంజ్ఞుఁడైపడియె దద్దయుఁ బెద్దయెలుంగు సేయుచున్.

వ. ఇట్లు పడ రక్కసులు పెక్కండ్రువచ్చి గ్రక్కున హను
మంతు దృఢతరపాశబద్ధుఁ జేసి కాలుచేతు లాడుటకు వీలు
లేకుండఁ జేయ నాంజనేయుం డంతలో బ్రహ్మాస్త్రబంధ
విముక్తుండై కన్నులు తెఱచి చూచి తన్ను దైత్యు లీడ్చి
కొని పోవుచుండుటఁగాంచి యేమిజరుగునో చూచెదఁగాక
యని యూరకుండె నంత దానవులు తర్జనభర్జనంబులు
సేయుచు నాతనిఁ గొంపోయి దశముఖు నెదుటఁబెట్టిన. 131

ఉ. ఎవ్వఁడ వీవురా యిటకు నేటికివచ్చితి చేసి తేల నీ
వవ్వనభంగ మాసురచయంబుల నేల వధించినాఁడ వీ
వెవ్వనివాఁడ వెల్లగతు లేర్పడ సత్యముగా వచింపుమం
చవ్విభుమంత్రివర్యుఁ డనిలాత్మజుతో ననె నాతఁ డిట్లనెన్.

చ. ఇనజునిమంత్రి మారుతి నిలేశుని రాముని బంట జానకిఁ
గన నిటవచ్చినాఁడ నినుఁ గాంచ నుపాయ మటంచు నవ్వనం
బును బడఁగూల్చినాఁడ నరభుక్కు లెదుర్ప వధించినాఁడ నే
మనవి యొనర్చెదన్ వినుము మండితవిక్రమధుర్య రావణా.

ఉ. ఏమనుకొంటివో రఘుకులేశుఁడు రాముఁ డలంతి యాపరం
ధాముఁడు దైత్యసంచయవధంబున కీవసుధన్ జనించె నీ
వామహనీయు కాంత నిట కగ్గి నొడి న్గొని తెచ్చినట్లు
రక్షోమథనప్రమాదమును జూడక తెచ్చితి హానియౌఁ
జుమీ. 134

ఉ. కావున జానకీసతిని క్ష్మావరుఁ జేరిచి యామహాత్మునిన్
గావుమటంచుఁ బాదయుగకంజములన్ దగనాశ్రయించినన్
నీవును నీజనంబులును నెమ్మి సుఖంబునఁ జావకుండు రా
త్రోవను బోవకున్న ననిఁద్రుంగుట తథ్యము మీరలందఱున్.

క. అనవిని కోపజ్వాలలు
ఘనముగ ముఖములను బర్వఁ గన్నుల నిప్పుల్
మొనకొని రాలఁగ మంత్రులఁ
గని వీనిన్ జంపుఁడనినఁ గడువడి దనుజుల్. 136

వ. ఖడ్గంబులు దాల్ప విభీషణుం డడ్డువడి యన్నా వీఁ డవ
ధ్యుండు. దూతకృత్యంబునకై వచ్చెఁ గాన వీనిఁ జంపరా
దైనను వీని కేదైన శిక్షవిధించుట న్యాయంబు. వానరులకు
వాలంబు ప్రియంబగుట వీనితోకఁ గాల్చిపుచ్చుట యుక్తం
బని పల్క రావణుండు మారుతి యవక్రవిక్రమంబుఁ
దలంచి వీనిఁ జంపుటయు దుస్సాధ్యంబని తమ్ముని వాక్యం
బుల కియ్యకొనియె నంత. 137

ఉ. దానవు లందఱుం గడుముదంబున గుడ్డలఁ దెచ్చి నూనెలో
నానిచి బద్ధుఁడౌ ననిలనందనుతోకకుఁ జుట్టికాల్చి ఘో
రానలకీల లుప్పతిల నాసుర లుగ్రరవంబు సేయుచున్
వానరుఁబట్టి మోసికొని పట్టణమంతయుఁ ద్రిప్పువేడుకన్.

మ. తనుగొంపోవుచునుండ భీతునిగతిన్ దైత్యార్భకశ్రేణులున్
వనితల్ దిట్టుచు నార్పుచున్న గుచుఁ బట్నంబెల్ల గగ్గోలు చే
సిన యీకోతినిఁ జూడరం డనుచుఁ దన్ జిత్రంబుగాఁ గాంచ
రాఁ, గనుచున్ మారుతి కొంతదూర మటు వేడ్కన్ బోయి
యంతన్వెసన్. 139

వ. సూక్ష్మగాత్రుండై బంధంబులనెల్ల వదల్చికొని యావలికి దాఁటి యటఁ దోరణస్తంభంబునఁ గ్రాలు పరిఘుఁగైకొని తన చుట్టునున్న దానవులఁ గొట్టి చంపి తనవాలానలంబున లంకానగరంబుఁ గాల్ప నిశ్చయించుకొని. 140

శా. ఇంటింట న్దనవాలము న్దిగిచి యం దేపారురాకాసులన్
మంటన్ ద్రోయుచుఁ జూరులందనలమున్ సంధించి మండించు
చే,వెంటన్ బాఱినఁ బాఱినీక రిపులన్ వేఁబట్టి ఘోరానలం
బంటన్ గూల్చుచుఁ ద్రిమ్మరెన్ మదగజం బట్లాతఁ
డత్యుగ్రుఁడై. 141

క. కాలానలమో యనఁ గపి
వాలానలముగ్ర మగుచుఁ బ్రతిగేహము ను
లగతిఁ గాల్పఁజొచ్చెను
జాలింబడి యసురవీరసంఘము తొలఁగన్. 142

ఉ. సూనుని సాయమై నిలువఁ జొప్పడెఁ దండ్రియు నామహోగ్ర
జం,ఝూనిల మానిశాచరుని సౌధము లెల్ల దహించునట్లువా

లానలకీలలన్ బురము నంతట వ్యాపక మొందఁజేసె నే
దానవు లామరుత్తనయు ధాటికి నిల్వఁగఁజాలరై రటన్. 143

స్రగ్ధర.
భూరిప్రోద్యద్ధవాగ్ని
స్ఫుటశిఖలు వెసన్ భూనభోభాగమెల్లన్
బాఱన్ లంకాపురాంత
ర్వృతిగృహ మనలజ్వాలికామాలలందున్,
ఘోరంబై ప్రగ్గ రక్షః
కులజు లెచటికిన్ గూడిపోలేనివారై
తోరంపా భీతిచే బం
ధుగులఁ బిలచుచున్ దూలి రయ్యగ్నికీలన్. 144

వ. ఈరీతి మారుతి జగద్విదారణప్రచారం డగు ప్రళయకాల రుద్రునిలీల దారుణవిహారుండై యప్పురంబు నడల సర్వ మందిరమండపగోపుర సౌధధ్వజాంగణతోరణరథకరితురంగ శాలాజాలంబులనెల్ల దహింపఁ గడంగ ఛటచ్ఛటస్ఫుట రవంబులతో విస్ఫులింగంబులు దివంబుముట్ట నొక్కయింటి మంట పెక్కిండ్ల కంటికొని వాయుసహాయంబున బహు విజృంభించి దశదిశలఁ బ్రసరింపఁ బురజనంబులు హాహా రవంబులు సేయుచు నేదిక్కునకుఁ బాఱిన నాదిక్కు ననే మిక్కుటంబై యుండు నగ్నికీలలలోఁ జిక్కికొని సమయు వారును జిక్కువడక యేసందుననో పాఱుచు మారుతి చేతఁబడి యగ్నికింధనంబులగువారును, భీమంబుగా ధామం బుల నగ్పినధూమంబునఁ గన్నులఁ దెలువనేరక పతిసుతహిత వర్గంబులకై యటునిటుఁ బాఱి శిఖిశిఖాపరంపరలఁ దగు

ల్కొని ప్రగ్గుకాంతలును, గాంతల వెదకుచు నల్దెస
లకును బాఱి చీరిచీరి మూర్రాగ్గిఁ దప్పఁ లేక దగ్ధమగు
పురుషులును దలిదండ్రుల వెదకుచుఁ జిచ్చంటికొని మలమల
మాడి చచ్చుబాలురును, నమ్మా బాబా యని యేడ్చుచు
నగ్గి దగుల్కొని మిడతలవలె గిలగిల కొట్టికొని ప్రగ్గుశిశు
వులును, జ్వాలావృతులైన బంధుగుల రక్షింపఁబోయి
క్షయించువారును, పాఱిపాఱి జలధిలో డాగువారును,
డాగియుండఁ బురంబునఁగల ప్రాసాదశిఖరంబులు కాలి
పెటేలు పెటేలున బ్రద్దలై పిడుగులగతి నల్దెసల కెగసి
జలధిలోఁబడ వానితాకునఁ జచ్చువారును, మింటిపొడవున
వెల్గుజ్వాలాజాలంబులఁ దగుల్కొని కాలి కూలువిమా
నంబులును, నిలువున మంటలంటికొని పెళపెళారావము
లతోఁ గూలువృక్షంబులును, వృక్షాగ్రంబుల నిల్వ లేక
యెంతద వ్వెగిరినను వహ్నిజ్వాలల వేండ్రంబుతగ్గక గిరిగిరఁ
దిరిగి చచ్చి నేలవ్రాలుపక్షులును, దమశాలలనుండి వెల్వడ
లేక యార్చియార్చి యందెమ్రందు పశుగణంబులును, బిచ్చి
యెత్తినట్లు గంతులువేసివేసి యెచ్చటనో చిచ్చులోఁబడి
చచ్చుకరితురంగనికరంబులును, గలిగి దవానలంబు వనంబు
దహించులీలఁ గరువలికొడుకు వాలానలంబు కాలానలంబై
పురంబునెల్లఁ గాల్పఁ బ్రహస్తాదిమంత్రులతోఁగూడి దాన
వేశ్వరుండు దుర్వారబలుండగు నవ్వానరవీరుని దారుణ
ప్రచారంబునకుఁ దల్లడిల్లుచు వెఱఁగుపడి తొలంగిచూడ,
సీతకై వచ్చిన యొక్కకోతియే యింతపనిచేసె నింకఁ బెక్కు
కోఁతులతోవచ్చి రాముం డెంతసేయునో యని పురవాసు

లెల్లరు బెగడ లంకానగరంబు దుఃఖసాగరంబున మునింగి యుండె నంత. 145

క. దనుజసతులు తెల్పఁగ నా
యనిలతనయుతోఁకఁ గాల్చినట్టివిషయముఁ
విని జానకి మారుతి క
య్యనలుఁడు చల్లనగుఁగాక యని ప్రార్థించెన్. 146

గీ. తనదువాలంబు సుంతయుఁ దగులువడక
చల్లనై యుంట గని రామచంద్రుకృపయొ
జానకీదేవి మహిమాతిశయమొ యంచు
నలరె హనుమంతుఁ డెంతయు నాత్మ యందు. 147

వ. ఇట్లమ్మారుతపుత్రుండు పురంబుదహించి సీతకడ కేతెంచి నమస్కరించి, జరిగినసర్వవృత్తాంతంబు నివేదించి వీడ్కొని లంకానగరప్రాకారంబు దాటి సముద్రంబుఁజేరి తజ్జలంబులఁ దనవాలానలం బార్చికొని సువేలాద్రి కెగిరి యందుండి వియత్పథంబున మహోదధి న్దాటుచుండఁ దనరాకఁ గని యెదురువచ్చిన యంగదాదివానరులఁ గూడి మహేంద్రగిరిఁ జేరి సర్వవృత్తాంతంబుఁ దెల్ప నెల్లరు హర్షాబ్ధినోలలాడి సింహనాదంబులు సేయుచుఁ గిష్కింధానగరంబుఁ జేరి రంత. 148

క. తమ్ముఁడు సుగ్రీవుఁడు హ
ర్షమ్మునఁ దనుఁజేరి కొలువఁ గ్రాలెడురాముఁ
నెమ్మిగని మారుతి సీ
తమ్మను గనుగొంటినని పదమ్ములఁ వ్రాలెన్. 149

వ. వ్రాలి లేచి భక్తివినయనయభయంబుల శ్రీరామునకు యావద్వృత్తాంతంబుఁ దెల్పి, సీతయిచ్చిన చూడామణి నొసంగిన నమ్మహాత్ముండు పరమానందభరితుండై మారుతి న్గాంచి నీవొనర్చిన మహోపకారంబునకుఁ బ్రత్యుపకారంబు లేమి నాపరిరంభణంబును గైకొనుమని యతనిఁ గ్రుచ్చి కౌఁగిలించికొనియె నంత. 150

మాలిని.

దురితచయవిదారీ దుష్టదైత్యాపహారీ
ఖరకరకులదీపా కామినీసూనచాపా
వరముని జనపక్షా వారిజాతాయతాక్షా
పరమగుణవిలాసా భద్రశైలాధివాసా. 151

గద్య. ఇది మంత్రికులోద్ధార రామయ కుమార భద్రాచలవాస తూము సీతారామదాస ప్రణీతంబయిన సీతారామ రామాయణ కావ్యంబునందు సుందరకాండసంగ్రహ మేకాశ్వాసము.

శ్రీ ర స్తు.

# సీ తా రా మ రా మా య ణ ము

## యు ద్ధ కా ం డ ము.

క. గోపన భయదాపద్ధర
తాపత్రయదుస్తమో విదళనదినకరా
భూపుత్త్రీ హృదయేశ్వర
పాపక్షయ భద్రశైలవాసశుభకరా. 1

వ. అవ్వాలికథ నాలకింపుము శ్రీరాముం డట్లు సీతావృత్తాం
తంబు విని లంకపై కేగుట కింక వార్ధిదాఁటు టెట్లని శంకింప
సుగ్రీవుండు రామునితో నిట్లనియె. 2

క. వనచరసేనలలోఁ డన్
జనుదము జలరాశికడకు జలధీశుని బ్రా
ర్థనఁ జేసి వరముఁబడయుము
జనవర! యటుగాకయున్న సః

క. తరుచరదళములు మనకున్
బరిగణనకుమించి కలవు వారలచేతన్
శరధికి సేతువుఁ గట్టిం
చి రయమునన్ జలధిదాటి చేరుదమటకున్ 4

వ. అన శ్రీరామలక్ష్మణులు హర్షించిరి. సుగ్రీవుం డంత వానర
దళంబులకు నడువ నాజ్ఞ నొసంగ వారలు సమధిగతో

త్సాహసాగరులై సాగరంబుఁజేరఁ గదలి చనుచుఁ దమ
జాతిలక్షణంబులఁ బోనీక యొకనిభుజంబులపై నొకండు,
వానిపై వేఱొకండు, వానిపై నింకొకం డిట్లు తాళప్రమా
ణంబుల నొక్కనిమీఁదఁ బెక్కం డెక్కి క్రిందవాఁడు
మేనుఝళిపింపఁ బైవాండ్రు క్రిందఁగూలుచు, శాఖిశాఖా
గ్రంబు లెక్కి దుముకుచు, భూమిపై నడచుట మాని
యొకవృక్షంబునుండి మఱియొకవృక్షంబునకు గంతుచు,
నెడనెడ నొకవానరునితల కెగిఱి యందుండి మఱియొకని
తల కీక్రియఁ దలలమీఁద దుమికిపోవుచు, వృక్షాగ్రంబు
లకుఁ బ్రాకి పండ్లుకోసి క్రిందనడచువారలపై విసరివైచుచు,
నడచుట మాని మింటి కంటిపోవుచు, ముందుఁబోవువాని
తోఁకఁబట్టి వెనుకకులాగుచు, ని ట్లనేకవికారచేష్టితంబులు
సూపుచుఁ బోవుట గాంచి రామలక్ష్మణులు వినోదింపుచుండ
వానరులు నడచుచుండి రంత. 5

క. మారుతి శ్రీరామునకుఁ
దారాతనయుండు లక్ష్మణకుమారునకుఁ
ధీరత వాహనములుగాఁ
జేరి నడువసాగి రబ్ధిచెంతకుఁ బ్రీతిన్. 6

ఉ. డెబ్బది రెండువెల్వల కడిందివనాటచమూసమూహముల్
నిబ్బర మొప్పఁగా నడువ నిష్ఠురపాదవిఘట్టనంబులఁ
గొబ్బున భూరజం బెగసి కూడి నభోతలభాగమందుఁ బెం
మబ్బునుబోలి క్రమ్మి రవిమండలకాంతిని గప్పె నెంతయున్.

మ. మఱిఁ గిష్కింధ మొదల్ మహాబ్ధివఱకుఁ క్ష్మారంగమందుం
డు భూధరవృక్షావళులెల్ల వానరుల పాదన్యాససంఘట్టన

స్ఫురణఁ జూర్ణములై పడఁ జనము సంక్షోభింప నాధాత్రి
వి,స్తరమౌ నొక్కయెడారి యయ్యె మహితాశ్చర్య
క్రమం బొప్పఁగన్. 8

వ. ఇట్లు సేనాసమేతులై రామలక్ష్మణసుగ్రీవులు నీరధితీరంబుఁ
జేరి తత్తరణోపాయంబుఁ జింతించుచుండి రంత నక్కడ
లంకయందు రావణుండు వనచరసమేతులై రాఘవులు
పారావారతీరంబుఁ జేరి రని చారులవలన నెఱింగి మంత్రు
లతో నిట్లు మంత్రాలోచనంబు సేయందొడంగె. 9

తే. మంత్రివరులార మీరలు మాకు హితులు
మనుజు లిరువురు కోఁతుల మందతోడఁ
గడలికడ నున్నవారఁట జడధి నెట్లు
దాటుదురు దాటి మనధాటిఁ దప్పగలరె. 10

ఉ. కావున నిప్పుడే యరినికాయము మార్కొని కూల్ప
నొప్పునో, యావిపులాబ్ధి దాటఁగఁ బ్రయత్నము లేమి
యొనర్తురో కనఁ, ధీవరులైనవేగుల విధించినఁ జాలునో
తెల్పుఁడన్న నా,దేవవిరోధిమంత్రు లతిధీరతరోక్తులఁ
బల్కిరిగతిన్. 11

క. సురనాథునిఁ జెఱఁబెట్టిన
గురుభుజసత్త్వునకు నరులఁ గోఁతుల ననిలోఁ
బరిమార్చు టెంత నీవాక
పరిఁ గను దెఱచినధరిత్రి వ్రాలరె వారల్.

తే. గోటఁ జిమ్మెడుదానిని క్షోణిఁ గూల్ప
గొడ్డలిని దెచ్చి దానితోఁ గొట్టనేల

నిందలాడు మేము నీచెంత నెసఁగుచుండ
నిట్టి స్వల్పంబు నీదాక నేలవచ్చు.

సీ. ఈమాత్రమున కింత యేల మాలో నెవ్వఁ
డైన నొక్కఁడె చాలు ననె నొకండు
నరుల వానరులను బొరిగొన మన మేగు
టన నాకు సిగ్గగు ననె నొకండు
మున్నొతివచ్చినప్పుడు నేను లేనైతి
నడఁప నేనే యున్న ననె నొకండు
శరధిదాటఁగ వాండ్ర శక్యమే దాటి వ
చ్చినఁ జచ్చుటయెకాదె యనె నొకండు

తే. సెల వొసంగుము శత్రులఁ జెండివైతు
నిప్పుడే యని ఖడ్గంబుఁ ద్రిప్పె నొకఁడు
నిటుల దానవకులవీరు లెసఁగి పలుకు
భీషణోక్తుల వించు విభీషణుండు.

క. మనపౌరుషోక్తులకు పో
యెనె శత్రువు వేడినీళ్ల కిలుకాలునె యొ
క్కనిచేఁ బెక్కుఁడుదానవు
లనిఁ ద్రెళ్లిననాఁడు మీర లందఱు లేరో.

ఉ. దానవభర్తతోఁడుతఁ బ్రధానులు మీరలు కైతవోక్తులన్
మానక పల్కవచ్చునె యమానుషవిక్రములైనశత్రులన్
మీనుడి నమ్మి పైకొనఁగ మించుటఁజూడఁగఁ గుక్కతోకతోఁ
బూనికఁ నేఱుదాటఁ జనఁబోవునటుల్ దుది మోసమౌఁజుడీ.

శా. అన్నా! నాదగువిన్నపంబు వినుమా యర్కాన్వయుల్
దైత్యరాశి న్నిర్ఘూలము సేయఁజాలినబలస్థేముల్ నిశాటా

న్వయంబు న్నిండారెడు కూర్మిఁ బ్రోవుము మహాత్ముఁ
రాము సేవించి సంధిన్నే ర్పారఁగఁ జేయుమా జనకపుత్రిఁ
గ్రమ్మఱి న్బంపుమా. 17

ఉ. రాముఁడు దుష్టరాక్షసవిరాముఁడు మర్త్యుఁడు కాఁడు
దేవతా,స్తోమమువేడ శ్రీహరి వసుంధరఁ బుట్టెను మాన
వాకృతిఁ, భూమిజ లక్ష్మి లక్ష్మణుఁడు భోగివిభుం డగు శేషుఁ
డుజ్జ్వలో, ద్దామబలాధికుల్ కపులు ధాత్రి జనించిరి దేవ
తాంశలన్.

క. ఈవివరంబు న్నారదు
చే వింటి న్మున్నుఁ గానఁ జెడఁదలఁపక య
న్నా ! వినుము నాదుయోజన
మావిష్ణునితో విరోధ మది మన కేలా.

క. వినమే హిరణ్యకశిపా
ద్యనిమిషకులవైరు లెల్ల నావిష్ణునిచే
ననిఁగూలుట సౌఖ్యస్థితి
మనుచు నురకఁ జావనేల మన కసురేశా.

క. ఆరామునకు న్నీకి
ద్ధారుణి నెంతైనఁ దారతమ్యముఁ గననో
సారమతి వీవెఱుంగని
కారణకార్యములు పరులు కాంచన్గలరే.

సీ. నీకు సాధ్యముకాని నిష్ఠురశివచాప
మవలీలఁ దానెత్తి యక్కు విఱిచె
నిను జయించిన యర్జునునిఁ ద్రుంచినట్టి యా
భృగురాము దోర్గర్వవిభవ మడఁచె

ఖరదూషణాదిదుస్తరనిశాచరకోటి
నొంటిగాఁ బోరాడి యుక్కడంచె
నిను సప్తజలరాసులను ముంచితేల్చిన
వాలి నొక్కమ్మునఁ గూలనేసె
తే. జాలవాయివి రామునిసత్వ మెఱుఁగ
నన్నమంతయుఁ జేతితోఁ నంటవలెనె
యొక్కమెతు కంటఁ దెలియదా యొప్పిదంబుఁ
దెలిసి రామునిచే నేలఁ బొలియ మనకు.
క. మునుగార్తవీర్యు కోడి య
తనితోఁ దగ సంధిఁజేసి తనరిన నీకుఁ
ఘనతరజగదవనుం డగు
వనజాక్షుఁడు స్నేహమునకుఁ బాత్రుఁడుకాఁడే.
వ. అనవిని రాక్షసేశ్వరుండు భీషణేక్షణంబుల విభీషణు నిరీ
క్షించి యిట్లనియె. 24
మ. ప్రతికూలోక్తుల నేల పల్కెదలనాపద్భ్రాతుఁడు న్గంభుఁడుఁ
క్షితిరాముండును లక్ష్మణుండయినఁ గానీ దేవతల్ వానర
ప్రతతుల్గా నిటఁజేరనీ బెదరిపోవఁ సంధి నర్థింప న
య్యతివన్బుచ్చను జంపెదఁ రిపుల లేక న్వారిచేఁ జచ్చెదన్.
తే. పగలు లాగినరాని యప్పడతి రేయిఁ
జీకఁటిని గనుసన్న చేఁ జిక్కఁగలదె
యమరులై నాకు నోడిన యట్టిసురలు
నరులు వానరులై గెల్వఁదరమె నన్ను. 26
క. శ్రీరంగనీతు లెన్నో
వారకపల్కెదవు శూరవరులు వినంగాఁ

జేరరు నీదుర్భాషల
వైరుల వినుతించు నీవు వైరివె యరయన్.
తే. ఏమిపుట్టిమునింగె నం చెదఁగలంగి
యేరి కోరి గ్రహించినయింతి మరల
నిచ్చి కోఁతులగుంపుతో వచ్చు నడవి
మానిసికిఁ జేయిమోడ్చు కర్మంబు నాకు.

వ. అని రావణుండుపల్కె నాదినంబు కుంభకర్ణుని జాగరదినం బగుట నాతండు సభాంతరంబుననుండి యన్న కుఁగాని తమ్మునకుఁగాని యేమియుఁ జెప్పనేరకయుండె నంత రావణుం డాదినంబునఁ గొలువుసాలించి నిజసౌధంబున కేగె నా మఱునాఁ డాతండు నిండుకొలువుండుతఱి విభీషణుండు మరలఁ బ్రసంగంబు దిగిచి రావణునితో నిట్లనియె. 29

సీ. నేఁజెప్పు నుడులకు నీకుఁ గోపమువచ్చు
నని యూరకుండ నామనమురాదు
సంధికిఁదేతఱి బంధులందఱుఁగూలు
నావల నేమి సేయంగఁగలము
బహుజయశీలివై పరగుచుండెడి నీకు
నాపదగల్గునం చాత్మ వగతు
నాచుప్పనాక దురాగత మీరీతి
నసురనాశనహేతు వగుటతగవె
తే. కాన నామనవిని విని కరుణతోడ
దైత్యకులముఁ గాపాడఁ దలఁచుమన్న
యొల్లనను సీతపై నింత యుల్లమేల
కలవె నీకందగత్తె లీక్ష్మాతలమున.

వ. అనిపల్క దశముఖుండు వికటభ్రుకుటీముఖుండు రోష తామ్రాక్షుండునై విభీషణు నెంచి వీఁడు మిత్రరూపంబున ద్రోహం బూహించు ఘోరతరశత్రుండు వీనితో నెయ్యంబు పాముతోఁ జెలిమి కంటినలుసువంటి వీని గెంటి వేసినఁగాని మనకు నిష్కంటకస్థితి కలుగదని ఘనతరగదా ఘాతంబుఁబోలిన పదాహతి నన్న నవ్విభీషణుండు తనగద్దె నుండి విసంజ్ఞుండైపడి కొంతవడికిఁ దెప్పిరిల్లి లేచి నే నిదె పోయెదనని యిట్లనియె. 31

క. నామాటల యాథార్థ్యం
బామనుజున కీవుయుద్ధమం దోడినయ
ప్డేమఱక కాంచె దిప్పుడు
నీమదిలో నాటఁగలుగు నే యని కదలెన్. 32

వ. ఇట్లు కదలి తననలువురు మంత్రులతోఁగూడి రావణసభాంత రంబుదాటి తనతల్లియైన కైకశిచెంత కేగి సాష్టాంగనమ స్కృతు లాచరించి తన్ను రావణుండు పరిభవించిన తెఱం గెఱింగించి తా శ్రీరాము నాశ్రయింపఁబోయెద నని తెల్ప నామె రావణుని దోషప్రచారంబునకు విచారించి విభీష ణుని రామునికటాక్షంబున వర్ధిల్లుమని దీవించె నంత. 33

క. తనమంత్రి చతుష్కముతో
దనుజేశునితమ్ముఁ డబ్ధిదాఁట గగనమం
దునవచ్చుచుండఁ గని కపు
లనివారలఁ దాకసిద్ధులై యుండంగన్. 34

వ. పేరెలుంగున విభీషణుం డిట్లనియె. 35

చ. వనచరులార! నేదనుజవల్లభు సోదరుఁడన్ విభీషణుం
డనియెడువాఁడ రామవిభు నంఘ్రులఁ గొల్వఁగ వచ్చినాఁడ నీ
తను వెసఁబుచ్చి రాముని పదంబులఁ బట్టుమటంచుఁ బల్కె నా
దనుజుఁడు నన్ను నిల్వెడలఁదన్న నరేశుని గొల్వవచ్చితిన్.

క. శ్రీరామునితో నావిధ
మారన్ దెల్పుం డటంచు నసురుఁడు వేడన్
వారలు సని తెల్పఁగఁ రఘు
వీరుఁడు తెమ్మన్న నతని వెసఁదెచ్చునెడన్. 37

మ. రవిజుఁడు లక్ష్మణుం డనిరి రాఘవ! రావణతమ్ముఁ డీతనిన్
ధ్రువముగ నమ్మరాదు బహుదుర్లభమాయలు పన్ను
చుంద్రు దైత్యవరులు కాన వీనిని మహాత్మ! గ్రహించుట
పాడికాదనన్, జనవరుతో మరుత్సుతుఁడు సంశయలీల
వచించె నీగతిన్. 38

శా. ఈతం డించుక యోగ్యుఁడంచు మదిలో నేనెంచెదన్
బద్మసంజాతాస్త్రంబునఁ జిక్కినట్టి నను రక్షస్స్వామి రోషించి
యెంతో తార్కాణముచేసి చంపెడువిధం బూహింప
వీఁడ త్తఱిన్, దూతం జంపఁగ రా దటంచుఁ బలికెన్ దోషా
చరాధీశుతోన్. 39

క. అనవిని రవికులతిలకుఁడు
తనయెదుటకు వచ్చినట్టి దైత్యానుజుఁ డో
య్యన బాదవనజముల వ్రా
లినఁ గన్గొని నీవిధముఁ దెలియఁ బల్కుమనన్.

సీ. రాజేంద్రచంద్ర నే రావణుతమ్ముఁడ
వచ్చితి నీకృపఁబడయ నెంచి

రావణుతో విష్ణు వీవని తెల్పుచుఁ
బడఁతిని నీకిచ్చి బ్రతుకుమంటి
సీతను దెచ్చుట పాతకంబే కాక
రక్షోవినాశ కారణ మటంటి
నరిమైనఁగాని తన్ శరణుఁగోరినవాని
నేలెడుకరుణాబ్ధి వీవటంటి
తే. నిట్టి నామాటలకు దనుజేశ్వరుండు
ఘోరతరకోపవర్తియై కూలఁదన్ని
నిండుకొలువుననుండి నన్వెడలఁద్రొబ్బఁ
భాగ్యముల తేఁడ నిన్గనవచ్చినాఁడ. 41

చ. శరణు భవత్పదంబులకు సారసలోచన నీవు తప్ప నన్
గరుణను బ్రోచు రక్షకుఁడు క్ష్మాతలి నెయ్యెడ లేఁడు సర్వ
మున్, దొఱఁగి త్వదాశ్రయంబునకుఁ దోఁపుభక్తిని వచ్చి
నాఁడ సాదరమునఁ జూడుమయ్య నను దాశరథీ నిజభక్త
సేవధీ. 42

వ. అని ప్రార్థింప శ్రీరామచంద్రుండు కృపాసాంద్రుండు
కావున విభీషణున కభయం బొసంగి రావణుఁ ద్రుంచి నీకు
లంకాధిపత్యం బొసంగెద నని తెల్పి తత్క్షణం బాతనికి
సముద్రజలంబులలో రాజ్యంబు ధారవోసె నంత. 43

క. ఆవిధము న్గని రవిజుఁడు
నీవిపుడే లంక నితని కిచ్చితికద యా
రావణుఁడు శరణు వేడిన
భూవర! యేమిచ్చెదన విభుం డిటుపల్కెన్. 44

క. వాని కయోధ్య నొసఁగి నే
మానీంద్రులపాదసేవ మఱగి తిరిగి వి
జ్ఞానము నార్జించెదనో
భానుజ! శరణాగతులను వదలను సుమ్మా. 45

వ. అనిపల్కి దశముఖుబలవీర్యతేజోవిశేషంబులను వానిపుత్ర మిత్రమంత్రి సేనానాయకచమూసమూహంబుల సామర్థ్యంబుల నింక వినఁదగిన యావద్వృత్తాంతంబుల విభీషణు నడిగి తెలిసికొని జలధిదాటువలను దెలుపు మన నాతండు దేవర వారును సుగ్రీవాదులును యోజించినవిధంబున సముద్రుని బ్రార్థించి వరంబుఁ బొందుట కార్యసాధకం బని పల్కుచుండ నంతలో. 46

క. వానరసేనల నరయఁగ
భానుజుతో దశముఖుండు పంపినవార్తన్
మానక తెల్ప శుకుం డను
దానవుఁడు శుకస్వరూపధరుఁడై వచ్చెన్. 47

తే. వచ్చి కపిసేన నరయుచు నచ్చటచటఁ
దిరుగుచుండ విభీషణుం డెఱిఁగి కపుల
కసురుఁ జూపింప వార లయ్యతనిఁగొట్టఁ
బారి దైత్యుండు భీతి భూవరునిఁజేరి. 48

చ. కలుషవిరామరామ! దశకంఠునిపంపున వచ్చిచూడఁగా
నిలచిన నన్ను వానరులు నిష్ఠురబాధలఁబెట్టుచున్నవా
రలు కృపఁ గావవే యనఁగ రాముఁడు సత్కరుణాభిరాముఁ
డై, వలదని మాన్పి నీవిటకు వచ్చినకార్యముఁ జూచికొ
మ్మనెన్. 49

వ. అంత నారాక్షసుండు సుగ్రీవు జూచి సీతో రావణుండు సెప్పు మనిన మాటలను వినుమని యిట్లనియె. 50

ఉ. నేనును నీవు రాజులము స్నేహముతో మన నొప్పఁగాని యి, మ్మానవుఁగూడియుండు టవమానము కాదె యకారణంబుగా, దానవభర్తతోడ విమతత్వముఁ బూనఁగ నేల తమ్మునిం, గా నినుఁ గందు సేనఁగొని క్రమ్మఱఁబొమ్ము పురంబుఁజేరఁగన్. 51

వ. అనవిని సుగ్రీవుం డిట్లనియె. 52

తే. పరసతినిగోరి మాయన్న వ్రాలినట్లు
నీవు సీతనిమిత్తమై దేవదేవుఁ
డైనరామునిచే జచ్చు టది నిజంబు
భూమి ని న్గాల్పకుండ నేఁబోవ నునుము. 53

వ. అని తెల్ప శుకుండు రామసుగ్రీవుల వీడ్కొని చనియె నంత.

చ. రవిజుఁడు నవ్విభీషణుఁడు రంజిలి చెప్పినరీతి నారఘు
ప్రవరుఁడు లక్ష్మణుఁ దనదురక్షణకై దరినిల్పి వానరుల్
సవినయమొప్పఁజేరఁ దృణశయ్యఁబఱుండి నదీవిభు న్గదుఁ
బ్రవిమలదీక్షఁ దాలిచి యుపాసనఁజేసె దినత్రయంబునున్. 55

వ. అట్లు దినత్రయంబుఁ బ్రార్థించినను దటినీవల్లభుండు కల్లోలంబుగా నుప్పొంగుచుఁ బ్రసన్నుండుకాకున్న రామచంద్రుండు లేచి ప్రళయకాలరుద్రునిభంగిఁ బ్రచండ క్రోధంబునఁ గోదండంబుఁదాల్చి కన్గవల నగ్నిజ్వాల లెసంగ బాడబాస్త్రంబులు దొడంగి సముద్రంబున కుపద్రవంబుఁ గలుగఁజేసి నాశరాగ్ని నింకించెదఁ జూడుఁడని శరధి నంతయు శరాగ్నిజ్వాలలచే గప్ప సకలలోకంబులు కలంగెఁ

గపులెల్లరు రామునిముఖంబు దుర్నిరీక్ష్యంబై కోపాగ్ని
జ్వాల లుమియుటకు నుల్లంబులఁ దల్లడిల్లి రారఘువల్లభుం
డంతఁ బోక బ్రహ్మాస్త్రంబు సంధించుటయు సాగరుండు
భయంబున గడగడ వడఁకుచుఁ దనపడతులతోఁ గడలి
నుండి వెడలివచ్చి శ్రీరామునకు సాష్టాంగంబు లాచరించి
యమూల్యమణిసమూహంబుఁ గానుకగా నిచ్చి నిటల ఘటి
తాంజలుఁడై యిట్లు ప్రార్థించె. 56

సుగంధివృత్తము:—

అంబుజాక్ష! జీవసంచయంబు వృద్ధినొంద మూ
లంబు నేనటంచు ముక్క జలంబు సృష్టిఁజేసి కో
పంబుతోడ నన్ను నిప్డు బాధపెట్ట నౌనె నన్
నెమ్మిఁ జూడుమయ్య నీకు నే సతంబు భృత్యుఁడన్. 57

ఉ. కావఁగదయ్య నన్నుఁ గృపక్ష్మావర! నేశరణార్థి నీకు నే
దేవ! మహానుభావ! జగతి న్సృజియింపఁగఁ బెంప ద్రుంపఁగా
నీవకదా భవద్విధుల నెట్టి చరింపఁగ నెంతవాఁడ సీ
తావర! నీవు పాతినలత న్మఱి నీవె నశింపఁజేసెదే.

క. జడమతిని గాన నాకుక
జడధి యనెడు పేరువచ్చె జడులను బ్రాల్పక
దొడరనగునె మఱి నే నీ
పడక న్గదబ్రాల్చి యెందుఁ బవళించెదయా.

క. అల్లుఁడు వచ్చె నటంచుక
బెల్లుగ నేఁ బొంగిపడితి విమతుఁడనా నేఁ
బిల్ల నొసంగినమామను
పుల్లాంభోజాక్ష కోపము న్వెస విడుమిా.

వ. అని సముద్రుండు నెయ్యంపు దియ్యనిమాటలఁ బ్రార్థించి
నేఁజేయవలసినసేవ నానతిమ్మన శ్రీరాముండు హర్షించి మే
మీసైన్యంబులతో జలధిదాఁటి లంక కేగువిధంబుఁ దెల్పు
మన నాతం డిట్లనియె. 61

క. జనకునివరమున నలుఁ డను
వనాటనాయకుఁడు శిల్పపనులన్ నేర్పొ
ప్పినవాఁడు కాన నాతని
వనధికి సేతువునుగట్ట వడి సెలవిమ్మా. 62

చ. మిగిలిన సర్వవానరులు మేకొని రాళ్లను జెట్లఁ దెచ్చి యా
యగచరుచేతికిచ్చిన మహాత్ముఁ డతం డవిపట్టి నీటఁబొల్పుగ
నమరించుఁ దద్భరముఁ బూనుచు త్రోవయొసంగి మీకు నేఁ
దగుసదుపాయముల్ సలిపెదన్ వెసఁ గార్య ముపక్ర
మింపుఁడీ. 63

చ. అని యిటు దెల్పఁగా విని ప్రహర్షమున న్నలుఁ జేరఁ జీరి
యో,వనచరశేఖరా! పరగ వార్ధికి సేతువుఁగట్టి కీర్తినిన్
గనుమని రాఘవుం డన వినమ్రత నాతఁడు రామచంద్ర నీ
యనుమతినొంది యెట్టిపని నైన నొనర్చెద నంచుఁ బల్కెనన్.

వ. అంత వానరులు శిలాపాదపాదులఁదెచ్చి నలున కందిచ్చిన
నాతం డవ్వాని నబ్ధిలో వైచిన నవి మునింగి మరలఁ దేలిన
నందఱు హర్షించి రాశిలాదులు చలింపకుండ సందుల
యందుఁ దరుపాషాణాదు లమర్చుచు నిట్లు సేతుబంధనం
బారంభించి రంత. 65

క. కపివరులు కోట్లకొలఁదిని
విపినగిరిప్రాంతములకు వేగ నరిగి పా

దపభూరిశిలాదులఁ దే
నుపక్రమణచేసి చెలఁగుచుండిరి కడిమిన్. 66

వ. ఇట్లు డెబ్బదిరెండువెల్లవలసంఖ్య నొప్పారు నక్కపివీరులెల్లరు దిగంతంబుల కుఱికి ధరాతలంబునఁగల ధరాధరతరుశిలావితానంబులనెల్లఁ బెఱికి భుజంబుల కెత్తికొని మోయుచు, శిరంబులపైఁ దాల్చుచు, బంతులగతి నెగురవేయుచు, నడచుచుఁ, బరువెత్తుచుఁ, బక్షులగతి నంతరిక్షంబున కెగసి పారుచు, భారంబు దుర్భరంబై నెడనెడఁ గ్రిందికి దింపి మరల నెత్తికొనుచు, నొక్కమహాశైలంబు బహువనాటులును, బహుశైలంబుల నొక్కండును, దెచ్చుచుండ నయ్యెడ ఱాలఁ బెకలించువారును, బెకలించినఱాల నెత్తికొనువారును, నెత్తికొని కొంతదూర మరిగి మఱికొందఱ కందిచ్చువారును, నంవివ్వక తామె సముద్రంబుదాఁక దెచ్చి యొడ్డునఁ బడవైచువారును, బడవైచినవానిఁ గొంపోయి నలున కందిచ్చువారును, నలున కూతగా బనిసేయువారును, ఱాల దింపి రిక్తహస్తంబులఁ గానల కెగిరిపోవువారును, సింహనాదంబులు సేయుచుఁ నొకనిపై కొకఁ డెక్కుచు, రాముని బొగడుచు, రావణునిఁ దెగడుచు, నిట్లు బలుతెఱంగుల వనాటులెల్ల రుత్సాహసమన్వితులై పనిసేయ, ధరాతలంబునఁగల తరుశిలాదులెల్ల కదలి శ్రీరామదర్శనార్థంబు జలధితీరంబున కరుదెంచుచున్నవిధంబు దోఁపుచుండె నింక జలధిలోఁబడు తరుశిలాదుల గుభాల్గుభాల్ధ్వనుల కదలి దిగ్గజంబులు మ్రొగ్గఁ దిమితిమింగిలాదివారిచరంబులెల్ల నలుదెసలకు న్బాఱ, బుడబుడచ్ఛటచట

ధ్వనుల జలంబు లుబికి పైకెగసి కొంత చూడవచ్చి మింట విమానంబుల నున్న నిలింపులపైఁబడి, కొంత యింక రాక్షస సంహారంబునఁ బడుర క్తవర్షం బిట్లుండునని తెల్పు విధం బున వర్షపాతంబుభంగిఁ గ్రిందవ్రాల వానరులగోలాహల ధ్వనులును, దరుశిలాదులపెళపెళారావంబులు, జలంబుల నొదవు గుభాల్గుభాల్ధ్వానంబులు నేకమై బ్రహ్మాండంబునిండి సమస్తభూతంబులకు మహాభయంబుఁ గల్గించుచు రావ ణాదిరాక్షసుల హృదయగ్రంథులు భేదింప నీరీతి దశదివ సంబులు వానరు లెల్లరుఁ బనులుసేయ లంకవఱకు సేతువు నిర్మాణంబయ్యె నంత శ్రీరాముండు తా నింక దైత్యవి రాముండ నగుదునని హర్షించి సైన్యంబులకు నాజ్ఞనొసంగఁ గపు లెల్లరు నాడుచుఁ బాడుచు సింహనాదంబులు సేయుచు, రామునిపరాక్రమం బుగ్గడింపుచు నలుని గీర్తింపుచు లంకకు న్దాటిరి. 67

క. మారుతి రాముని, లక్ష్మణుఁ
దారాసుతుఁ డంగదుండు దమభుజములపై
వారక కొని సేతువుపైఁ
బారావారంబు దాటివచ్చిరి వేడ్కన్. 68

క. వచ్చి సువేలాచలమున
విచ్చలవిడి విడసి యెపుడు విమతులఁదాకఁ
వచ్చునొ యని సంభ్రమమున
నిచ్చ నలరుచుండి రినకులేశులు కపులున్. 69

వ. అంత లంకలో రావణుండు ససైన్యంబుగ రాఘవులు సము ద్రంబు దాటివచ్చుట విని భయవిస్మయాకులుండై మంత్రు

లతో మంత్రాలోచనంబు నేసి శుకసారణశార్దూలాదిచారుల
శత్రుసైన్యంబులరసిరాఁ బంప వారలు ప్రచ్ఛన్నరూపంబుల
వానరవ్యూహంబుల జొచ్చి చూచుచుండ విభీషణుం
డెఱింగి కపులకుఁ దెల్ప వారు తర్జనభర్జనంబులు చేయుచు
నాదైత్యుల రామునియెదుటఁబెట్ట వారు వినమ్రులై
తమ్ము విడిపింపుమని రామునివేడ నాకృపామయుండు
వారల విడిపించి యిట్లనియె. 70

చ. పలుకుఁడి నాదువాక్యముల వారక మీపతితోడఁ బోరఁగా
గలిగిన వేగరమ్మనుఁడు కాకటులుండిన నెల్లి మామకో
జ్జ్వలశరవహ్నికీలలు నిశాచరకోటులఁ గూల్చుచుఁ భవ
ద్విలసితపట్టణంబుఁ గడ తేర్చును జాగ్రత యంచుఁ దెల్పుఁడీ.

చ. అని విడిపింపఁ జారులు రయంబున నేగి దశాస్యుతోడ నా
వనచరసైన్యజాలము లపారము లుగ్రము లంచుఁ దెల్పి రా
మునిభయదోక్తులన్బలికి భూరిబలుం డతఁ డామహాత్ముతో
దనుజవరేణ్య! సంధియె హితంబని పల్కు సురారి క్రోధియై.

వ. రావణుండు వారల ధిక్కరించి యుత్తరద్వారంబునకుఁ
జని యం దొక్కమహోన్నతసౌధం బెక్కి శత్రుసైన్యంబులఁ
జూచుచుండె నంత శ్రీరామునకు రావణుఁ జూపుచు
విభీషణుండు వానిదోషప్రచారంబు లుగ్గడింపుచుండ సుగ్రీ
వుండు క్రోధవివశుండై తటాలునవియత్పథంబునకు దాటి
సౌధోపరిస్థలాసీనుండై యున్న దశాననుపై దుమికి. 73

ఉ. నేరవిజుండరా దనుజ! నీభుజదర్ప మెఱుంగ వచ్చితిఁ
రార మదీయ ముష్టిహతి వ్రాల్చెద నిఁ ధరణీతలంబునఁ

జోరునిభంగి రాఘవుని సుందరిఁ దెచ్చుటకాదు నాదు దు
ర్వారతరప్రహారములఁ బ్రాణముఁ బాయకయుంటరావణా.

చ. అన దనుజేశుఁ డిట్లనియె నన్ను నెదుర్పఁగ లేక కృత్రిమం
బున నరుచేత నయ్యతనిఁ బొంచి వధింపఁగఁజేసినట్టి నీ
ఘనతరశౌర్యసంపదలు క్ష్మాతలినెల్లెడఁ దెల్లమయ్యెనో
వనచర! కోతులన్నరుల వ్రాల్చెద నొక్కత్రుటిఁ రణంబునన్.

వ. ఇట్లొండొరులఁ దిరస్కరించుచు సుగ్రీవరావణులు మల్ల యుద్ధంబునకుఁ దలపడి సింహశార్దూలంబులపోలిక శైల ద్వయంబుకరణి మహోరగయుగంబు చాడ్పునఁ బోరుచు గ్రుద్దికొనుచు, దన్నికొనుచు, మర్మంబుల నొప్పించికొనుచు, లంఘనలాఘవంబుల దాటుచు, నలసి నిలచుచు మరల డీకొనుచు బాహువు లప్పళించుచుఁ, దొడలఁ గొట్టికొనుచు రోసంబున మీసంబులు దువ్వుచు నిట్లు గొంతవడికుఁ బెనంగ, వీనిఁ బట్టుండని రావణుం డాజ్ఞాపింపఁ బెక్కు రక్కసులు తన్పట్టరా వారలఁ గాలచేతఁ జమరి సుగ్రీవుండు నభోమార్గంబున శ్రీరామునికడకు దాటివచ్చె నంత. 76

క. ఇనజుని గని శ్రీరాముఁడు
చనునే నీకిట్టి సాహసపుకార్యం బా
దనుజునిచే నీవటఁ జి
క్కిన మనదు ప్రయత్నమెల్లఁ గీడ్పడదె యనన్.

క. రామా! యాదైత్యాధము
తామసకృత్యముల వినవెరఁ బహుకోపో
ద్దామశిఖి వెల్గుటను మి
క్షేమటి దానవునిపైకి నేగితి ననియెన్.

గీ. అంత నంగదుఁ జీరి యా యర్కకులుఁడు
నీవు రావణుకడ కేగి నిలచి నేను
చెప్పుమాటల వానికి నొప్పఁజెప్పి
రమ్మటం చని పంపె ధర్మక్రమమున.

ఉ. దానవ! మమ్మెదుర్పఁగల దర్పముకల్గిన వేగరమ్ము నీ
సేనలతోడ నాహవము సేయఁగ లేనియెడన్ ధరాత్మజన్
మానితరాజ్యము న్విడచి క్ష్మాతలి నెయ్యెడకైనఁ బొమ్ము కా
దేని వధించెద న్నిను నజేంద్రముఖామరు లడ్డువచ్చినన్. 80

వ. ఈమాటలు విని యంగదుండు వియత్పథంబునఁ జని
రావణు నని రాముని వాక్యంబులఁ దెల్పిన దైత్యేశుం
డుగ్రుండై రక్షోవీరులతో వీనిఁ బట్టుండన నలువురు రాక్ష
సులు తన్పట్ట వారలఁ గరచరణవాలప్రహారణంబుల నేలఁ
గూల్చి శరవేగంబున వచ్చి రాముఁ జేరె నంత. 81

ఉ. అంత రఘూద్వహార్కజుల నాజ్ఞ వనాటచమూసమూహ
ముల్, పంతమునన్ బురంబు నలువంకల జుట్టును ముట్ట
డించి దు,ర్దాంతపరాక్రమం బెసఁగ దైత్యునికోటకు లగ్గ
లెక్కి య,త్యంతభయంబుఁగొల్ప నసురాధిపుఁడున్ గదనా
వలంబుఁడై. 82

ఉ. దానవకోటికిన్ రిపులఁ దాకఁగ నాజ్ఞయొసంగ సంగరా
నూనకుతూహలంబున ధనుశ్శరఖడ్గగదాదిశస్త్రసం
తానహరాయుధంబులను దాలిచి రాక్షసవీరులెల్లరా
వానరకోటిఁ దాకి రనివార్యమహోద్ధురశౌర్యధుర్యులై. 83

వ. ఇట్లు మహాంభోధియుగళం బెదుర్కొనిన తెఱంగున
మేరుహిమాలయంబులు డీకొనినవిధంబున నొకజగంబుపై

వేరొకజగంబు ప్రాలినపోలిక నొకమహామేఘంబు మఱి యొకమహామేఘం బొరసినకరణి నుభయసైన్యంబులు రణారంభంబునఁ దాఁకఁ దరుశిలాదులు వైచుచు వనాటులును శరవర్షంబులు గురిపించుచు నిశాటులును గడంగి, సుగ్రీవ హనుమదంగద నల నీల గజ గవయ గవాక్ష గంధమాదన జాంబవ త్పనస సుషేణ కేసరిముఖ తరుచరనాయకులు రాముపక్షంబునను, బ్రహ స్తేంద్రజి ధ్రూమ్రాక్ష మకరాక్ష విరూపాక్ష కుంభ నికుం భాతికాయ మహాకాయా. కంపన ఖడ్గ సర్వవృశ్చి కాగ్ని రోమాది దానవవీరులు రావణు పక్షంబునను మహాభయంకరలీలఁ బోరఁ గొంతవడి కుభయ సైన్యంబులు సమానంబుగఁ బెనంగి రాక్షసుల దారుణమారణసాధనంబులకుఁ దరుశిలామాత్రసహాయు లగు వానర వీరులు పెక్కుఱు గూలుచు వెనుదీయుటఁ గాంచి రాఘవులు ఘోరనారాచధారావర్షంబున శాత్రవవ్యూహంబులఁ గప్ప శిథిలంబులై వ్రాలు రథంబులును, శిరంబుఁ జొచ్చి తోకనుండి వెల్వడుశరంబులచే ధరంగూలు కరితురంగని కరంబులును, కరచరణాద్యవయవంబులు విఱిగి నేలంబడు భటవర్గంబులును నేఱులై పాఱు ర క్తప్రవాహంబులును, భూమి కన్పడకుండఁ బ్రోవులై పడిన దానవకళేబరంబులును గలిగి దశముఖుబలంబు దుర్బలంబగుటఁ గాంచి యింద్ర జిత్తు మాయోపాయంబున శత్రునాశనంబు సేయఁదలంచి పురంబుఁజొచ్చి యొకదుర్వారమారణహోమం బొనర్చి యందు వెల్వడిన యుద్ధసాధనంబుల ధరించి మింటికెగసి

మేఘాచ్ఛాదితుండై నీరంధ్రంబుగా శరవర్షంబుఁ గురి
పించుచు లక్షింపఁబడక గాఢాంధకారంబుఁగప్పి వానరులఁ
బీనుంగుపెంటలఁ గావించుచుఁ గడంగ రామలక్ష్మణులు
పైనుండిపడుబాణవర్షం బోపినంతవఱకు ఖండించుచు శర
ప్రయోగమున కందని శత్రుని సాధింపలేక విచారింపఁ
గల్పాంతసమయంబున రాలు నిర్ఘాతసంఘాతంబుల పోలికఁ
బైనుండి పడు దారుణశరపరంపరల కోర్వక వ్రాలువారును,
దాము రణంబునకై దెచ్చికొన్న శిలాదులమాటునఁ జేరు
వారును, గిరికంధరంబులకుఁ బాఱువారును జలధిలో
డాగువారును, జచ్చినశవంబుక్రింద దూఱువారునునై కపి
బలంబులు చిక్కుటకు రాఘవులు ప్రతిక్రియారహితులై
విచారింపుచుండ మేఘనాథుండు సింహనాదంబులు
సేయుచుఁ బ్రచండంబులగు నాగాస్త్రంబులు ప్రయోగించి
రామలక్ష్మణుల మూర్ఛలముంప, వ్రాలక నిలచియున్న
హనుమద్విభీషణాదు లేతెంచి రాఘవులపాటునకు భీతిల్లి
దుఃఖించుచుండ రామలక్ష్మణులును వానరులును త్రెళ్లిరని
తలంచి రావణి తండ్రికడ కేగి సర్వశత్రుసంహారంబు నేసి
వచ్చితి నని తెల్ప నాతండు మహానందభరితుండై తనయుఁ
గ్రుచ్చి కౌఁగిలించుకొని పొగడి విజయధ్వానంబులు
సేయుచు సుఖంబుననుండె నంత. శ్రీరాముండు మూర్ఛఁ
దెలసి తమ్ముం డెడతెగని రణశ్రాంతిఁ బడియుండుటకు
దుఃఖించుచుండ నారదుండు తనదివ్యదృష్టి నీక్రమం
బెఱింగి శ్రీరామునికడకువచ్చి నమస్కృతుండై యిట్లనియె.

క. రామా! ప్రాకృతునట్టుల
భీమవ్యథఁ జెందెదేల విషధరశయనుం
డౌ మధువైరికి సర్ప
స్తోమభయం బెట్లుకల్గు శుద్ధచరిత్రా. 85

క. నీవాహనమగు గరుడుని
భావింపుము మది నతండు ప్రత్యక్షుండై
వేవిషబాధ లడంచు మ
హావిష్ణుఁడ వీవు నీకు నలజడులున్నే. 86

వ. అని తెల్పిన శ్రీరాముండు గరుడుని బ్రార్థింప నతండు ముహూర్తమాత్రంబున క్షీరపయోధినుండి మహావేగంబు నరాఁ దత్పక్షమారుతప్రసారమాత్రంబున సర్పంబులెల్ల నశించి విషంబు నిర్విషంబై పోవ సౌమిత్రియు సర్వవనాటులును మూర్ఛలన్దేఱి విరాజిల్లి రంత నాఖగనాథుండు శ్రీరామునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లొనర్చి నీవాహనంబనని స్తోత్రంబుసేయ రాముం డతని గారవించి పంపె నంతఁ బ్రభాతం బగుటయు.

క. వనచరబలములు సింహ
ధ్వను లొనరించుచు దశాస్యవరపురముపయిఁ
జని లగ్గ కెక్కుటను విని
దనుజేశుఁడు భూరివిస్మితమనస్కుండై.

క. చచ్చినవా రెటు లనికిన్
వచ్చిరి సప్రాణు లగుచు భగవంతుఁ డటన్
విచ్చేసియుండ గెలువన్
వచ్చునె మనకంచు మదిని భావించి వెసన్.

క. రూక్షేక్షణము లెసఁగ ధూ
మ్రాక్షాకంపనులఁ బిలచి యరిపుంగవులన్
దక్షత వధించిరండని
రక్షోనాయకుఁడు వారి రయమునఁ బంపన్.

వ. వారు చతురంగబలసమేతులై చని వానరవ్యూహంబుఁ దలపడి నిశితశస్త్రధారల వారలఁ గూల్పఁగని మారుతి యవ్వీరులపైఁ గవిసిన. 91

మ. శరజాలం బసురావళుల్ బరపఁ బాషాణాదులన్ వాయుజుం డురుసత్వోద్ధతి వైచుచుండఁగ యత్యుగ్రాద్రి నొక్కంటి వానరుఁ డభ్రంబుకు దాటివైవ రథమున్ రథ్యంబులున్ ముక్కలై, ధరవ్రాలన్ దనుజద్వయం బడఁగె దైత్యవ్రాత ముల్ భీతిలన్. 92

వ. అంత హతశేషులు పారి దైత్యవరులపాటుఁ దెల్పిన రావణుండు విస్మయాకులుండై మహాకాయున్ జూచి నీవేగి శత్రుసంహారం బొనర్చిరమ్మన నాతండు రథారూఢుండై మహాసైన్యంబుతోఁ గదలివచ్చి కపిబలంబుల నురుమాడ నంగదుం డెదిరి వృక్షశాఖల విసరివైవ నాతండు వానినెల్ల ఖండించి నిశితశరంబు లా కపివీరుమేన గాడనేయ నాతండు చలించి. 93

తే. తాళ మొక్కటిఁ బీకి యాదైత్యవరుని
రథముఁ గూలిచి యతనిశిరంబుఁ బగుల
గొట్టి చంపెను వానరకోటిచెలఁగ
రాక్షసులు పారి లంకాపురంబుఁజేర. 94

తే. చేరి తెల్ప దశాస్యుఁడు చింతఁగుంది
మాతులుఁడు సేన కధిపతి మహితబలుఁడు
నైనగదనప్రశస్తుఁ బ్రహస్తుఁ గాంచి
శత్రునాశనమున కీవు సనుమనంగ. 95

క. ఆతఁడు బహుసేనాయుతుఁ
డై తగునాయుధము లూని యరిగి వనాట
వ్రాతాటవిఁ దనబాణో
ద్భూతదవాగ్నిఁ దహింపఁ దొడఁగెనయంతన్. 96

చ. వనచరనాయకుండు నతిబాహుబలోగ్రుఁడు నైననీలుఁ డా
దనుజుని దాకి తచ్ఛరకదంబములన్ ఘనశాఖిశాఖలన్
దునుముచు శైలవర్షమును దోరముగాఁ గురియింప దాన
వుండును శిలల న్దెమల్చి కడు నొవ్వఁగఁజేసెఁ గపి న్నురా
హతిన్. 97

శా. విన్నంబోయియు నవ్వనాటుఁ డొకయుద్వేలాద్రిశృంగంబు
చేత న్నేర్పారఁ బ్రహస్తుతేరు గెడపన్ దైత్యుండు ఖడ్గం
బుచే, తన్నైపుణ్యముమీరఁ దాకియుఁ దుదిన్ "దైవే
బలే దుర్బలే", యన్నట్టుల్ గపిచేతఁ జిక్కి గతబాహా
సారుఁడై వ్రాలఁగన్. 98

వ. అంత హతశేషులైనరాక్షసులు పారి లంకేశునితోఁ దెల్ప
నాతం డతిదుఃఖాక్రాంతుండై యింక నెందఱంబంపినఁ
గార్యంబు లేదని సకలదానవవీరులతోఁ దానేగి శత్రు
క్షయంబు నేయఁ దలంచి సైన్యంబుల కాజ్ఞయొసంగిన. 99

సీ. మేరుశృంగముఁబోలు మేటిరథం బెక్కి
చిత్రక్రముం డింద్రజిత్తు కదలె

వివిధోగ్రశస్త్రాస్త్రవితతులధరియించి
యతిరథుం డతికాయుఁ డలరి వెడలె
సురభయంకరబలోద్ధురులైనకుంభని
కుంభులు కదనసంరంభులైర
పితృవైరమునుదీర్ప వెరవిదె యని ఖర
తనయుఁ డమ్మకరాక్షుఁ డనికిఁ గదసె

తే. దానవులయందుఁ జేరొందు దండిమగలు
వేలులక్షలసంఖ్యల వెడలిరాఁగఁ
దారకామధ్యగతుఁడయి తనరుచంద్రు
కరణిఁ గదలెను దశముఖాసురవరుండు. 100

మ. కడుభేరీచయభాంకృతుల్ పటహఢక్కాడిండిమారావముల్
జడధిధ్వానము మించి మ్రోఁగఁగ నరి న్సాధింప నారాక్షసే
శుఁడు సర్వాసురవీరవారములతో శోభిల్లుచు న్వచ్చుచు
న్నెడ రాముం డెఱుఁగ న్విభీషణుఁడు చూపించె న్నిరూ
పించుచున్. 101

తే. చూపి ఘోరాఘవేశ్వర శూరులైన
వారలందరు నిప్పుడు వచ్చుచున్న
వారు వారల ననిఁ గూల్చ బహుళబాహు
దర్పమునుజూపవలసిన తఱి యటన్న. 102

వ. రామలక్ష్మణులు కవచకార్ముకబాణతూణీరధరులై వానరులు
శిలాపాదపపాణులై నిలచియుండి రంత 103

క. దనుజేశుఁడు తనతో వ
చ్చినవీరులఁ గాంచి నేనుచేసెడిరణముఁ

గనుచు నిలచి యుండుఁడు నే
న నిఖిలశాత్రవులఁ గూల్తు నంచుఁ బలుకుచున్. 104

వ. రావణుండు కపిసైన్యంబులపైఁ గవిసి పిడుగులఁబోలుశరం
బులచే వానరులఁ బీనుంగుపెంటలఁ గావించుచు ఘోరం
బుగాఁ బోరుచుండ నీలుం డెదిరి చిత్రగతుల నొప్పింప
నాతని నాగ్నేయాస్త్రంబున మూర్ఛిల్ల నేసి సుగ్రీవు నుదగ్ర
భల్లంబుల నోలనేయ హనుమంతుండు బాహుదండం బెత్తి
కొని రథంబుపై కుఱికి. 105

గీ. అశనిసమమైన ఘనముష్టి నసురుఁబొడువ
నతఁడు మూర్ఛిల్లి తెలివొంది యంత లేచి
మరలఁ బావనిఁ దనముష్టి నురము గ్రుద్ద
వసుధపై వ్రాలె మూర్ఛిల్లి వాయుసుతుఁడు. 106

వ. అంత రామాజ్ఞ వడసి లక్ష్మణుం డెదిర్చె. 107

మ. శరవర్షంబున రావణు న్బొదివి మూర్ఛన్మున్గఁగా నేయ నా
సురనాథుండును దెప్పిరిల్లి యతనిన్ సొక్కించి కల్పాంతదు
స్తరవహ్నిచ్ఛటలొప్పు శక్తిగొని మూర్ఛన్ వ్రాలఁగా
నేసి యా, ధరణీశాత్మజుఁ గొంచుఁబోఁదలఁచి దోర్దర్పాతి
రేకంబునన్. 108

వ. పట్టి యెత్తఁజాలక పెనంగుచుండ హనుమంతుం డరుదెంచి
యొక్క ముష్టిప్రఘాతంబున రావణు న్దొలఁగించి లక్ష్మణ
కుమారుఁ దనభుజంబుపై నెత్తికొని రామునిన్ జేర్చె నంత.

క. హనుమంతు నెక్కి రాముఁడు
సనుదెంచి దశాస్యుఁ దాకి తద్దేహమునన్

సునిశితశరహతిరంధ్రము
లొనరించి విరథునింగఁజేసి యుగ్రాస్త్రములన్. 110

క. పరపి దశకిరీటంబుల
ధర వ్రాలిచి ధనువుఁ ద్రుంచి దైత్యుని మేనన్
శరమండలిఁ గురిపించినఁ
గరమసురుఁడు స్రుక్కి నిటుల క్ష్మావరుఁ డనియెన్. 111

చ. తరుచరకోటితోఁ బెనఁగి తద్దయుఁ జేష్టలు దక్కియున్న వై
ఖరి కనవచ్చు నీయెడ నిఁక న్నిను నేయను గొంతదాక నా
సురవర! తీర్చికొమ్మలపు సొక్కితి వీవన దైత్యుఁ డానరే
శ్వరముఖమున్ గన న్బెదరి పాఱెవనాటులు నవ్వలంకకున్.

వ. అంత నారావణునాజ్ఞ రణస్థలి నిలచి చూచుచున్న రక్షో
వీరులును దానవసైన్యంబులును పురంబుఁజేరి రంత. 113

క. అతిభయమున దానవకుల
పతి తనయపజయముఁ దలఁచి భానుకులుల నే
గతి నిఁక వధియించెద నని
వెతలొందుచుఁ గుంభకర్ణు వెసలేపుఁ డనన్. 114

వ. అంత వేలకొలంది రాక్షసులు సని కుంభకర్ణుశయన
గృహంబుఁ జొచ్చి యాతనిచెవులకడ భేరీపటహాఢక్కా
నినాదంబులు మ్రోగింప నాతండు నిద్ర మేల్కొనకున్నఁ గరి
హయాదుల నాతనిమే నెక్కించి త్రొక్కించినను దెలియ
కున్న మలమలమసలెడుతైలంబుఁ జెవులలోఁబోసి నాసా
రంధ్రంబుల ఖడ్గంబులఁ జొప్పించి నొప్పింప నాతఁ డించుకఁ
జలించి బహురాక్షసులు గదాఘాతంబులచేఁ గొట్టఁగొట్టి
నెట్టకేలకుఁ దెలివొంది యాతండు గిరిగుహాకుహారంబుఁ

బోలిన వక్త్రగహ్వరంబుఁ దెఱచి యావులించి కరచరణా
ద్యవయవంబులు నిక్కించి శయ్యపై లేచికూర్చుండి నన్ను
నిద్రమేల్కొల్పుటకు హేతు వేమన నటనున్న రాక్షసులు
దశాస్యునాజ్ఞ యయ్యెనని తెల్ప నాతండు శయ్యడిగ్గి
కాలోచితకృత్యంబులు తీర్చికొని నూర్గుఱ మానవులఁ
జంపి భక్షించి యేబదిబండ్ల వివిధాహారంబులఁ దిని యెను
బదికూనల కల్లుఁద్రావి తగినవస్త్రాభరణంబులు దాల్చి యన్న
సభ కేగి యాతనికి మ్రొక్కి యుచితాసనంబునఁ గూర్చుండె
నంతఁ గుంభకర్ణునిఁ జూచి. 115

ఉ. దానవభర్త యిట్లనియె తమ్మునితోడఁ బ్రహస్తముఖ్యు లా
వానరకోటిచేఁబడిరి భానుకులుఁ డ్ రణమందుఁ దాకి నే
హీనపరాక్రముండనయి యింటి కనిన్విడి పాఱివచ్చితిన్
దానవవీర! నీవొకఁడుతక్క మఱెవ్వఁ డరి న్హరింపఁగన్.

క. అని కేగి మరలవచ్చిన
దనుజుఁ డొకం డైన లేఁడు తమ్ముఁడ! యేమం
దును గతియొందునఁ గానక
నిను మేల్కొల్పంగవలసె నిరుపమశౌర్యా. 117

వ. అని పల్కఁ గుంభకర్ణుం డిట్లనియె. 118

క. నారదుఁడు సెప్ప వింటిన్
శ్రీరమణుఁడు రాముఁడై జనించి దనుజసం
హార మొనర్చెడు నని యా
దారుణమా కాల మిపుడు దాపయ్యెనొకో. 119

క. కనరాఁ డెందు విభీషణుఁ
డనిఁబడెనా యన ధరాజ నారాముని కి

మ్మని నొవ్వఁ బల్కనేఁ ద
న్నినఁ జేరె నతండు రాముని న్వేస ననియెన్. 120

చ. అని తగఁ దెల్పి దైత్యపతి యచ్యుతుఁ డారఘురామ
మూర్తియై, మనలవధింపవచ్చె నను మాట నిజంబయిన
న్వధింపకేఁగునె, విధితప్పునే, వెడగుమాతలనేమి ప్రయో
జనంబు నీ,వనికిఁ గడంగనోడిన రయంబున నిద్దుర గాంచ
నేగుమీ. 121

తే. నేన పరిమార్చెదను శత్రునివహములను
సుప్తు నెవ్వరుచంపరు సుఖతరంపు
నిదురఁ గైకొనఁబొమ్మన నీకుఁ గోప
మేల నే శత్రుకోటుల నెల్లద్రుంతు. 122

వ. అనిపల్కుచు వీనిమూలంబున రాక్షసక్షయంబు కాకతప్ప
దని మది న్దలంచి రావణునితో నన్నా! నీవు మన్నించుటచేఁ
దెలిసితెలియనిమాటలు పల్కినందులకు నన్ను క్షమింపుము
నేనిదె యరుల మార్కొనఁబోయెద మద్రణకౌశలంబు
వినెదుకాక యని లేచి గదాపరిఘంబులఁ దాల్చి చనుచుండ
నెంతబలాధికుండవైన నొంటి నేగవలదని సైన్యసమేతు
న్జేసి పనుప నాతండు వెడలి. 123

సీ. అచలేంద్రశిఖరమ ట్లమరినశిరమును
గిరిగుహాకుహరంబు గేరునోరు
నిశితఖడ్గములను నిరసించుకోఱలు
దావాగ్నిశిఖ లట్లు దనరు కనులు
తరుశాఖలనుబోలు కరయుగళంబును
తాళవృక్షములనఁ దగుపదములు

మేఘమండలికంటు మేటిదేహంబును
సఱుములగతిఁ బర్వ నురురవములు
తే. గలిగి నడఁగొండయో దిశాగజమొ యనఁగ
మంటికిని మింటికిని నంటి మహితభీతిఁ
గొలుపు చరుదెంచునట్టి యాకుంభకర్ణుఁ
గాంచి పాఱెను భయమునఁ గపికులములు. 124

వ. శ్రీరాముం డామహోన్నతాకారు న్గాంచి వీఁడెవ్వండని విభీషణు నడుగ నితండు నాదిన్నయన్నయగు కుంభకర్ణుండు వీనికి దేహబలంబెకాని తపోబలంబులేదు నేఁడీతని జాగరదినంబుకాదు కాన వీఁడవశ్యంబు నీచేఁ జచ్చునని యాతని జననాదియావద్వృత్తాంతంబుఁ దెల్ప రాముండు సైన్యంబుల కభయం బిచ్చి యుద్ధసన్నద్ధుండై యుండె నంత.

క. ఆకుంభకర్ణుఁ డంతట
నాకొన్న మృగంబుకరణి నగచరవీరా
నీకముల పైనఁబడి య
స్తోకబలోన్నతిని ద్రుంపఁ జొచ్చె న్వెలుచన్.

క. కొందఱఁ గాళ్లఁ జమరును
గొందఱఁ గరములనుబట్టి క్షోణి న్మోదున్
గొందఱను నమలి మ్రింగును
గొందఱి నమలకయె గుటుకు గుటుకున మ్రింగున్.

సీ. చెలఁగి చీమలగుంపుల వెలుగుబంటి
పీల్చి మ్రింగెడుకరణిఁ గపివ్రజంబుఁ
బట్టి దిగమ్రింగఁజొచ్చె నవార్యగతినిఁ
దెగువ ఘటకర్ణుఁ డరిహారోదీర్ణుఁ డగుచు.

వ. ఇట్లు కుంభకర్ణుండు శత్రువినాశకుండయి యప్రతిహత బాహుబలంబున రణవిహారంబు సల్పుచుండ సుగ్రీవుం డుదగ్రక్రోధంబున నారక్షోవీరు నెదిరించి యొక్కధరాధర శృంగంబు వైచిన దాన నించుకఁ జలించి వాఁడు పరిఘాహతిఁ గపీంద్రు మూర్ఛవ్రాల్చి యాతనిఁబట్టి తనభుజంబుపైఁ బెట్టికొని లంకకుఁ గొంపోవుచుండఁ గొంతవడి కాతండు తెలిసి కుంభకర్ణు నాసాకర్ణంబులఁ దనదంతనఖంబులఁ ద్రక్కలించి వియత్పథంబున బాఱివచ్చె నంత నాదైత్యుండు. 129

క. రుధిరము కాఱఁగఁ గ్రమ్మఱఁ
బృథులక్రోధమున శత్రువితతులనెల్లన్
వధ నేయవచ్చు దైత్యుని
విధము న్గని కపులు రామవిభువెన్కఁ జొరన్.

ఉ. అంత విభీషణుం డెదుర నాఘటకర్ణుఁడు కాంచి రామభూకాంతుని సత్కటాక్షమున జ్ఞాతలివర్ధిల నర్హుఁ డీవు నా
చెంతకురాక దూరమునఁ జేరి కనుంగొనుచుండుమయ్య నే
నెంతయు యుద్ధతీవ్రత మరేమియొనర్తునో నిన్ను తమ్ముఁడా-

సీ. అన విభీషణుఁ డాత్మలో నార్తిఁజెంది
రావణుని దుస్సహప్రచారమున నిట్లు
దాఁటివచ్చితి మిమ్మునందఱను విడచి
యనుచు నందుండనొల్లక చనె తొలంగి. 132

శా. రాముణ్ దైత్యుఁడు డాసి యీవెయటరా రాముండ
వీవానర,స్తోమంబు న్దిని నాదుజిహ్వా కడుచేదు న్జెందె మర్త్యుం
డవో, నీమాంసంబును మెక్కకాయరుచి శాంతిన్ జెందఁగాఁ

బోదు రవ్యూహమార్తాండకులేశ! నాకడకు వే నాతిథ్య
రూపంబునన్. 133

మ. అన రాముం డిదెవచ్చినాఁడ నని క్రూరాస్త్రంబు లేయన్
గదాఘనదండంబును రాక్షసుండు విసరన్ గాకుత్స్థుఁ
డద్దానిఁ ద్రుంచి నిశాటేశ్వరు బాహువుల్ పదములున్
ఛేదించి మూర్ధంబు ఖండనమున్ జేసెను బ్రహ్మజప్రదరసంధా
నంబునన్ గిన్కతోఁ. 134

వ. ఇట్లు గిరీంద్రంబుఁగూల్చు సురేంద్రుని పగిది శ్రీరాముండు
కుంభకర్ణుని వధింప రాక్షసులు పాఱి లంకఁ జొచ్చి రావణున
కత్తెఱం గెరిగింప నాతండు బెట్టుమూర్ఛిల్లి తెలిసి పరిపరి
విధంబులఁ దమ్మునిదలంచి శోకించుచుండ నతికాయదేవాం
తక నరాంతకప్రముఖు లేతెంచి దుఃఖోపశమన వాక్యంబులు
పల్కి యూఱడించి మేము విరోధుల సాధించెదమని సైన్య
సమేతులై యుద్ధంబున కేగిన. 135

ఉ. అంత నరాంతకు న్గదిసి యంగదుఁడున్ మరుదాత్మజుండు దే
వాంతకుని న్నికుంభుఁ ద్రిశిరాసురు నీలుఁడు కుంభు నర్క
జుం, డంతకుఁ జేర్చి రుగ్రుఁ డగునయ్యతికాయు సుమిత్ర
సూతి యత్యంతరణోగ్రత న్గెడపె నమ్మకరాక్షుఁడు కూలె
రాముచేన్. 136

వ. ఈవిధం బంతయు విని రావణుం డేమియుఁ దోఁపక తన
నిఖిల బంధుమిత్ర సేనానివహంబు నరవానరులచేఁ గూలు
టకు భయవిభ్రమాశ్చర్య శోకతప్తహృదయుండై యుండ
మేఘనాదుం డరు దెంచి యిట్లనియె. 137

క. జనకా! వగవఁగ నేటికి
నని మొనఁ బ్రత్యక్షమందు నరి గెలువఁగ రా
దనుపమబలు లవ్వారలు
ఘనమాయాబలముచేత ఖండింపనగున్. 138

క. కావున నేఘనమాయా
ప్రావీణ్యముచేత నరులఁ బడఁగూల్చెద నా
లావును గనుఁగొనుమని యా
రావణి చనె హోమగృహము రయమునఁ జేరన్. 139

వ. చని మారణహోమం బొకటి నెఱవేర్చి యందుద్భవించిన రథం బెక్కి వివిధాయుధంబుల ధరించి మేఘనాదుండు మేఘాచ్ఛాదితతనుండై రణరంగంబు గాఢాంధకార మయంబుసేసి శత్రులపైఁ గవిసి. 140

లయగ్రాహి:—
వానరసమూహములమేనులను దూఱి చనఁ
గా నిశితబాణములఁ బూనిపడి నేయన్
దానవకులాధిపతిసూనుని మహాంబకవి
తానఘనవృష్టికి రయానఁ గపివీరుల్
హీనబలులై ప్రతివిధానము లెఱుంగ కిల
పై నొరిగిరంద రతిదీనముఖు లౌచున్
మానవకుమారు లరిఁగానకయు నోపినటు
వానిశరవర్షములఁ బూని హరియింపన్. 141

వ. ఇట్లు మేఘనాదుండు మేఘాచ్ఛాదితుండై యెందునఁ గానరాక సర్వవానరసేనల నదయంపుసోనలచే వ్రాల్చుచుండఁ గాంచి రామలక్ష్మణు లిట్లు భావించిరి. 142

సీ. కల్పాంతజాతనిర్ఘాతవృష్టియొ యన
నజున కాయుష్ప్రాప్తి యందలేదు
ముక్కంటికంటి విపులవహ్నియో యనఁ
బూబాణుసన్నిధిఁబోల్పరాదు
ధరణిఁ గాల్పఁగ రవి దాపయ్యెనో యన
గాఢాంధకారంబు గడచిపోదు
రాక్షసేశ్వరుని శరప్రయోగమొ యన
నేదిక్కు నందరి యెఱుఁగఁబడఁడు
శరమునకు సంద కంబుదాచ్ఛాది యగుచు
బాణవర్షంబుఁ గురియించుపగతు గెలుచు
టెట్టు లని యెంచి సాధన మెఱుఁగలేక
యట్టె మూర్ఛిల్లి రనుజుని యంపవాన.

వ. ఇట్లు ప్రళయమారుతప్రసారంబున నేలవ్రాలుతరునికరంబుల భంగి రావణి దారుణశరవర్షంబున సకలవానరసేనలును దాశరథులును మూర్ఛలవ్రాల నెల్లరు మడిసిరని తలంచి యింద్రజిత్తు చనియె నంత వ్రాలక యెట్లో నిలచి యున్న హనుమద్విభీషణులు రామలక్ష్మణులపాటునకు విచారింపుచుఁ బడినసైన్యంబులఁ దేర్చుచు నొక్కెడ బాణక్షతసర్వావయవుండైన జాంబవంతుని గాంచి తేర్ప నాతండు సంజీవని సేవించినఁగాని సైన్యంబులును రాసుతులును బునర్జీవితులు కారనియు నాయౌషధంబులు దేనోపినవాఁడాంజనేయుం డొక్కండె యనియుఁ దెల్పి యాహనుమంతున కాయౌషధలతలుకల ద్రోణాద్రిఁజేర హిమవంతంబును మేరువును శాకద్వీపంబును క్షీరవార్ధియును దాటవలయునని

మార్గంబుఁజెప్ప నాతండు శ్రీరామానుగ్రహంబున మహిత
బలోత్సాహసంపన్నుండై పోయి ద్రోణాద్రిఁజేరి యటఁ
గాపున్న గంధర్వులనిర్జించి యౌషధలతల నిరూపింపనేరక
యాద్రోణాద్రిఁ బెకల్చి శిరంబునఁదాల్చి తెచ్చి సేనామధ్యం
బున నిల్పిన నాసంజీవని సేవించి రామలక్ష్మణులును సకల
వానరసేనలును బునర్జీవితులై రంత శ్రీరాముండు మారు
తిఁ గాంచి యిట్లనియె. 144

ఉ. మారుతి నీకతంబున సమస్తవనాటులు మేము క్రమ్మఱన్
జేరితిమయ్య ప్రాణముల నీయుపకారవిశేషమెన్నఁగా
నేరను దీర్చు టెట్టులొకొ నీఋణమం చని వేతెఱంగులన్
గారవమారఁగాఁ బొగడె క్ష్మాపతి కేసరిపుత్త్రు వేడ్కతోన్.

గీ. పొగడి హనుమంతుఁ గాంచి యీభూధరంబు
మరలఁ గొంపోయి యెప్పటిమాడ్కి నుంచి
రమ్మని వచింప నాగిరీంద్రమ్మతండు
తెచ్చినస్థలంబునందిడి వచ్చె వేగ. 146

వ. అంత వానరులు కోలాహలధ్వనులుసేయుచు లంకపైఁ
గవిసి లగ్గలకెక్క రావణేంద్రజిత్తులు విభ్రమాశ్చర్యమనం
బుల నిట్లని విచారించిరి. 147

గీ. దురమునకుఁబోవు మనవాఁడు మరల రాఁడు
చచ్చిపోయినశత్త్రువు వచ్చు బ్రదికి
యీవిరుద్ధంపుగతులకు హేతువేమొ
దైవసంకల్ప మిటులున్నఁ దప్పవశమె. 148

వ. అని విచారించి యెట్టులైన మాయాబలంబుననే శత్త్రువుల
హరింపఁదగునని నిశ్చయించి యింద్రజిత్తు మాయాసీత

నొకదాని నిర్మించి తనరథంబుపైఁ బెట్టికొని హనుమంతుం
డున్నదిక్కునకేగి కపులు శిలాపాదపపాణులై తన్నెదిరింప
మారుతిఁగాంచి యిట్లనియె. 149

క. ఈరమణివలన మాకుఁ
దీరనికష్టములువచ్చె దీని నిపుడు మ
ద్భూరికరాశి స్దునిమెద
నోరివానర యటంచు నుగ్రుం డగుచున్. 150

ఉ. కైతవజానకీసతిని గ్రక్కున వేణినిబట్టి యీడ్చి యా
నాతి మరుత్సుతు గ్గని యనాథనుగావుమటంచు వేడ, నో
రీతగవా సతీమణి వధించుటయం చనిలాత్మజుండు వే
రీతులఁబల్క దైత్యుఁ డొకవ్రేటునఁ ద్రుంచె శిరంబిలన్బడన్.

గీ. త్రుంచి యోవానరా! రాముతోడఁదెల్ప
వేగఁ బొమ్మంచుఁ బల్కి యావీరరాక్ష
సుండు లంకాపురంబును జొచ్చి యచట
నూనఁగడఁగె నికుంభిలాహోమవిధిని. 152

వ. అంత హనుమంతుండు బోరుబోరున నేడ్చుచు శ్రీరామ
చంద్రుపాలికిఁబోయి యింద్రజిత్తు సీతం జంపెనని చెప్ప
హాహారవంబులు సేయుచు రామలక్ష్మణులు మూర్ఛిల్లి తెలసి
బహువిధంబుల శోకించుచుండ విభీషణుం డరుదెంచి దుఃఖ
హేతు వెఱింగి శ్రీరామునితో నిట్లనియె. 153

మ వగవంగాఁ బనిలేదు సీతను వధింపజ్ఞాలునే దానవుం
డు గడున్మాయలవాఁడు వాఁడు మనలక్షీణోత్థలిన్గూల్పఁగా
దగుతంత్రం బెదొ సేయఁబూని మిము చింతామగ్నులజ్జేసి

తా, నెగడ న్మ్బానెను దుష్టమారణవిధిఁ నిర్విఘ్న మౌనట్లు
గాన్. 154

వ. ఐన నామంత్రులలో నొక్కని సీతాక్షేమం బెఱుంగఁ
బంపెదనని తెల్పి పంప, నామంత్రి యశోకవనంబున కేగి
వచ్చి సీత క్షేమంబుగ నున్నదనియు నింద్రజిత్తు నికుంభిళా
హోమం బుపక్రమించుచున్నాఁ డనియుఁ దెల్ప విభీష
ణుండు శ్రీరామునితో నిట్లనియె. 155

శా. రామా! లక్ష్మణు సత్వరఁ బనుపుమా రాత్రించరు న్దాకి త
ద్ధోమంబుఁ జెఱుపంగ వానరబలస్తోమంబుతో నాతఁ డెం
తో మాయానిపుణుండు, దుర్జయుఁడగుఁ హోమంబు
నిండారినఁ, స్వామీ! వానివధింపఁగాఁ దఁటే యిదే జాగొప్ప
దన్నఁ వెసన్. 156

క. శ్రీరాముఁడు లక్ష్మణుఁ గని
యారజనీచరునిఁ గూల్ప ననుజా సేనా
వారముతోఁ జని విజయ
శ్రీరాజిల వానిఁద్రుంచి చెలువుగ రమ్మా. 157

వ. అనిపల్క లక్ష్మణుం డన్నకు నమస్కరించి దీవనలంది హను
మత్స్కంధాధిరూఢుండై, వానరసేనలతోఁ గదలి రావణి
హోమంబుసేయుచోటికి జ్జని. 158

ఉ. కావలియున్న రాక్షసనికాయములఁ గపివీరులద్రివృ
క్షావళిచే వధించి దనుజాధిపసూనుఁడు సేయుఘోరహో
మావసరక్రియల్ సెరిపి యగ్నులఁ నార్చి పదార్థరాసులఁ
బోవఁగఁ బారవైచి ఘనభూరుహశాఖలమీఁద వైచినన్.159

వ. చలింపక రావణి దీక్షాబద్ధుండై యుండ లక్ష్మణుండు కధిసి.

శా. ఓరీ దానవ! యింక నీదుఘనమాయోపాయముల్ ల్లవా
త్స్యారాధిన్ వధియింతు నిన్నిపుడు ప్రత్యక్షింబునన్
సంగర, క్ష్మారంగంబున నిల్వలేక కపటాచారుండవై డాగి దు
ర్వారాస్త్రంబుల నొవ్వఁజేయు టది శూరత్వంబె యోజించి
నన్. 161

చ. అని యిటుపల్కి ఘోరనిశితాంబకముల్ గురియింప నింద్రజి
ద్దనుజుఁడు దీక్షవీడి యమితంబగుకిన్క మహాట్టహాసగ
ర్జన లొనరించుచున్ గదిసి క్ష్మావర! మర్త్యుఁడు మర్త్య
భోజనున్, జెనకఁగఁజాలునే యనుచు నిష్ఠురబాణచయంబు
లేసినన్. 162

ఉ. ఒండొరుబాణజాలముల నుర్వరఁగూల్చుచు సాయకాళిదో
ర్దండబలంబునన్ బరపి తప్పక మర్మము లంటనేయుచున్
మెండుగ రక్తధారలను మేనులనుండి స్రవింపఁజేయుచున్
నిండుజయేచ్ఛలన్ గదన నిష్ఠలఁబోరిరి వార లిర్వురున్. 163

కవిరాజవిరాజితము:—

ఉరగమహాస్త్రము దానవుఁ డేయ
మహోగ్రత గారుడబాణమునన్
నరవరసూనుఁడు దాని నడంపఘ
నక్రుధరాక్షసుఁ డగ్నిమహా,
శరమడరింపఁగ రాకొమరుండు ల
సద్వరుణాస్త్రముచే నడఁపన్
సరగున దానవమానవవీరులు
శక్తులవైవఁగఁ దచ్ఛరముల్. 164

ఉ. పోరి యడంగె నీగతిని భూవరసూనుఁడు దానవుండునున్
దారుణలీల నస్త్రసముదాయము లేయుచుఁ ద్రుంచివైచు
చున్, దూరుచు ధిక్కరింపు చతిదుర్లభలీలలఁ బెద్దసేపు దో
స్సారముమీరఁ దుల్యబలసత్వములన్ గడనప్రచారులై. 165

వ. అంతఁ గొంతవడికి బహుళకఠోరంబులగులక్ష్మణాస్త్రజ్వాలల
స్రుక్కి మూర్ఛిల్లి లేచి దాశకంఠి తన బలావసానంబునకు
వగచుచు ధైర్యంబు నెలకొల్పికొని మరుత్తనయవిభీషణ
లక్ష్మణుల నొవ్వనేసి సౌమిత్రి యంపసోనలకు రక్తసిక్తశరీ
రుండై యలయుచున్నెడ లక్ష్మణుండు. 166

సురనాథాస్త్రముఁ దాలిచి
ధరణీసుత సత్పతివ్రతాగుణయేనిన్
నరపతి రాముఁడు సత్య
స్ఫురణాత్మకుఁడేని యీవిపులశస్త్రమునన్. 167

క. ఈరాక్షసుఁడు హతుండై
ధారుణిపైఁ గూలుఁ గాత తప్పక యని యా
ఘోరాస్త్ర మేయ నయ్యది
యారావణి శిరముఁద్రుంచి యవనిన్ వ్రాల్చెన్. 168

వ. అంత దేవతలు పుష్పవృష్టిఁ గురిపించిరి. దుందుభులు
మ్రోగె. నప్సరస లాడిరి. కపులు జయజయధ్వానంబుల
లక్ష్మణుఁ బొగడిరి. త్రిలోకంబు లేకంబుగ హర్షించె.
సౌమిత్రి కపిసేనాపరివృ[illegible] వచ్చి రామునకు మ్రొక్క
నాతండు తమ్ముని గాఢ[illegible]గనంబుచేసికొని కీర్తించి గార
వించి యిట్లనియె. 169

క. మా లక్ష్మణుఁ డని రావణిఁ
గూలిచె నేనింక దశముఖుఁ ద్రుంచెద మీ
రీలోపల దైత్యుల ని
ర్మూలింపుఁ డటంచుఁ గపివరులతో ననియెన్. 170

వ. ఇట్లు పల్కి రామలక్ష్మణులును సుగ్రీవాదులును హర్ష
సాగరమగ్నులై యుండి రంత నక్కడ హతశేషులైన దోషా
చరులు పాఱి లంకఁ జొచ్చి రావణునకు నింద్రజిత్తుపా
టెఱింగించిన నిర్ఘాతాహతిఁ గూలు గిరిశిఖరంబు విధంబున
నాతండు హాహారవంబులు సేయుచు భూమింబడి పెద్దదడవు
నకు రాక్షసులు తేర్ప లేచి యీచందంబున మహాక్రంద
నంబులు సేయం దొడంగె. 171

ఉ. హా సుకుమార! హా తనయ! హా రజనీచరవంశదీప! నీ
భాసురశక్తిసంపదలు వాసవుఁ బట్టినవిక్రమంబు, మా
యాసమకౌశలంబు వృథలై యెటుఁబోయె నిఁకేదిదిక్కు నా
గాసి హరించువారెవరు కల్గెఁగదా ప్రళయంబు లంకకున్.

క. నరు లిరువురు కొందఱు వా
నరులఁట లోకత్రయప్రణాశకరోగ్రా
సురుల హరించెదరఁట యీ
విరుద్ధవిషమక్రమంబు తెలియు టదేలో. 173

మ. జనకక్ష్మావరపుత్రి నేటికి భవిష్యద్దుర్దశావస్థలన్
గన కేఁ దెచ్చితి నావిభీషణునివాక్యం బేల నాలింపనై
తిని, నేలా రఘురాముతో నపుడె సంధిజ్జేయనైతిన్, "వినా
శనకాలే విపరీతబుద్ధి" యనుభాస్వద్వాక్యముల్ తప్పునే.

తే. మించిపోయినపిదప నేమిఫల మేడ్వ
పాసిపోయినయన్నంబు పక్వమగునె
యనుచుఁ దలపోసి యరులచే నవనిఁబడుటొ
యరులఁ జంపుటొ తేల్చెద నంచుఁ దెగువ.

క. నాతనయుఁడు మాయాభూ
జాతను ఖండించె, నిపుడు సత్యంబుగ నే
సీతనె చంపెదనని యా
నాతిపయి న్గవసె దైత్యనాథుం డలుకన్.

తే. అటుల గవయంగ మంత్రు లాయసురుఁ గాంచి
దానవేశ్వర! శత్రులఁ దాకలేక
యంగనను జంపె దశముఖుం డండ్రె జనము
లేటి కీసడి యంచు నిశాటుమాన్ప.

వ. రావణుం డంతఁ బట్టరానిశోకకోపోద్రేకంబున నతిసాహ
సుండై రాక్షసబలంబుతో యుద్ధంబునకు వెడలి శ్రీరాము
న్దాకి. 178

శా. చండక్రోధముతోడ రాముని మహాస్త్రజ్వాలల న్గప్పి దో
ర్దండప్రౌఢిమఁ జూపుచు న్దొడర నారాముండు తీక్ష్ణంబులౌ
కాండశ్రేణులచేత దైత్యుశరముల్ ఖండించుచు న్వాని మే
నిండన్ గ్రుచ్చె మహాశుగప్రకరము న్వీర్యం బవార్యంబుగన్.

మ. దనుజాధీశుఁడు రాముబాణసమితి న్దర్పించి ఖండించుచున్
మనుజేంద్రు న్శరతాడితావయవునిన్ గావించుచు న్గేసరిన్
ఘననాగం బెదిరించునట్టుల గడంగన్ బోరు ఘోరాకృతిన్
గనవచ్చె న్నరదానవేశులు సమానప్రజ్ఞులై పోరఁగన్. 180

వ. ఇట్లయ్యిరువురు దారుణంబుగఁ బోరుచుండ లక్ష్మణవిభీష ణులు పుట్టలోనుండి వెల్వడుమహాసర్పంబులభంగి సైన్య మధ్యంబునుండి వచ్చి రావణు నడ్డపడి, లక్ష్మణుండు రథ సారథి నార్చి కోదండంబు ఖండించి తీవ్రనారాచంబుల నాతనివక్షంబు గాడనేసె విభీషణుండు గదాదండంబున రథాశ్వంబులమోది చంపి రథంబును భగ్నంబుసేసె నంత దశముఖుండు విరథుండై మహాక్రోధంబున విభీషణుని నొకశక్తి వైచిన. 181

క. ఆశక్తిని లక్ష్మణుఁడుమ
హాశుగ మొకఁడేసి త్రుంప నత్యుగ్రతమ
వ్యాళనుఁడు మయవినిర్మిత
మాశక్తిని దీసి యనుజునందలి కిన్కన్.

కల్పాంతసంభూతఘనతరనిర్ఘాత
పటలంబుగతి మహాధ్వనులు పర్వఁ
గ్రోక్కారు నందు నెక్కొన్నుక్రొమ్మెఱుంగుల
గతిమిఱుమిట్లఁ గన్గవలుమూయ
దైత్యారిచేతిసుదర్శనచక్రమ
ట్లురుతరజ్వాలలం బరముఁగప్ప
వనధిలోనుండి వెల్వడుబాడబం బన
మింటికి మంటికి మంటలెసఁగ
తే. ప్రతిహతం బెందు లేని యాప్రబలశక్తి
రావణుండు విభీషణు వ్రాల్ప నెంచి
వైవ దైత్యానుజుఁడు ప్రాణభయముఁజెంద
లక్ష్మణుం డడ్డి కాచు దలంపుతోడ.

క. తాను విభీషణునకు న
డ్డై నిలచి శరంబులేయ నాగక వడి నా
దానవునిశ_క్తి లక్ష్మణు
మేసునగాడంగ నతఁడు మేదిని వ్రాలెన్. 184

వ. అంత శ్రీరాముండు సంగరంబువిడచి శోకమగ్నుండై తమ్మునిఁ జేరవచ్చి యతనియురంబున నాటియున్న శ_క్తిఁ బీకివైచి విలపించుచుండ, రావణుం డాగక తీక్ష్ణాశుగంబుల రాముని ముంచుచు డాయఁ గొంతవడి కోర్చి రామ చంద్రుండు ప్రళయకాలరుద్రునిభంగి వికటభ్రుకుటీ ముఖుండు నరుణనేత్రుండునై రణసంరంభంబున లేచి కపుల న్గాంచి యిట్లనియె. 185

తే. దశముఖుఁడు పారకుండ యుద్ధంబునందు
నిలచెనేని జగంబున నేఁడు రావ
ణుండో రాముఁడో యొక్కండె యుండుఁగాక
యిర్వురును మనుచుండ రీ యుర్వియందు. 186

వ. అని ప్రతినచేసి నాప్రతాపంబుఁ జూచుచు లక్ష్మణుఁ గాపాడు చుండుఁడని కపులతోఁ బలికి రావణు న్గదిసి. 187

చ. పిడుగులవర్షమో యనఁగ వీరవరుం డగురాముబాణముల్
గడువడి నేగుదెంచి దశకంఠునివక్షముఁ దూఱి వెన్నునన్
వెడలుచు ర_క్తధారల స్రవింపఁగఁ జేయఁగ నిల్వలేక దై
త్యుఁడు రఘువీరు మోముఁగన నోడి వెస న్బరువె_త్తె లంకకున్. 188

గీ. ఎట్టులో చావుదప్పి కన్ లొట్టవోయి
ప్రాణభయమున నింటికిఁ బారివచ్చి

యెటులఁజూచిన రాముఁడే యెల్లదిశలఁ
గానుపింప దశాస్యుండు కలఁగె మదిని. 189

వ. అంతట శ్రీరాముండు రావణుండు యుద్ధవిముఖుండై పాఱ, ధారుణి న్బడియున్న లక్ష్మణుకడ కేతెంచి యిట్లు శోకింపఁ దొడంగె. 190

సీ. ననువీడి మనలేక వనితాదిసుఖముల
వర్జించి నాతోడ వనికివచ్చె
నఱకాలునందు మన్నంటకుండఁగ నన్ను
కడఁగి యెల్లప్డు రక్షణ మొనర్చెఁ
గంట నిద్దుర లేక కడుపుకుఁ దినఁబోక
నాదు సేవయె ప్రధానముగఁ జేసెఁ
గడిమి నాకొఱ కతికాయేంద్రజిన్ముఖ్య
దైత్యవీరులనెల్ల ధాత్రిఁగూల్చెఁ
తే. దుదకు నాకొఱ కసురులవడలె నకట
యిట్టిహితు నిట్టితమ్ముని నిట్టియోగ్యుఁ
బాసి బ్రతికిన ఫలమేమి వసుధయందు
నేను మాలక్ష్మణునితోడ మేనువిడతు. 191

గీ. ఆలిపోయిన నింకొకయాలివచ్చు
సోదరునిఁబొంద శక్యమే క్షోణియందుఁ
బత్నికొఱకయి తమ్మునిఁ బాసిపోతి
నాకు నింకేల యరినాశనప్రసక్తి. 192

గీ. పోవిభీషణ నామాట పొసఁగ దింకఁ
బొమ్ము సుగ్రీవ నీదు సైన్యమ్ముఁగూడి

యొప్పఁజేసితి వెన్నియో యుపకృతులను
వశమె దురదృష్టు నెందైన బాగుసేయ. 193

వ. అని పేరెలుంగున నేడ్చు శ్రీరాము న్గాంచి కపులెల్లరుఁ విన్నఁబోయిన మోములు మిన్నక విచారించుచుండ సుషేణుం డరుదెంచి లక్ష్మణు నాడీపరీక్ష నేసి యిట్లనియె. 194

గీ. మూర్ఛయేకాని మృతికాదు పోసఁగనాడి
స్థలము విడలేదు సంజీవివలనఁ బ్రతుకు
దానిదేఁ బంపు మంజనీసూను వేగ
నినుఁడు దోఁపక మున్నది యీాయవలయు. 195

వ. అనిపల్క శ్రీరాముండు హనుమంతు స్జీరి. 196

క. తమ్ముఁడ యీనాతమ్ముని
నెమ్మిఁ బ్రతికింపుమయ్య నీరజమిత్రుం
డిమ్మహిఁదోఁపకమున్న ర
యమ్మున నాయౌషధముల నందీవలయున్. 197

వ. అని మారుతి న్గాంచి దీవించిపంప నాతండు తత్క్షణంబ వియన్మార్గంబున కెగసి శరవేగంబునఁ బోవుచుండ నావార్తఁ జారులవలన నెఱింగి రావణుఁడు కాలనేమిఁ జీరి నీవేగి మాయోపాయంబున హనుమంతుఁడు సంజీవనిఁ దేకుండ విఘ్నంబు నేయవలయు నని పంప నాతండు. 198

సీ. ద్రోణాద్రికేగెడు త్రోవలో నొకతపో
వనము నిర్మించి యావనములోనఁ
దాపసాకృతిఁ దాల్చి దైత్యుండు కొందఱ
శిష్యవర్గంబుతోఁ జేరి నిలచి

జపనిష్ఠలోనుండఁ జయ్యన మారుతి
యభ్రగతినిబోవుచావనంబుఁ
గాంచి మున్నిది నాకుఁ గన్పడదే త్రోవ
దప్పినాడనో యంచుఁ దల్లడమున

తే. నిలకు డిగివచ్చి యామునిఁ జేరఁగి మార్గ
మడిగి దాహజలంబుల నసుగఁగోరఁ
దనకమండలగతమయి తనరువిషము
ద్రావుమనఁ జాలదని మరుత్తనయుఁడనిన. 199

క. జలజాకరమదె చని ని
ర్మలజలములఁ గడుపునిండఁ ద్రావి మరల న
న్నలయుము ద్రోణాద్రికిఁ బో
దలఁపకు మిట నీకు నౌషధంబు లొసఁగెదన్. 200

సీ. కాంచితిని దివ్యదృష్టి లక్ష్మణుఁడు దైత్య
వరునిశక్తిని మూర్ఛిల్లి వసుధవ్రాల
నతనిదేర్పంగ ద్రోణాద్రి కౌషధములఁ
దెచ్చుటకుఁ బోయె దీవని తెలియఁబల్కి. 201

వ. అంత నాతాపసుం డాపద్మాకరంబుఁ జూపింప నొకశిష్యునిఁ బంప హనుమంతుం డటకేగి యాసరోవరంబున డిగి నీరు ద్రావుచుండ. 202

క. కరిని మకరి మున్పట్టిన
సరణి ననిలసుతునికాలు సత్వరఁబట్టెఁ
గురుబలమున నొకమకరము
కరువలికొమరుండు దానిఁ గడచెడు నాసన్. 203

చ. బలమున నెంతయున్నిన నవారితశక్తి జలగ్రహంబు ని
శ్చలగతిఁబట్టువీడక యొసంగుట గన్గొని సూక్ష్మగాత్రుఁడై
తొలఁగకదానిగర్భమును దూఱినఖంబుల వ్రచ్చి చంపియా
జలములనుండి వెల్వడె నసాధ్యుఁడు మారుతివిక్రమోద్ధతిన్.

ఉ. అంతట నాజలోగ్రచరమంబులఁ ద్రెళ్లి సతీస్వరూపముల్
వింతగఁ దాల్చి యాకపిని వేడ్కఁగనుంగొని ఘోరశాప దు
ర్దాంతవిపత్తుచేత మకరంబయియుంటిని ధాన్యమాలియన్
కాంతను నేను నీదుకృపఁ గాంచితి శాపవిముక్తి విస్మితన్.

క. నిను నీజలజాకరమున
కనిపినవాఁ డొక్కయసురుఁ డాతడు నివ్వం
చనసేయవచ్చె నిట కా
దనుజుని వధియించి నీపథమునఁ జనుమనన్.

తే. అంత నామునికడ కేగి యనిలసుతుఁడు
యోగివర నీవు సేయుమహోపకృతికిఁ
దగినగురుదక్షిణం బీయఁ దగవటంచు
నశనిసమమైన యొకముష్టి నసురఁబొడిచె.

క. దనుజుం డంతటఁ దారవి
తనయాకృతివచ్చి మారుతి సుతా! మనరా
మునితమ్ముఁడు తెలివొందె
జను దెమ్మౌషధముకొఱకుఁ జనవల దనినన్.

క. ఆమారుతి యాతనిఁ గని
నీమాయ లడంతు నంచు నెత్తుర గ్రక్కన్
భీమంబుగఁ దలఁగ్రుద్దిన
భూమిన్బడె నతఁడు త్రెళ్లి పూర్వాకారుఁడై.

వ. అంత హనుమంతుం డాకాశపథంబున ద్రోణాద్రి కరిగి, వెనుకటి కోతి మరలవచ్చెనని యచ్చటిగంధర్వు లెదుర్వ వారల సరకుగొనక యద్రిఁ బెకలించి శిరంబున ధరించి వాయువేగంబున వచ్చుచున్నెడ నయోధ్యయందు భరతుం డొకదుస్వప్నంబుఁ గాంచి లేచి ఘనమార్గంబున గిరిధరుండై యేగు మరుత్సుతు నగని యది రాముని కెగ్గుసేయ నేగు నొకభూతం బని శంకించి దానిఁ బడఁగూల్చెదనని బాణంబుఁ ధరింప వసిష్ఠుం డాయుగ్రాకారుండు రామకార్యనిర్వాహకుండుకాని ద్రోహికాఁడని తెల్ప నాతం డూరకుండె నంత మారుతి దక్షిణవారాశిమీఁదుఁగా వచ్చుచుండ స్థూలజంఘాదిరాక్షసులు రావణునాజ్ఞ నేతెంచి తన్నెదిరింప వారల నభోమార్గంబునఁ దన వాలంబుచేతను బాదంబులచేతను గొ చంపి సముద్రంబునఁ బడవైచి రామాశ్రమంబుఁ జేరవచ్చుచున్నెడ. 210

శా. బాలార్కప్రభ వెల్గుచుండుశిఖరవ్రాతంబు దీపించు ను
ద్వేలద్రోణగిరి న్ధరించి హనుమద్వీరుండు మింట న్గనన్
రా, లక్షించి యినోదయం బని యెదన్శంకించి సౌమిత్రి ప్రా
ణాలేమానో యటంచు రాముఁడు ప్రచండక్రోధతామ్రా 211

సగ్రర:

ఔరా నన్నరుణుఁ డెంతో
యలసునటు నలక్ష్యంబున న్జూచి యిట్టుల్
ఘోరాపద్రాశిఁ గూల్పన్
గుటిలుఁడయి యరిన్ గూడియున్నాఁడు

ర్వారక్రోధాస్త్రవహ్నిన్
వసుధపయింబడన్ వ్రాల్చెద నన్ని నంచున్
ధీరుండై చాపమెత్తెన్
త్రిజగములు భయోద్వేలలీల న్గలంగన్. 212

మ. వడంకెన్ గుంభిని, వార్ధిఘోష లుడిగెన్ బ్రహ్మాదు లాత్మ
న్దిగుల్, వడి రర్కాదివియద్గ్రహంబులు గతుల్ తప్పెన్
గపీంద్రుల్ భయం, పడి రామా! యిది ద్రోణశైలగత
దీవ్యత్కాంతియే కాని గన్పడ దర్కోదయసత్ప్రభాళి
యనుచున్ భాషింపుచుండ న్వేసన్. 213

క. గిరితలం దాల్చి రెండవ
యరుణుండన హనుమ ధాత్రియందున డిగ్గెన్
దరుచరులును రాఘవుండును
బరమానందంబుతోడ భళిభళి యనఁగన్. 214

వ. అంత శ్రీరాముండు సుషేణుం బిలచి లక్ష్మణుం బ్రదికింపుమన
నాతం డయ్యద్రి నెక్కి విశల్యకరణిం దెచ్చి సౌమిత్రికిచ్చిన
నాతండు. 215

తే. నిద్దురమేల్కాన్న గతిలేచి చెదరి యచటం
బడినధనురస్త్రవితతులం దాల్చి నిలువ
రాఘవుండు భ్రాతృవాత్సల్యర క్తినమజుం
గ్రుచ్చి కౌఁగిటం జేర్చి వాక్రుచ్చె నిట్లు. 216

క. తమ్ముఁడ నాభాగ్యమ్మున
నిమ్మారుతియుపకృతిన్ మహిన్ బ్రతికితి ఘో
రమ్మగురావణుశక్తి క
తమ్మునం బ్రాణములం బాసి ధాత్రిన్బడియున్. 217

తే. నీవు లేకున్న చో నాకు జీవమేల
యనిన లక్ష్మణుఁ డవనిజయార్తిఁబాప
కవ్విభీషణుకష్టంబు లడఁపకిట్లు
పలుకనౌనె మదర్థమై పార్థివేంద్ర. 218

వ. అనిపల్కి నంత నరనాథులును గపివ్యూహంబులును చెలంగి సింహనాదంబులు సేయుచు లంకగవంకులకుఁ గదిసి కలంప, రావణుండు హనుమత్ప్రభావంబును లక్ష్మణుండు పునర్జీవితుం డగుటయు నెఱింగి వెఱంగుపడి వ్యాకులంబున మునింగి తన మూలబలంబునకుఁ గదనంబునకుఁ జన నాజ్ఞయిచ్చిన. 219

తే. పుట్టనుండి యుసిళ్లగుంపు లెటువెడలి
మిన్ను మన్నేకముగ నిండి మెలఁగ దొడరు
వానకాలంబునందటు భయదమూల
బలము వెల్వడె నొక్కతుపానుభంగి. 220

తే. భూరజంబులకైనను బోఁగులెక్క
తారకారాశికైనను దనరుగణన
కాని రావణుమూలరాక్షసులసంఖ్యఁ
దెలియఁగాఁజాలఁ డాబ్రహ్మదేవుఁడైన. 221

ఉ. అక్కరణి న్మహాబలసమన్వితులైననిశాటకోటి పెం
పెక్కినబాహుదర్పముల నెల్లవనాట దళంబుఁగప్పి యొ
క్కొక్కని బెక్కుదైత్యులు మహాగ్రతఁబట్టి వధింప వాన
రుల్, దిక్కును మొక్కుఁగానక చలించి నశించిరి వేనవేలు
గాన్. 222

ఉ. ఎట్టియుపద్రవం బిది మహీ న్మటకర్ణసురేంద్రజన్ముఖుల్
గిట్టిరి దైత్యులెల్లరును గీడ్పడి వ్రాలి రిఁక న్దశాననుఁ

బట్టివధించు రాముఁడు వనాటులపాటులు తీఱెనంచు ను
న్నట్టితఱిన్ గపిప్రళయ మాగతమయ్యె నహో యిఁకెట్టులో.

చ. అని కపులెల్లరు న్బహుభయంబునఁ బారి నరేశువెన్కకున్
జన, రఘువీరుఁ డేఁగలుగ జంకఁగ నేల యటంచు నిష్ఠురా
శనులనుబోలుఘోరతరసాయకవృష్టిని ముంప వేనవే [ల్.
లని మొనవ్రాలుచుండియు ననంతములై యెదిరించి రాసుర.

ఉ. రాముఁడు ఘోరదానవవిరాముఁడనన్నర మొక్కఁటన్ విశే
షామరవైరులన్ గెడపు చారణధారుణిఁ బీన్గుపెంట లు
ద్దామతరోష్ణరక్తముల ధారలు నింపుచు నున్న రాక్షస
స్తోమము నల్గెలంకులను జుట్టియెదిర్చె నృపాలుశేఖరున్. 225

వ. అంత శ్రీరాముండు రాక్షసులపై సమ్మోహనాస్త్రంబుఁ
బ్రయోగించినఁ దత్ప్రభావంబున. 226

క. దానవు లొండొరులన్గని
మానవపతి వీఁడె యంచు మహితాయుధసం
ధానంబుల నొండొరులన్
బూని వధించికొనిపడిరి భూతలమందున్. 227

వ. ఇట్లు రాముని సమ్మోహనాస్త్రప్రభావంబునఁ దమలోఁబా
మొండొరుల నాయుధప్రయోగంబునఁ గొట్టికొనియు
శ్రీరాముని ప్రచండశరవృష్టిఁ దగుల్కొనియు రావణుని
మూలబలంబంతయు హతంబుకాఁ, దొండంబులు తెగి నేలం
బడి గిజగిజకొట్టుకొనుచు గిట్టుకరీంద్రంబులును, దలలుపగిలి
పండ్లుగిట్టకఱచుకొని త్రెళ్లుహయంబులును, గరచరణాదులు
తెగి మరణావేదనంబడుచును రక్తధారలు గ్రక్కుచును
ధాత్రిఁబొరలు భటులును, విఱిగికూలిన రథంబులును, తెగి

యెగిరి యెగిరి పడుకరచరణశిరోరస్థలభాగంబులును, రుధిర ప్రవాహంబులఁ గొట్టికొనిపోవు శవంబులును గలిగి కదన స్థలంబంతయు బీనుంగుపెంటలచేతను రక్తప్రవాహంబుల చేతను నిండియుండె నత్తఱి హతశేషులు పాఱి లంకఁజొచ్చి. రావణునితో విన్నవింప నాతండు విచారించి యింకఁ దన నిధనంబు నిశ్చయంబని తలంచియుండె నంత లంకాపురం బంతయుఁ శోకధ్వనులతో మార్మ్రోగె నెట్లనిన. 228.

సీ. అయ్యయ్యయో నావిభుఁ డడఁగిపోయె నటంచు
ధాత్రిపైఁబడియేడ్చుతరుణి యొకతె
యక్కటా నాసుతుఁ డనిఁగూలె నని బొమ్ము
బాదికొంచు వగచుపడతి యొకతె
యహహా! నాయన్న రణావనిఁబడెనని
కన్నీరుఁగార్చెడుకాంత యొకతె
మొఱ్ఱొ మదాలయంబునఁ గలపురుషులం
దఱుఁ ద్రెళ్లిరని కుందుతెఱవ యొకతె

తే. తండ్రికొఱ కొక్కయింట భ్రాతలనుగూర్చి
యొక్కయింటను సుతులకై యొక్కయింట
నిట్టులింటింట మహితశోకైకరవము
పుట్టి వ్యాపించె రావణపురమునిండ.

క. రామాఖ్యుఁ గాలరుద్రుఁడొ
తామరసదళాక్షుఁడో విధాతయొ నరుఁడై
భూమి నిటు బొడమి దైత్య
స్తోమవినాశంబుఁజేయు చొప్పు కన నగున్.

తరల:—

ఇతఁడు వేసెడుబాణ మొక్కటెట నెందఱైనమహాసురుల్
క్షితినిఁ గూలెద రీతని న్దరిఁజేర నాసురశస్త్రసం
ప్రతతు లబ్జభవుండు లోక మరాతిసంబొనరింప ని
య్యతనిఁజేసెనొ లేనిచో నిటు లద్భుతస్థితు లొప్పునే 231

సీ. సోదరహితమంత్రి సుతులెల్ల రనిఁబడి
రింక గెల్చునె దానవేశ్వరుండు
రెండుసారులు తానె భండనంబున నోడె
నింక గెల్చునె దానవేశ్వరుండు
చచ్చినశాత్రవుల్ చెచ్చెర మనుచుండ
నింక గెల్చునె దానవేశ్వరుండు
వీరులందఱు రఘువీరుపాట్టనఁబెట్టె
నింక గెల్చునె దానవేశ్వరుండు

తే. లేఁడు మొలత్రాడుగలమగవాఁడు లంక
నతివలనుగూడఁ నిఁక ననికంపునేమొ
యెంద తేలీలఁదెల్పిన నీఁడు సీత
చావ నెంచిన నిఁకనైనఁ జావరాదె. 232

వ. అని పలుతెఱంగులఁ బలుకుపురాంగనల శోకధ్వానంబు లాలించి యేమియుఁ దోఁపక దైత్యేశ్వరుండు తనకులగురు వగు శుక్రాచార్యునొద్ద కేగి తనదురవస్థ లెఱింగించిన నాతండు జాలిఁజెంది శత్రువిజయైకసాధనంబగు పాతాళ హోమక్రమం బుపదేశించి దానిని నిర్విఘ్నముగ నొనర్పు మని తెల్పి పంపిన రావణుం డేతెంచి హోమం బుపక్ర మించిన. 233

ఉ. ధూమము మింటఁబర్వఁ గని తోడనెవచ్చి విభీషణుండు శ్రీ
రామునితోడ మిమ్ముల దురంబున గెల్వఁగ దైత్యనాథుఁడు
ద్దామతరంపుహోమ మొకదానిని బూనినవాఁడు వానర
స్తోమముఁ బంపి తద్గతవిధుల్ చెఱిపింపుమటంచుఁ బల్కెనన్.

గీ. రాముఁ డంతట వానరస్తోమములను
వేగఁ జని రావణుని హోమవిధులఁ జెఱిపి
రం డటంచన వారతిరయముతోడ
వెడలి చేరిరి పాతాళవివరగుహను. 235

మ. అటఁ గాపున్న నిశాటవీరవరు లుద్యత్ఖడ్గము ల్దాల్చి దిక్కట
ముల్ వ్రయ్యఁగ నార్చుచున్ బయిపడంగా వానరశ్రేణులు
ద్భటశౌర్యంబున వారల న్దరుశిలావ్రాతాళిచేఁ గూల్చి
యం,తట దైత్యేశుని హోమమున్ జెఱుపఁ జెంతన్ జేరి
దుర్వారులై 236

సీ. సమిధల నల్దిశల్ చల్లిపారఁగవైచి
నెత్తురుకుండల నెత్తికొట్టి
యగ్నికుండములలో నంబుధారలువోసి
నైవేద్యవస్తువుల్ నమలిమ్రింగి
నేతికుండల దైత్యునెత్తులపై వెల్చి
తలలమీఁదను పెద్దశిలలనిల్పి
జుట్టుక్రిందను నగ్గిపెట్టి మంటలునేసి
చెట్టుకొమ్మలచేతఁ గొట్టి కొ
తే. యెంతఁ గలఁచిన నాదను జేశ్వరుండు
రాతిగతి నిశ్చలుండయి క్రాలఁ గాంచి

తారకోడు కట్టి రావణాంతఃపురంబుఁ
జొచ్చి మండోదరీసతిఁ జూచి డాసి.

క. పడఁతుక వేణీబంధము
వడిఁబట్టి దశాస్యుఁ డున్న వాటికి నార్తిన్
విడువక తెచ్చి నిలుపఁ జే
రడలున నిట్లేడ్చె సతి మహార్తధ్వనులన్.

సీ. పతిపరోక్షమున నాక్షితిజఁ దెచ్చితి వప్డు
నీమ్రోలన న్నేఁడు నిల్పె నిప్డు
జీవంబుతోడుత నీవు రాజిలుచుండ
నీదురవస్థ నాకేగుదెంచెఁ
బత్నిఁబట్టిన దుష్టవానరుఁగూల్ప ని
యీనిష్ఠ యేశుభ మిచ్చు నీకు
నాసుతుఁ డమ్మేఘనాదుండెయుండిన
నిట్టిదుర్బాధ నాకేలవచ్చు
తే. నొరుఁడు కన్నెత్తి కనరానియువిద నన్నుఁ
గోతివాఁ డొక్కఁ డిట్టులఁ గొప్పుఁబట్టి
యీడ్చి తెచ్చుటకంటెను హీనగతులు
కలవె యేటికి నీతపోబలము బలము.

వ. అని పెక్కుభంగులనేడ్చు తనసుందరి శోకారావంబు లాల
కించి ప్రచండక్రోధంబున రావణుండు ఖడ్గంబున నంగదుఁ
గొట్టి మూర్ఛవ్రాల్చి తక్కినవానరుల శరవృష్టి జర్ఝరి
తాంగులఁజేయ వారలు హోమంబుచెడెనని చెలంగుచుఁ
బాఱి శ్రీరాముని సన్నిధానంబుజేరిరి. మండోదరి యంతః

పురంబుఁ బ్రవేశించె రావణుండు రణభేరి మ్రోగింప నాజ్ఞా
పించె నంత. 240

క. రావణుఁ డనికేగెడుపని
భావించు నెఱింగి యతని భామ హితోక్తుల్
దా వెరవునఁ బల్కుటకై
వేవచ్చెను నాథుఁ గాంచు వేడుకతోడన్. 241

వచ్చి పతిఁగాంచి యయ్యయో ప్రాణనాథ
యేమి యీవెఱ్ఱి మీమది కింకనైనఁ
దోఁపదయ్యె యథార్థంబు దుర్జయుండు
రాముఁ డాతనితోడ వైరంబుతగునె.

సీ. రాముఁ డాశ్రీహరి రమణి జానకి లక్ష్మి
యని యెందఱన్నను వినవదేల
హితులైనవారెల్ల హతులగు టెఱిఁగియు
విమతభావం బింక విడువవేల
స్వయముగ నీవె యాజనపాలుదోస్సార
మెఱిఁగియు జానకి నీయవేల
యఘటితఘటనమై నట్టిసేతువు నెంచి
యైనరామునిశక్తి నరయవేల
తే. నీవు రాముని జంపఁగలేవతండు
చంపు నినుఁగానఁ దెలిసియుఁ జావనేల
క్ష్మాజ రామున కిచ్చి రాజ్యంబువిడచి
పోద మెటకైన రమ్మని పొలఁతి పలుక.

క. పడఁతీ విను మీరాముఁడు
జడధిశయనుఁ డనియు లక్ష్మి జానకి యని యా

తేఁడు నన్ముఁ జంపెడునని యే
ర్పడ నెఱిఁగియు ము క్తి కీసరణి నొనరించితిన్.
గీ. చాన మన కిదియే కడసారిచూపు
వహ్నిఁగూలెదొ లేక యివ్వసుధమనెదొ
తీఱె ఋణమింకఁ బొమ్మని తెలుప నంపి
వెడలె సేనలతోడ నవ్వీరవరుఁడు.

సీ. ఖడ్గాగ్ని వృశ్చికకాలాహిరోమాది
ఘనతరవీరు లగ్రమునసాఁగ
కరిహయరథసైనికశ్రేణు లెల్ల ర
గ్రక్రమంబొప్పఁ బార్శ్వములరాఁగ
పటహభేరీశంఖభయదనినాదముల్
బ్రహ్మాండ మవిసెడుభంగి మ్రోగ
వందిమాగధులకై వారముల్ సేనల
కలకలధ్వనులు దిక్కులను మూఁగ
తే. మేఘమండలసమమైన మేటిరథముఁ
గాలకేయుండు తోలంగఁ గడిమి నెక్కి
దుష్టశకునంబులకు మదిఁ దొట్రువడక
రాముఁ దాకంగ వెడలె నారావణుండు.

వ. అంత ధనుశ్శరఖడ్గగదాదిసాధనంబులఁ దాల్చి దానవులును, దరుశిలాదులఁ బూని వానరులును దలపడి పోరి రందు. 247

సీ. ఖడ్గరోముం డుగ్రగతిఁ దాకి మారుతి
చేతిశిలాహతిక్షితినిఁగూలె
నహిరోముఁ డంగదు నని దాకి తన్ముష్టి
హతులచే ధారుణియందు వ్రాలె

వృశ్చికరోముఁడు పృథుశక్తిఁ బోరాడి
నీలునిచేతఁ బ్రాణాలుతూలె
నగ్నిరోముండు మెండగచరులవధించి
రామునిశరవృష్టి భూమిసోలెఁ
**తే.** దక్కు దానవవీరులు తరుచరాళిఁ
దాకి భూతలిఁ ద్రాలిరి దానవేశుఁ
డంత రథమును రాముపై కడరఁజేసి
యామహామహుతోడ నిట్లని వచించె.

**ఉ.** అల్పులఁ గొందఱన్ దునిమి యాత్మను బొంగుచు నుందు వీవహో, వేల్పుల నందఱన్ గెలిచి వెట్టిగ్రహించిన నాప్రభావముఁ, బోల్పఁగ లేక సింహమును బోరునఁ దాకుగజేంద్ర మట్లనిన్, సల్పఁగవచ్చి తియ్యసురనాథుఁ డసాధ్యుఁడు నీకు వధ్యుఁడే. 249

**చ.** మనుజుఁడ వీవు, తన్మనుజమండలభుక్కును నేను, సత్తపం బెనయనివాఁడ వీవు నుతికెక్కుతపోబలశాలి నేను, నన్ జెనకఁగ నీకు సాధ్యమగునే వనభూముల నాకలంబులన్ దిని బ్రతుకంగ లేక చనుదెంచితి, చచ్చెదు సుమ్మి రాఘవా.

**ఉ.** ఇంటను గెల్వలేనినరుఁ డేగతి రచ్చలగెల్చు, తండ్రియే గెంటెను దుష్టుఁడంచు నిను కీడ్పడ కియ్యెడ నిల్వఁగల్గుదే తుంటరి వీవు, కానియెడఁదోడ్కొనివత్తువె కోఁతిమూఁకలన్ గొంటుతనంబు నాయెడలఁ గుంఠితమొందక కూడివచ్చునే.

**చ.** వననిధిలోనఁ జేరినను బర్వతరాజము క్రిందదూఱినన్ మొనసి ధరిత్రినక్కినను భూతఁపురూపముఁ బూని నిక్కినన్

వినయముతోడ మ్రొక్కినను వెంగలిభూపులనుక్కడంచినన్
వనచరకోటి నెంతఁ గొనివచ్చిన నిన్ననిఁ గూల్పకుందునే.

మ. అనరణ్యుండను నీదుపూర్వుఁ డిటులే యత్యుగ్రగర్వంబునన్
ననుసాధింపఁగ వచ్చికూలె ననిలో నస్మద్గదాసంహతిన్
మనుజేశా! యది చాల కుగ్రతరమా మద్బాహుశక్తినవిన్
గొనఁగావచ్చితె చచ్చిపోయెదుసుమీ ఘోరాహవక్షోణి
లోన్. 253

గీ. కొందరథములు నిన్ననుకొనెడురీతి
నీవు హరివైన నాపేర నెగడునట్టి
కప్పవా కోఁతివా తురగమవ చెపుమ
హరికిఁ జెనకఁగవచ్చునే యసురసింహు. 254

సీ. చతురాస్యుఁడ నటంచు మతిని బొంగెదవేమొ
చతురాస్యుఁడు దశాస్యుసాటి యగునె
యలచతుర్భుజుఁడనం చనెదవేమొ చతుర్భు
జుండు వింశతిభుజుఁ జెండఁగలఁడె
ముక్కంటి నేనని మురిసెదవేమొ ము
క్కంటి యిర్వదికండ్లఘనున కెదురె
మనుజవరుండ నేనని గర్వపడెదేమొ
మనుజుండు మనుజభుక్కునకు సరియె
తే. కాన నీవెట్టిఁడైన నన్నడపఁగలవె
యేల చచ్చెద వూరక యాలమందు
మరల సీతను బడసెడు మమతవిడచి
యింతతోనైనఁ బొమ్ము జీవేచ్ఛయున్న. 255

సీ. కైలాసగిరిబంతి గతినెత్తి యాడించి
నట్టి నాముద్రోల నీవనఁగ నెంత
యమరేశుఁబట్టి దిగంతకీర్తిని ముట్టి
నట్టి నాముద్రోల నీవనఁగ నెంత
యక్షుల నిర్జించి యక్షేశుఁ దరలించి
నట్టి నాముద్రోల నీవనఁగ నెంత
యవనీశవరులఁ బ్రాణాహుతులుగఁ గొన్న
యట్టి నాముద్రోల నీవనఁగ నెంత
తే. పుట్టనున్న ట్టిఫణిఁబైకి నెట్టినటుల
వచ్చి నను రేపి తింక నీపాట్లుసూడు
యాటలనుకొంటివేమొ నాయాహవంబు
నర్కవంశవనోగ్రదావానలంబు.

క. నరులకగోతులమూఁకల
దురమున దాకంగ సిగ్గుదోఁచు నను చిటుల్
సురవైరి పలుక విని భూ
వరుఁడనె మందస్మితాస్యభాస్వరుఁ డగుచున్.

శా. ఔరా రావణ నీదువాక్యములు సత్యంబుల్ భవద్భూరిదో
స్సారం బేమును రెండుసార్లు చవిగాంచ న్గల్గితి న్నన్నరుక్
బోర న్దాకియు నిల్వ సిగ్గొదవి కాబోల్ పాఱితీవట్లు నీ
ధీరత్వంబును జూపి సిగ్గున ధరిత్రిం బ్రా

సీ. కైలాసగిరిక్రిందఁ గరము లిఱికిరాక
యఱచి యఱచి రావణాఖ్యఁ గనుట
యింద్రునిచేఁ జిక్కి యెట్లో నీసుతు దొంగ
పోటున బంధవిముక్తిఁగనుట

యమ రేంద్రసుతునకు నర్జునునకు నోడి
దీనతసంధి నర్థించికొనుట
దర్పించియేగి శ్వేతద్వీపసతులచే
మృతిఁదప్పి యెట్టులో బ్రతుకుఁగనుట
తే. యన్న నిర్వేడలించి దుర్యశముఁగనుట
యిట్టి నీదుప్రతాపంబు లెన్నొ వింటిఁ
బెక్కునోర్లంటఁడంబముల్ ప్రేలుకొనకె
బాహుబలముండ శుష్కవాక్పటల మేల.

చ. చెలువుగ బ్రహ్మయిచ్చిన యశేషవరంబులు తీరు నేటితోఁ
బలుకులు చాలు నింక సలుపందగుయుద్ధమటన్న రావణుం
డలుకశరాగ్నికీలల జనాగ్రణిముంప నతండుతచ్ఛరం
బుల ధరవ్రాల్చుచుఁ బొదివె భూరిశరావళిచే దశాననున్.

మ. అరదం బెక్కి దశాస్యుఁడుఁ వసుధపై నారాముఁడుఁ
నిల్చి సంగరము జేయుచునుంటఁ గాంచి యనురాగంబొప్ప
దేవేంద్రుఁడా,నరనాథు న్గొలువఁ సహస్రహయమాన్యంబౌ
నిజస్యందనంబు రహిం న్బంపఁగ దానినెక్కి రఘురాముం
డుగ్రసంగ్రాముఁడై. 261

వ. ఇట్లిరువురవు రుజ్జ్వలరథారూఢులై సవ్యాపసవ్యంబులఁ
రథంబులఁ బఱపుచు నొండొరులదివ్యాస్త్రంబుల నొప్పించి
కొనుచు నొకనిశరంబుల నొకరుఖండించుచు సింహశార్దూ
లంబుల భంగి గిరీంద్రయుగళంబుపోలికజంకుగొంకు లేక వెను
దీయని పరాక్రమంబుల ఘోరంబుగాఁ బోరుచుండ భండ
నంబులు మాని చిత్తరువురీతి నిలచి యుభయసైన్యంబులును

వియత్తలంబున విమానంబు లెక్కి వచ్చి దేవతాగణంబులును జూచుచుండి రంత. 262

సీ. ఉరగాస్త్ర మసురుండు పఱపిన రాముండు
గరుడాస్త్రమున దాని ధరణిఁగూల్చె
నానలాస్త్రమును దైత్యుఁ డడరింప రాముండు
వరుణాస్త్రమున దాని వసుధఁ గూల్చె
రాక్షసాస్త్రము దైత్యరాజేయ రాముండు
గాంధర్వమున దానిఁ గడఁగి త్రుంచెఁ
బర్వతాస్త్రమును రావణుఁ డేయ రాముండు
వజ్రాస్త్రమున దాని వ్రయ్యఁజేసె
తే. రావణుండు త్రిశూల ముగ్రముగ నేయ
రాఘవుఁడు వైష్ణవంబున వ్రాల్చె దాని
నిటుల నొండొరు లస్త్రంబు లేసియేసి
చటులశరవృష్టిఁ గురిపింప సాగిరంత. 263

వ. ఈలీల రామరావణులు రోదోంతరాళంబంతయు శర వృష్టిచే నిండ సప్తాహోరాత్రంబు లెడములేక నిద్రాహారంబులు మాని పోరుచుండ రాముండు కరంబులు బెండువడి నిశ్చేష్టితుండై రథంబుపై నుండ రావణుండు దశకోదండంబులెత్తి చండతరకాండధారలఁ గురిపించుచు డాయ జగంబులు భీతిల్లెనయ్యెడ నగస్త్యుం డేతెంచి శ్రీరామున కాదిత్యహృదయం బనుమహామంత్రం బుపదేశించిన నంత రెండవకాలరుద్రుం డగుచు రాఘవుండు బలాతిరేకంబున విజృంభించి. 264

క. రాముఁడు నిర్ఘాతోపమ
భీమశరంబులను దైత్యవిభు నొప్పింపఁ
గా మేనువ్రయ్య నాతఁడు
భూమిపయిఁ మూర్ఛబడెఁ గపులు చెలఁగంగన్. 265

వ. మూర్ఛిల్లి యెట్టకేలకు లేచి ధైర్యసాహసంబులతో రాము
నిపైఁ గవిసి యాతని నస్త్రధారల ముంచుచుండె నంత
రాముండు. 266

క. బలవదశనిసమబాణం
బులచే రావణునికంఠముల నేయంగాఁ
దలలు తెగి పడియు దైత్యుఁడు
చెలువంబుగ నొప్పుచుండె శిరములతోడన్. 267

క. అట్టులనె బాహుశాఖలు
గుట్టలుగాఁ దెగి ధరిత్రిఁ గూలుచు నున్నన్
దిట్టముగ నుండె నెప్పటి
యట్టుల వింశతికరంబులసురుని మేనన్. 268

క. మఱియును శిరస్సమూహము
ధరణీశునిశస్త్రనిహతి దానవు మేనన్
దొఱఁగి నలువంకలన్బడి
వరుస దొరలుచుండెఁ దాళఫలములభంగిన్. 269

సీ. మింటిపైకి నెగసి మేదినిబడుఁ గొన్ని
మంటిలోపల దూఱి మ్రగ్గుఁ గొన్ని
వానరులను దాకి వసుధఁగూలును గొన్ని
వడి సీతముందఱ వ్రాలుఁ గొన్ని

సురలవిమానముల్ సొచ్చి తాకును కొన్ని
యంబుధిలో వ్రాలి యడఁగుఁ గొన్ని
రామునిరథముపై వ్రాలుచుండును గొన్ని
సౌమిత్రిపైఁబడి సమయుఁ గొన్ని

తే. కొన్ని రాముని దిట్టెడుకొమరుదోఁపఁ
గదఁపుఁబెదవులఁ గొన్నియుగ్రముగఁ జూచు
నిటుల దైత్యశిరంబులు చటులసంఖ్య
బ్రోగువడుచుండెఁ గొండలపోల్కి వసుధ. 270

క. కరములు తెగియు న్దాల్చిన
వరశస్త్రము లరులమీఁద వైచి మఱి పడుఁ
స్ఫురియించు నూత్న బాహువు
లరుదుగ సాయుధములగుచు నసురుని మేనన్. 271

వ. ఇట్లు దానవుశిరఃకరంబులు వేలకొలందిఁ దెగిపడుచున్నను బూర్ణాంగుండై యాతండు రణం బాచరించువిధంబుఁ గని కలంగి రాఘవుం డిట్లు శంకించె. 272

చ. శరములచేతఁ జావఁడొకొ చంపఁగలేనొకొ నేను వీని, సుస్థిరతరజీవియో యితఁడు చేడ్పఁడ డెన్నిమహాస్త్రజాలముల్ పరపిన నింద్రజాలమొ యవారిత రాక్షసమాయయో శిరఃకరములు వ్రాలుచుండియును గ్రాలెడి నీతఁడు పూర్ణదేహుఁడై. 273

వ. అని వ్యాకులం బందుచుండ విభీషణుం డరుదెంచి స్వామీ! వీని నాభియందు బ్రహ్మవరంబున నమృతకలశంబు విరాజిల్లుచుండుటచే వీని శిరఃకరంబు లీరీతిఁ దెగినకొలంది నుద్భవించుచున్నయవి. కావ నొక్క దివ్యాస్త్రంబున వీనినాభి

యందున్న యమృతం బింకించి యావల నూటనొక్క పారులు శిరఃకరంబులు ఖండించిన నవి ఘటి మొలవక వీఁడు చచ్చునని తెల్పిన నింటిగుట్టు లంకకుఁ జేటయ్యె. రాముండు రావణప్రాణనాశనక్రముండై కదసె నంత. 274

క. అతిగోప్యం బగుమర్మ
స్థితిఁ దెల్పెను వీఁడటంచుఁ దీఅనికోపా
ద్ధతి నవ్విభీషణునిపై
నతులితఘనశక్తివైచె నసురుం డంతన్. 275

స్వాగతవృత్తము:—

రాముఁ డాదనుజరాడ్వరశక్తిఁ
భీమకాండమునఁ బృథ్వినిగూల్చెఁ
దామసాంబకము దైత్యుఁడు వైవం
గా మహీవరుఁడు ఖండనసేసెన్. 276

పంచచామరము:—

బిరాన రాఘవేంద్రుఁ డొక్కభీకరాస్త్ర మేసి యా
సురారినాభియందు వెల్గు శుద్ధసత్వధారనం
బరుల్ కలంగఁగా హరించి నంతటన్ రథంబుపై
గరంబు సత్వమార్చి పంక్తికంధరుండు మూర్ఛిలెన్. 277

వ. అంత నాదైత్యేశ్వరుం డెట్టకేలకుఁ దెలిసి యింకఁ దన నిధనంబు సన్నిహితం బయ్యెనని నిశ్చయించి ధైర్యసాహసంబులు వహించి మోహౌయత్తమనస్కుండై శ్రీరామునిపై దృష్టివీడక ఘోరంబుగాఁ బోరుచుండ రాముండు నూటొక్కసారులు శిరంబులను బాహువులను ఖండించె నంత.

క శిరములు కరములు వ్రాల రు
ధిరఝరు లుగ్రంబులయి పృథివిం బ్రవహింపన్
సురవైరి స్రుక్కియును సు
స్థిరధైర్యముతోడ రణముసేయుచు నుండెన్. 279

ఉ. ఆరజనీచరేశుఁడు నిజాంగమునన్ రుధిరప్రవాహముల్
దోరముగా స్రవించుచును దుర్జయలీల ధనుఃకళావిదుం
డై రణ మాచరించువిధ మారసి రాముఁడు వీనిఁబోలు దు
ర్వారబలుండు సృష్టిఁ దనరన్గలఁడే యని యెంచె నివ్వెఱన్.

క. తల యొకటి రెండు చేతులు
నిలిపిన రక్తంబుమేన నీరంధ్రముగా
వెలువడుచున్నను దైత్యుఁడు
వాలివోనిపరాక్రమమునఁ బోరుచునుండన్. 281

ఉ. నీరజసంభవాస్త్రమును నీరజమిత్రకులుండు సాధు దు
ర్వారభయంకరుండయిన రావణువక్షము నాటనేసినన్
ఘోరతరధ్వనిన్బడియె క్షోణిని దానవభర్త శోకహ
ర్షోరురవంబు లాసురసురోత్కరముల్ వరుసన్ ఘటింపఁగన్.

ఉ. వెల్లుగ మ్రోగె దుందుభులు వెల్లువలై రఘురాముమీఁద
నుత్ఫుల్లసరోజవర్షములు తోరముగాఁబడె దేవకాంతల
తుల్యల్లసగానముల్ సలుపు చొప్పుగ నాడిరి జానకీపతీ
వల్లభు నెల్లలోకములు ప్రస్తుతిసేయఁదొడంగె నొక్కటన్.

వ. శ్రీరాముండు విల్లెక్కుడించి తమ్మున కొసంగి మారుతిన్ జీరి
నీవు సీతకడకేగి రావణవధంబుఁ దెల్పిరమ్మన నాతం డట్ల సేసె
నంత బ్రహ్మరుద్రముఖ్యలోకపాలురెల్ల రేతెంచి శ్రీరాము
నిచే నమస్కృతులై వేవిధంబుల వినుతించి రెట్లనిన. 284

రగడ:—

శ్రీమన్మునిహృత్సేవితరామా
కామితనిత్యసుఖప్రదరామా
వ్యామోహోద్ధురబంధవిరామా
భీమభవౌఘవిభేదననామా
సునిశితనవసుమశోభితదామా
దనుజచమూనిర్దళనోద్దామా
వనజమిత్రకులవారిధిసోమా
మునిజనహృదయాంభోరుహధామా
జయజయదుష్టనిశాచరహరణా
జయజయసరసిజసన్నిభచరణా
రావణాదిదుర్దానవక్షయము
గావించి ధరణిఁగప్పితి వభయము
జలనిధిగర్వము శరమున నడఁగుట
దెలిపెను నిను నాదిపురుషుఁడవగుట
పలుగుఱాతి నొకపడఁతిని జేసితి
సలుపఁగ నొరులకు సాధ్యమె యీగతి
బనులొనర్చెను బ్లవగసందోహము
నిను హరి వనుటకు నిస్సందేహము
శిలలను దేలించితి వంభోనిధిఁ
దలఁప జగత్కర్తవు కరుణానిధి
ధరణియందు సద్ధర్మము నిలుపఁగఁ
దెరలితివి జగద్విభుఁడవు తలఁపఁగ
సాధురక్షణము సల్ప జనించితి.

మాధవుఁడవు దుర్మార్గు హరించితి
మమ్ముల సత్కృప మన్ననసేయుము
నెమ్మది నీపద నిష్ఠనుబాయము
హస్తివరప్రదహతభవపాశా
స్వస్తిజగద్రక్షకసర్వేశా. 285

చ. జగముల కీమహాసురుని చావతిసౌఖ్యదమయ్యె నీకు నె
న్నఁగఁదగుకార్యమా యిది, ఘనంబున నెంచినమాత్ర లోకము
ముల్, దగఁబొడముచు నశించును విధాతకుఁ దండ్రివి నీవు,
మమ్ముఁ బ్రోవఁగ రఘురాముఁడైతి విభవన్మహిమంబు
నుతింప శక్యమే. 286

వ. అని యిట్లనేకవిధంబుల వినుతించి రామా! యవాప్తసమస్త
కాముండ వగునీకు మేము వరంబొసంగెద మనుట నిజంబు
నకు వేడబంబె యైనను నీభగవన్మహిమంబు మఱుంగువెట్టి
నరుండైతివి కాన నీకు మేమేదైనఁ గామితార్థం బొసంగి
కృతార్థులము కాఁగోరితిమి వరంబుఁ గోరుమన శ్రీరా
ముండు నన్ను శ్రీహరి యని పల్కఁదగ దేను దశరథరాజ
పుత్త్రుండ నరమాత్త్రుండనని విన్నవించి మీరలు నాకు
వరదు లయ్యెదరేని యీకదనంబునఁ బడిన వనాటుల బ్రతి
కింపుఁడనఁ జతుర్ముఖునానతి సురేంద్రుం డమృతవృష్టిఁ గురి
పించె నంతఁ గుంభకర్ణుం డాహరించినవారలు తప్పఁ దక్కిన
వానరులెల్లరుఁ బునర్జీవితులై చెలంగిరి. 287

తే. అంత మండోదరీముఖాద్యసురసతులు
వచ్చి పరిపరివిధముల వంతలొందు

నట్టితఱి నవ్విభీషణుఁ డరుగుదెంచి
యన్నపైఁబడి దుఃఖించె నతిశయముగ. 288

వ. అంత విభీషణుండు రావణునకుఁ బరలోకక్రియ లాచరింప శ్రీరాముండు లక్ష్మణు న్బంపి విభీషణునకు లంకారాజ్యాభిషేకంబు సేయించె. విభీషణుం డమూల్యమణిఖచితస్వర్ణాభరణాంబరంబులఁ దెచ్చి శ్రీరాముని గ్రహింపుమనికోర నామహాత్ముండు తనకొఱకు భరతుం డచట వల్కలాజినధారియైయుండఁగా నలంకారంబు లొల్లనని చెప్పి కపివీరుల నాదరింపుమన నాతం డట్లచేసె. నంత రాముండు ధరణీసుత నలంకృతఁజేసి తెమ్మన నవ్విభీషణుం డాసాధ్వికడకేగి రామాజ్ఞఁదెల్పి యామెకు మంగళస్నానంబు లొనరించి సర్వాభరణభూషితఁజేసి శిబికారూఢఁజేసి వానరులెల్ల రాకాంతఁజూడ మూగుచుండ శ్రీరాముని సన్నిధికిఁదెచ్చి నిల్పె నంత నాజానకీదేవి. 289

ఉ. రామునకుఁ బ్రదక్షిణము రాజిలవచ్చి యొరంగి నాదుపూర్వామలకర్మరాశి నహహా మిముఁ బాసితినన్న నాతఁ డో
భామరో నిన్నుఁబట్టిన విపత్కరుఁ ద్రుంచితిఁ దీఱె నాపనుల్
నీమదికొప్పుచోట నిఁక నిల్వుము నేనిను నొల్ల జానకీ. 290

ఉ. దానవుఁ డాలిఁ గొంచుఁ జన దర్పవిహీనతఁ గెల్వఁ జాలకి
మ్మానవుఁ డూరకుండె నవమానము కోరిచి యంచు లోకసం
తానము సేయునిందలను దప్పి చరింపఁగ దైత్యుఁ ద్రుంచితిఁ, గాని నిను న్గ్రహించుటకుఁగా దిఁకఁ బొమ్మెటకైనఁ
జానరో. 291

చ. అన సతి యేడ్చు చిట్లనియె నర్కకులేశ్వర! నాదువర్తనం
బు నెఱిఁగియుండి యిట్టులనఁబోలునె మీమదిఁ శంకగల్గుచో
ననలముఁ జొచ్చెదన్ గలుష నైన నశించెద లేక సాధ్వినై,న
నిలచియుండుఁగాన రఘునందన నగ్నిని బేర్పఁబంపుమీ.292

వ. అని జానకి ప్రార్థింప రాముని కనుసన్న యెఱింగి లక్ష్మణుం
డచ్చట నగ్నిని స్థాపించి జ్వలింపఁజేసిన. 293

క. త్రిజగజ్జనని పదంబుల్
భజింపఁదగుభాగ్య మింకఁ బ్రాప్తంబగు నా
వృజినములు పాయునని స
ప్తజిహ్వుఁడు వెలింగె మెండు జ్వాలలతోడన్. 294

వ. అంత సీతామహాలక్ష్మి శ్రీరామునకును వీతిహోత్రునకును
బ్రదక్షిణనమస్కారంబు లొనర్చి యగ్నియెదుట నిలచి
యిట్లనియె. 295

క. అన్నా పాతివ్రత్యము
నన్నిలచినదాననైన ననుఁ గృపతోడన్
మన్నింపుము నాయెడ నఘ
మున్న న్దహియింపు మగ్నిహోత్రా యనుచున్. 296

వ. సీతాదేవి యమ్మహాజ్వాలామధ్యంబుఁ జొచ్చి తలపువ్వైన
వాడకుండఁ బూసికొన్న గంధంబైనఁ గమలకుండ, మేనుకసి
గందకుండఁ జెక్కుచెదరకుండ, సుఖాసీనయై యుండె నంత
నగ్నిహోత్రుండు తాఁబవిత్రుండయ్యు నాజగన్మాత స్పర్శా
ప్రభావంబున నత్యంతపవిత్రుండ నైతినని ప్రహర్షంబున
మిన్నుముట్టి వెలుంగుచుండె వానరదానవసంఘంబు లా
చారుణకృత్యంబుఁ గని తల్లడిల్లఁజొచ్చిరి. లక్ష్మణసుగ్రీవ

విభీషణాదులు హాహారవంబులుసేయుచు నేడ్వఁ దొడం గిరి. జలధులు కలంగె. సూర్యచంద్రులు గతులుతప్పిరి. పుడమి గడగడవడంకెఁ దారలు వ్రాలె నంత నజహరేం ద్రాదిసురలెల్ల రొక్కుపరుగునవచ్చి రామా! సూర్యునియం దంధకారం బుండనియట్లు జానకియందు దోషంబులుండవు నిప్పునకుఁ జెదలంటఁగలదే, జానకి నపరిగ్రహింపుమని ప్రార్థించి రంత నగ్నిహోత్రుండు మూర్తిభవించి సీతామహాలక్ష్మి నెత్తికొని జ్వాలామధ్యంబునుండి వచ్చి శ్రీరామచంద్రుని పాదంబులచెంత జానకిని డించి యిట్లనియె. 297

క. ఈతల్లి స్పర్శచే నే
నాతతపుణ్యుండనైతి నఘములు పాసెన్
భూతలనాయక యీమా
మాత నగ్రహియించి మమ్ము మన్నింపఁగదే. 298

వ. అని విన్నవించిన శ్రీరాముండు సీతాభిరాముండయ్యెఁ ద్రిలోకంబు లేకంబుగ హర్షించె దేవతలు మల్లికాదిసుగంధ కుసుమంబులు గురియించి శ్రీరామునకుఁ బ్రీతికరంబుగా స్వర్గంబునుండి దశరథు రావించి చూపింప రాముండు సీతా లక్ష్మణసహితుండై నమస్కరించి తండ్రిచే దీవనలంది హర్షించె నంత. 299

ఉ. రాముఁడు దానవేశ్వరుని రంజిలిచీరి భవత్సహాయసు శ్రీమహిఁ గూలె రావణుఁడు చెచ్చెర నింక నయోధ్యఁజే రఁగాఁ, బోమదిఁబుట్టె రేపటికి బూర్తి యగున్ వనవాసదీక్ష సత్వరమనుబంపుమీ మముఁ గుబేరువిమానముమీఁద నంచనన్. 300

క. అంత న్దానవనాథుఁడు
స్వాంతంబున నుబ్బియా లసత్పుష్పకమ
త్యంతప్రీతిని దశకం
ఠాంతకుకడ నిల్ప నలరె నాతం డంతన్. 301

శా. స్వామీ! మీయనుజన్ములన్ జనకుల న్సద్బంధులన్ జూడఁ
గా, నామోదించుచు నున్నవారము కృపాయత్తుండవై నెమ్మి
నీ,తో మమ్మున్ గొనిపోఁగదే యనుచు నెంతో వేడ్క నా
వానర, స్తోమంబుల్ దనుజేశుఁడు న్బలుక నాక్షోణీశుఁ
డొప్పెన్ గృపన్. 302

వ. అంత సుగ్రీవాంగదహనుమత్సుషేణనలనీలజాంబవత్పనసమైం
దద్వివిదగజగవయగవాక్షగంధమాదనకేసరిశతబలిప్రముఖ
వానరవీరులను విభీషణాదిదానవులను దమతోరా నాజ్ఞ
యిచ్చి తక్కినవానరదళంబుల మీసహాయంబున నాకు
జయంబు సిద్ధించె మీ కిహపరసుఖంబులు నిండారుగాత
యనిపల్కి పొమ్మని పంపించి. 303

క. సీతాలక్ష్మణయుతుఁడై
ప్రీతిన్గపివరులు దైత్యవీరులు గొలువన్
భూతలనాథుం డధిక
ఖ్యాతిన్ గౌబేరపుష్పకమునెక్కి వడిన్. 304

వ. నభోమార్గంబునఁ బోవుచు నింద్రజిత్కుంభకర్ణదశకంఠా
దులు కూలినచోట్లను వానరులుకట్టినసేతువును సీతకుఁ
జూపుచు వెడలి కిష్కింధానగరోపరి ముహూర్తమాత్రంబు
నిలచి తారా రుమాదిసుగ్రీవపత్నులఁ బుష్పకం బెక్కించి
కొని పోయిపోయి మున్ను దామున్నపంచవటిన్ జూచి

హర్షించి భరద్వాజాశ్రమంబుఁ జేరి యటఁ బుష్పకంబు డిగ్గి
యామునీంద్రునకుఁ దమవనవాసవిశేషంబు లెల్ల నెఱింగించి
హనుమంతుఁ జీరి రాముం డిట్లనియె. 305

ఉ. మారుతి నీవు వేగ మొకమర్త్యనిరూపముఁ దాల్చి యేగి
గంగోరునదీతటంబున గుహుం గని నాదగు రాకఁ దెల్పి నిం
డారెడు వేడ్క మాభరతు నారయ నందిపురంబుఁ జేరి మా
వారలఁ గాంచి మే మిటకు వచ్చినవార్త నెఱుంగఁ దెల్పుమీ.

వ. అని పంప హనుమంతుండు తత్క్షణంబ చని గుహునితో
రాముని యాగమనంబుఁ దెల్పిన నాతండు హర్షంబున
రామునిదర్శనంబునకు నువ్విళ్లూరుచుండె నంత మారుతి నంది
గ్రామంబుఁ జేరి రెండవ శ్రీరాముండో యన నొప్పు భరతు
న్గాంచి నమస్కరించి యిట్లనియె. 307

క. సీతాలక్ష్మణయుతుఁడై
ప్రీతిఁ శ్రీరామచంద్రవిభుఁడు భరద్వా
జాతతదివ్యతరాశ్రమ
భూతలి కేతెంచి యిటకుఁ బుత్తెంచె ననున్. 308

వ. అను సుధోపమానవాక్యంబులు విని తత్క్షణంబ భరతుండు
సింహాసనంబు డిగివచ్చి మారుతిఁ గాఢాలింగనంబుచేసికొని
యాతనికంఠంబున రత్నఖచితస్వర్ణహారం బొకటి వైచి
నరోత్తమా నాకు శ్రీరాముని క్షేమవార్త నెఱింగించి కర్ణ
రసాయనం బొనర్చితి నీఋణం బెట్లు తీర్చికొనఁగల్గుదు. మా
యన్న యీపదునాలుగేం డ్లెం దెందుఁ జరించె నేమేమి మహా
కార్యంబులు సేసెఁ దెల్పు మన నాంజనేయుండు సీతాపహ
రణసేతుబంధనరావణాదినిఖిలదుష్టరాక్షససంహారాదిమహా

కార్యంబులెల్ల సవిస్తరంబుగాఁ దెల్ప భరతుం డానంద భరితుండై రాముఁన కెదురేఁగఁ దలంచుచుండ వియత్పథం బున ఘంటారావంబు లెసంగఁ బుష్పకారూఢుండై వానర రాక్షససహితంబుగా సీతాలక్ష్మణయుతుం డగు శ్రీరాముం డేతెంచి పుష్పకంబు డిగ్గిన. 309

క. ఆతురుఁడై యాభరతుఁడు
సీతేశుని జేరి నమ్రశిరుఁడై పదకం
జాతంబు లంటి మ్రొక్కి ధ
రాతనయపదాబ్జముల కెరఁగె సానుజుఁడై. 310

క. సౌమిత్రి మ్రొక్కఁ గౌఁగిటి
లో మైత్రిఁ జేర్చి నంతలో శత్రుఘ్నుం
డామోదంబున లక్ష్మణు
తామరసాంఘ్రులకు మ్రొక్కెఁ దద్దయుఁ బ్రీతిన్. 311

తే. రహిని గౌసల్యయును సుమిత్రయును గైక
వచ్చి కొమరులఁ గౌఁగిటఁ గ్రుచ్చి చేర్చి
ముద్దుల న్గొని చుబుకముల్ బుణికి లెస్సఁ
బోఁడిమిని హర్షవార్ధి నోలాడిరంత. 312

చ. చెలువుగఁ దమ్ముఁగాంచఁగ వసిష్ఠముఖుల్ జనుల్ సుమంత
ముఖ్యులు హితులుఁ బురప్రజలు నుజ్జ్వలహర్షముతోడ
రా నతుల్, సలిపి నుతుల్ గ్రహించి యరుసంబున రాజిలు
రామచంద్రుతోఁ, బలికెను గైకయిాసుతుఁడు వాక్సుధ
లొల్కఁగ నీక్రమంబునన్. 313

శా. అన్నా ! తావకపాదుకాముఖమునం దత్యంతసద్భక్తితో
నిన్నాళ్లుఁ భవదీయరాజ్య మెటులో యేఁదాల్చితిఁ దావకా

జ్ఞన్న న్నింకఁ గృతార్థుఁజేయఁగ భవత్సామ్రాజ్యపట్టాభిషే
కౌన్నత్యంబు వహింపవే నను గృపాయత్తుండవై ప్రోవవే.

క. అని విన్నవింప రాముం
డనుజుని మాటలకు నొప్పె నంత వసిష్ఠుం
డనుపమ మగుసుముహూర్తముఁ
గని నియమించెను జనంబు గడు హర్షింపన్. 315

వ. అంత నుచితపరివారంబు సీతారామలక్ష్మణులకు జటాభారం
బులు విప్పించి సుగంధతైలంబు లలంది మంగళస్నానంబులు
సేయించి స్రక్చందనాదిదివ్యగంధంబు లలంది యుజ్వలాంబర
రత్నాభరణాలంకృతులఁజేసి నీరాజనమంగళారతు లొసంగి
యయోధ్యానగరంబంతయు నతిశృంగారంబుగ నలంక
రించి రాజమార్గంబు లూడ్చి పన్నీరుఁ జల్లి మౌక్తికంబుల
మ్రుగ్గులుపెట్టి తోరణంబులు కట్టి ధ్వజంబు లెత్తి సీతారామ
లక్ష్మణుల గృహంబు లలంకరించి రామకథావిశేషంబుల
గోడలపై వ్రాయించి రంతఁ బటహఢక్కాభేరీశంఖకాహళ
వేణుడిండిమాదిరావంబులు భూనభోంతరాళంబు నిండ
వీణాతాళమృదంగరవానుకూలంబుగ వారాంగనలు పాడు
చు నాడఁ బౌరులెల్లరు సంభ్రమంబునఁ బరతెంచి రామకథా
గానంబులు సల్ప నిరుగెల్రంకుల భరతశత్రుఘ్నులు చామ
రంబులు వీవ లక్ష్మణుండు శ్వేతాతపత్రంబుఁబట్ట నడుమ
రథాధిరూఢుండై రాముండు లోకాభిరాముండై విరా
జిల్లఁ బిఱుంద సీతామహాదేవి శిబికారూఢయై కౌసల్యాది
శ్వశ్రూజనంబుతోఁ దారాదివానరాంగనలతోఁ గదల రథ
గజహయాదు లెక్కి సుగ్రీవహనుమదంగద విభీషణాది

వానరదానవవీరులు సనుదేరఁ గోలాహలధ్వనులతో నయోధ్యాపురంబున కేగుచుండఁ బౌరాంగనలు వారలపైఁ బుష్పలాజవర్షంబులు కురిపించుచు నీరీతి వారలఁగూర్చి పలుకం దొడంగిరి. 316

ఉ. ఎంతటివాఁడె రాముఁడు మహీసుతతో ననుజన్ముతోఁ గడుఁ
సంతసమారఁ దండ్రివచనంబును నిల్ప మహోగ్రకాననా
భ్యంతరసీమ కేగి భయదాసురకోటులఁ గూల్చి లోక మ
త్యంతసుఖంబులన్ దనరునట్టులఁజేసె సుకీర్తికాముఁడై. 317

మ. హరియో యబ్జభవుండొ శంభుఁడొ యితం డట్లైన్నఁగా
రానిచో, నరుఁ డారావణకుంభకర్ణముఖులన్ ఖండింపఁగా
గల్గునే, శరధిన్గట్టునె కోఁతిమూఁకను మహాసైన్యంబుగాఁ
జేయునే, ధరణిన్ వ్రాలినవారికిన్ మరల నుద్యజ్జీవముల్
కూర్చునే. 318

ఉ. ఆరఘువీరశేఖరున కర్హసతీమణియౌను సీత, తా
ఘోరతరాగ్నికీలల నకుంఠితలీలఁ బ్రవేశమై జగ
ద్వారము లౌనన్ దనయవారితనిర్మలవర్తనంబు నిం
డారఁగఁ జూపెనంట వినసైనను వింటిమె యిట్టి సాధ్వినిన్.

శా. ఆసౌమిత్రియు నట్టివాఁడె దివిజాధ్యక్షున్ జెఱన్బెట్టి మా
యాసంబంధమహోగ్రశక్తిభయదుం డైనట్టియమ్మేఘనా
దాసాధ్యాసురుఁ జంపెనంట కపివీరానీకముల్ రాక్ష
స్త్రాసక్రీడఁ జరించెనంట యనివార్యప్రోజ్జ్వలచ్ఛక్తిచేన్.

ఉ. అందఱకంటె నుజ్జ్వలబలాధికుఁడంట మరుత్సుతుం డతం
డెందఱినో వధించి యసురేశునివీడు దహించి జానకి

సుందరిఁ గాంచి ద్రోణగిరి శోధనసేసి గ్రహించి తెచ్చి తా
మ్రందినవారలన్ బ్రదికి రాజిలఁజేసె నటంద్రు కంటిరే. 321

గీ. ఇటులఁ దమ్ము జనమ్ము లెంతేని బొగడఁ
బట్టణముఁ జేరె రామభూపాలుఁ డంత
భరతశత్రుఘ్ను లాదైత్యవానరులను
విడుదలను డించి బహుగౌరవించి రెలమి. 322

చ. చెలఁగి యనంతరంబు నభిషేకమహోత్సవమున్ ఘటింపఁగా
వలయుచతుస్సముద్రముల వారి వనాటులు తెచ్చునట్లుగా
సలిపి వసిష్ఠముఖ్యమునిసత్తములున్ హితమంత్రిబాంధవా
దులు తమకొప్పుచుండెడువిధుల్ నెఱవేర్చిరి హర్షమగ్నులై.

సీ. వీథులందంతట విరులతో నిండిన
పందిళ్లు దీపికావరుస లమరె
ధ్వజములు యంత్రముల్ బహుతోరణంబులు
మేలుబొమ్మలు చాందినీలవెలసె
నత్తరు పన్నీరు నమలినకస్తూరి
పునుఁగు జవ్వాజివాసనలుపర్వెఁ
బటహాఢక్కా శంఖపటునినాదంబులు
భేరికాభాంకృతుల్ భోరుకొల్పె

తే. వందిమాగధబృందకై వారములును
మృదులవీణారవంబులు పృథులవేణు
నాదములు వారనారీవినోదములును
దనరి రాజిల్లె నమ్మహోత్సవము మిగుల.

సీ. విపులహోమాగ్నుల వ్రేల్చుచుండెడివారు
మించివేదములఁబఠించువారు

శ్రీరామచరితంబుఁ జెలఁగిపాడెడువారు
చక్కఁ బురాణముల్ చదువువారు
స్వర్ణభూగోదానపటలిచేసెడివారు
దేవతార్చనలసంధించువారు
సురుచిరాహారవస్తువు లొసంగెడివారు
వచ్చువారలఁ దోడితెచ్చువారు
తే. ఋషులు బంధులు మంత్రు లాశ్రితులు హితులు
సురలు రాక్షసవరులు వానరులు నరులు
చెలఁగి రామునిపట్టాభిషేకమందుఁ
గొలువుకూటంబులోపలఁ గూడి రెలమి. 325

సీ. లక్ష్మణుం డత్యుత్తమ్యాలచ్ఛత్రమునుబట్టి
పృష్ఠభాగ మలంకరింపుచుండ
భరతశత్రుఘ్నులు పార్శ్వంబులఁ దనర్చి
వింజామరంబుల వీచుచుండ
ధరణిజవామాంకతలసుఖాసీనయై
విద్యుల్లతనుమించి వెల్గుచుండ
నినసుతాంగదమరుత్తనయాదు లొకప్రక్కఁ
దానవు లొకప్రక్కఁ దనరుచుండ
తే. మణిఖచితహేమదివ్యసింహాసనమునఁ
జేరి రాముండు పట్టాభిషిక్తుఁడయ్యె
భూరిమంగళవాద్యముల్ భోరుకొల్పె
సురలు సుమవర్షములు లెస్సఁ గురియఁజేయ. 326

చ. శుభపరుఁ డొక్కరత్నమయశోభితహారముఁ బంప దానిభూ
వధుఁడు గ్రహించి సీతకరపద్మములం బిడ నాథుసంజ్ఞినా

తరుణి మరుత్సుతుకా బిలచి తద్దయుఁ బ్రీతిఁ దదీయకంఠమం
దిరవుగ వైచె దాని నతఁ డెంతయు నర్కనిభంగి భాసిలన్.

సీ. రాక్షసేశుం డొక్కరత్నహారం బిచ్చె
నినజుఁడు హేమమండనమొసంగె
జనకుండు బహుమణిస్వర్ణభూషల నంపె
ఘనమౌక్తికములు కేకయుఁ డొసంగె
ధనదుండు తనమహితవిమానము నొసంగె
నబ్జభవుండు దీర్ఘాయువిచ్చె
నంజనీసుతుఁడు నిజాత్మ సమర్పించె
భక్తులు రక్షణభారమిచ్చి

తే. రిటుల సర్వాప్తవరులును హితజనములు
రామునకుఁ గానుకలిచ్చి యారామువలన
మరల బహుమానములఁ దగువరుసనంది
చెలఁగి యేగిరి స్వధామములను జేర.

క. వానరదానవవీరు ల
హీనస్నేహమున రాము నెడఁబాయఁగలే
కోనరనాయక మిమ్ములఁ
గానక మేముండ లేము క్షణమైన ననన్.

ఉ. ఓమహనీయులార! భవదూర్జితసత్కృతిచేత సేవిప
త్స్తోమమహాబ్ధిదాటి బహుశోభదలిర్పఁగ గట్టుఁజేరితిన్
నేమఱువంగ నెంచినను నేరమిముక్ మఱువంగ మాయెడన్
మీమదులందు వత్సలత మిక్కిలి గాంచుచునుండఁగోరెదన్.

చ. అని వచియింప వారలు మహాత్మ! యొకండవె నీవు సర్వవి
శ్వనిచయముక్ సృజింపఁ బెనుపక్ హరియింపఁగఁ జాలు

దేము నీ,యనఘపదాబ్జసేవ గణనార్హులమైతిమి నీకృపావలో.
కనముల మమ్ము ధన్యులనుగా నొనరింపఁగదయ్య రాఘవా.

క. అని విన్నవింప రాముఁడు
వనచరరజనీచరాధిపతుల న్గని మీ
రనుకొనుతోడనె యిటకున్
జనుదేరం గామగమనశక్తులరుకదా. 332

క. అనిపలికి మఱియు రాముఁడు
ఘనతరవాత్సల్యగరిమఁ గరువలితనయున్
ఘనతరగాఢతరాలిం
గనమున నలరించి యిట్లు కరుణన్ బలికెన్. 333

క. తమ్ముఁడ నీవును నాదగు
తమ్ములలో నొక్కరుఁడవు తలఁచుగ నిటకున్
రమ్మా కిష్కింధానగ
రమ్మిట కొకగంతెకా యరయ నీకెపుడున్. 334

వ. మిముల నేనును బాయనేరనైన మీరలు సముచితక్రియలు విసర్జించి యెప్పు డిందుండుటయు ధర్మవిరుద్ధంబగుఁ గాన ఖిమ్ములను బంపవలసె నన వారలెల్లరు హర్షించి సీతారాః లక్ష్మణ భరతశత్రుఘ్నులకును, వసిష్ఠవామదేవాదిమునీం ద్రులకును సుమంత్రాదిమంత్రులకును గౌసల్యాదిమాత లకును సాష్టాంగనమస్కృతు లాచరించి వారల యాశీర్వ చనంబు లంది వీడి చనఁ గాళ్లాడక యెట్లో యెట్టకేలకు వెడలి నిజనివాసంబులఁజేరిరి.

సీ. నెలకుఁ దప్పక వర్షములు మూఁడుకురియును
క్షామ మెట్టుండునో జను లెఱుఁగరు

భిక్షుకజనములు పృథ్వి లేనే లేరు
సర్వపదార్థసంచయముదొరకు
నంటుజాడ్యంబు లాయవనియందునలే వ
కాలమృత్యువు లెందుఁ గలుగ వెపుడు
దుష్టమృగంబులు తోఁచ వారాజ్యమం
దపరాధములుసేయ రవనిజనులు

తే. పెద్దలకు ముందుఁజావరు బిడ్డ లెపుడు
కానరాదు పతివ్రతకాని సుదతి
రామరా జేలునట్టి యారాజ్యమందు
భువి వివంబునకం టెను పొలుపుఁగాంచె.

క. సీతారామా! సత్కృప
నేతత్కావ్యంబు దేశమెల్లెడలను వి
ఖ్యాతిఁ గనఁజేసి ప్రీతిఁ
జేతోగతిఁ గనవె తూము సీతారామున్.

మాలిని.—
కలుషము లడఁగింపన్ గష్టరాసుల్ హరింపన్
విలసితసుఖ మిందున్ విశ్రుతానందమందున్
గలుగఁగఁ గరుణింపన్ గల్గు దీవే తలంపన్
బలవదఘువిరామా భద్రశైలాగ్రధామా.

గద్య. ఇది మంత్రికులోదార రామయ కుమార భద్రాచలవాస
తూము సీతారామదాస ప్రణీతంబయిన సీతారామ రామా
యణ కావ్యంబున యుద్ధకాండంబు సర్వంబు నేకా
శ్వాసము.

శ్రీ ర స్తు

# సీ తా రా మ రా మా య ణ ము

## ఉ త్త ర కాం డ ము.

క. అరిదరధనురస్త్రధరా
ధరణీజాశోభితాంక తల, గుణనికరా
నిరతానుజసంసేవిత
చరణాబ్జవిలాస భద్రశైల నివాసా.

క. దేవా! యమృతసమానం
బై విలసిలు నీదుచరిత మావల నెటులో
భావహమయ్యెనొ యదియు ద
యావనధీ! యాలకింపుమా వివరింతున్.

ఉ. పూజితరాజ్యముం బడసి భూసుతఁ గూడి సురేంద్రభోగవి
భ్రాజితసౌఖ్యము ల్గనుచు భ్రాతలు ముప్వురు భక్తిఁగొల్వ
ఘా, త్రీజను లుల్లసిల్లి వినుతింప ఋషుల్ గడు స్వస్థచిత్తులై
రాజిల, ధర్మమార్గమున రాఘవుఁ డేలుచునుండె ధారుణిన్.

తే. అంత నొకనాఁడు రామభూకాంతుఁ గాంచ
గౌతమాగస్త్యవాల్మీకకశ్యపాత్రి
ముఖ్యమునివర్గ మేతేర భూతలేశుఁ
డెదురుగాఁ బోయి యాతిథ్య మిచ్చి తెచ్చి.

మ. అతిభక్తి న్నతులాచరించి వెసనర్ఘాసీనులంజేసి స
న్నుతులం సల్పుచు మానులార నను ధన్యుంజేసి రక్షింప వ,చ్చితి రీనాపురి కింతకంటె శుభముల్ చేకూరునే, మీరు సు
స్థితి నున్నారె, భవత్తపఃక్రియ లవిచ్ఛిన్నంబుగా సాగునే.

చ. అన మునులిట్లు పల్కిరి మహాత్మ! మమున్ గృపనేలఁగాదె మీ,రని మొన నింద్ర జిద్దశముఖాదిజగద్భయదాసురావళిన్
దునిమితి రిట్లు మాయెడల దుర్లభ మైనభవత్కృపారసం
బెనయుచునుండ మాకుఁ దప మేల ఘటించి కృశింపరాఘవా.

సీ. మేటితపోనిష్ఠ మేకొని యలయుట
యభవ నీకృపభవమార్పఁగాదె
మహితయజ్ఞాదికర్మములఁ గావించుట
దైవమ నీనిమిత్తంబుగాదె
దేహసౌఖ్యంబులఁ దెగడిచరించుట
శ్రీహరి నీదయజెందఁగాదె
మహితాత్మచింతానిమగ్నులై యుండుట
యీశ! నీదయనుగ్రహింపఁగాదె

తే. మాకు ప్రాప్యుండ వీవాట మాతపములు
జపములును కర్మములు నీదుసత్కటాక్ష
లబ్ధి కేకద నీకృప లబ్ధమైన
మాకు నింకేల సత్తపోమార్గగతులు. 7

క. అనవిని చిరునగ వొలయఁగ
ననె రాముఁడు మీవచోమహత్వముచే నా
వనజాతునంశనాయం
దెనసెడినో యింక నరుఁడ నే నీవఱకున్.

# ఉ త్త ర కాం డ ము.

క. అనిపల్కుచు రాముం డా
దనుజులవృత్తాంతము విశదంబుగ వినఁగా
మనమలర గరుణఁదెల్పుం
డన నిటుఁ గుంభజుఁడుపల్కె నార్యానుమతిన్.

క. రావణుచారిత్రము విన
భావమలరె నంటి రామభద్రా! త్రిజగ
జ్జీవాంతర్యామివనం
గా విలసిలు నీకుఁ దెల్పఁగావలెనె యొరుల్.

క. ఐనను మౌనుండి వినం
గా నలరితి కాన నాకుఁ గన్పడువఱకుఁ
బూనెదఁ జెప్పఁగ వినుమని
మౌనివరుఁడు పల్కె నీక్రమంబున వేడన్.

సీ. పద్మజాసనునుండి ప్రభవించిర మొదట
వరుసఁ గొందఱు బ్రజాపతు లనంగఁ
వారిలోనఁ బులస్త్యవరమౌని యొక్కఁ డా
తనికి విశ్రవసుండు ధర జనించె
నాతని కిరువురు నాతు లవ్వారిలోఁ
బ్రథమభార్యకు యక్షపతి కుబేరుఁ
డొదవె రెండవసతి కుద్భవించిరి దశా
స్యఘటకర్ణవిభీషణాఖ్యసుతులు

తే. శూర్పణఖ యనఁబడు నొక్కసుతయు నందుఁ
గొండిక విభీషణుఁడుతక్కఁ గొదువవారు
ఘోరరక్షస్స్వభావముల్ కూడి మనిరి
వారలపురాకృతాఘప్రచారమహిమ.

క. జనకునికడ శ్రుతిశాస్త్రము
లనుసర్వము నేర్చి తపముల్ సరసిజజ
న్మునిఁగూర్చి చేసివరములఁ
గనఁ జని రా ముగురుసుతులు గహనస్థలికిన్.

చ. చని యట రావణుండు సురసంఘము భీతిల ఘోరవత్తా
తపం, బొనరుచుచున్ స్వమూర్ధముల నొక్కఁడొకండుగఁ
ద్రొక్కిదింటి ఖడ్గనిహతిఁగోసి దుస్సహశిఖాముఖమందున
వ్రేల్చి యంతఁ దక్కినతలఁగూడఁ గోయ గమకించుచు
నుండ నజుండు భీతుఁ డై. 14

చ. వెసఁ జనుదెంచి యేటికిటు భీకరలీల శిరాళిఁ గోసి య
గ్ని సమిధ లట్లు వ్రేల్చి తతినిష్ఠురబాధసహించి యిక్లైవం
డు సలుపలేదు మున్ భళి ననున్ వరజాలము లేమికోరెదో
మసలక తెల్పుమంచు గతమస్తకముల్ మొలిపించె గ్రమ్మఱన్.

క. అని యడిగిన దశవదనుఁడు
వనజోద్భవ! దేవదైత్యపన్నగగంధ
ర్వనికరకిన్నరయక్షా
ద్యనిమిషులం దెవనిచేత నడఁగకమఱియున్. 16

సీ. అమితకాలంబు బ్రదికి బలాతిధైర్య
శౌర్యములు కల్గి త్రిజగద్విజయముకాంచి
యుద్ధవిఖ్యాతిఁగను వర మిమ్మటన్న
నళినజుఁ డొసంగి మఱి వాని నాభియందు. 17

క. కరుణ నొకయమృతకలశం
బిరవుగ స్థాపించి దానవేశ్వర ధర్మ

# ఉత్తరకాండము.

స్ఫురణముఁ దప్పక మనుమని
యరవిందోద్భవుఁ డదృశ్యుఁడై చనె దివికిన్.

సీ. కుంభకర్ణుం డతిఘోరతపము సల్ప
నమరులు భయవిహ్వలాత్ము లగుచు
బ్రహ్మను జేరి యోపద్మజ! యీతండు
సహజదార్ఢ్యముననే సకలలోక
ముల నడంపఁగఁజాలు భూరితరాంగుండు
ముక్కోపి యిట్టి దుర్భ్యాతమునకు
వరము లీవిచ్చిన వహ్నిలో నాజ్యంబుఁ
బోసినట్లగుఁగాదె భువనరాశి

గీ. నొక్క కడిచేసి మ్రింగఁడే యుగ్రుఁ డితఁడు
వరము లీతని కీకుండు తెరవుఁ గనుము
విశ్వసంధాయకా యని వినుతి సేయ
నజుఁడు వాణినిఁ జీరి యిట్లని వచించె.

క. ఈరాత్రించరునం దీ
వార న్వసియించి నేవరాలి నొసంగన్
జేరినతఱి నను నిదురన్
గోరునటులఁ జేయు మితనిఁ గోమలి యనినన్.

శా. ఆనారీమణి యట్లొనర్పఁగ నజుం డాదానవున్ డాసి నీ
లోన న్గల్గినకోర్కెఁ దెల్పుమన నాలోచింప కాతండు ద
వా నిద్రన్ దయసేయుమం చడుగ నావాణీశుఁ డద్దాని సం
ధానించెన్ సురలుల్లసిల్ల నజుఁ డంతన్ జాలి తన్నుంపఁగన్.

ఆరునెలలకు నొకదినం బం దితండు
నిదుర మేల్కొని కార్యముల్ నిర్వహించు

వీఁడు నాఁడుజ్జ్వలాజేయవిపులధైర్య
శౌర్యకార్యధురీణుఁడై సంచరించు. 22

క. అని తెల్పి విభీషణునిన్
గని నీకోరికలు తెలియఁగాఁ బల్కు మనన్
వనజజ! నీయస్త్రం బి
చ్చి ననున్ ధర్మమున నిల్వఁజేయవె యనినన్. 23

గీ. అటుల వరమిచ్చి యరిగె నాయబ్జజన్ముఁ
డంత వారలు పితృగృహమందిరవల
దశముఖుఁడు తనయన్నయా ధనదుఁ డేలు
లంకపై కేఁగి యతనిఁ గలంచి మించి. 24

చ. ఘనతరవిక్రమంబున నకారణ మన్నను దాకి గెల్చి యా
యనఘునిపుష్పకంబుఁ గొని యాతని నిల్వెడలించి లంకలో
దనుజచమూసమూహములు తన్గొలువన్ వసియించె నంత నా
ధనదుఁడు చేరె శంకరునిదాపునఁ దండ్రియనుజ్ఞ శాంతుఁడై.

క. ఆవల నాదశకంఠుఁడు
భూవరులన్ దాకి త్రుంచి పొలఁతుల బల్మిన్
వేవేలఁ దెచ్చె లంకకు
భావజకేళులకుఁ గామవశమానసుఁడై. 26

క. తనకున్ లోబడుభూవరు
లను గడుఁబ్రాణావసిష్టులను జేసి తొలం
గునటు లొనర్పనివానిన్
వినాశ మొనరించు వెదకి వెదకి కఠినుఁడై. 27

క. అనరణ్యుండను మీపూ
ర్వు నొకతఱిన్ రావణుండు పోరునకున్ ర

మ్మని చేరి గదాహతి నా
మనుజేశు నకారణముగ మహిం బడఁ గూల్చెన్.

క. ఆనృపుడు చచ్చుతఱి నా
దానవుని శపించె నోరి దైత్యాధమ నీ
మానకమద్వంశభవుం
డే నిర్మూలించుఁ దప్ప దిది యని కిన్కన్.

సీ. పిమ్మట నితఁడు త్రివిష్టపంబు జయింప
మేటిదైత్యచమూసమేతుఁడగుచు
స్వర్లోకమున కేగి వరుణాగ్నియమవాయు
పద్మహితాదిదిక్పతుల గెలిచి
సురనాథుతోఁ డుతశుంభద్రణముసల్పి
తుద కీతఁడే మూర్ఛఁ దొట్రిలంగ
వీనితనూజుం డహీనపరాక్రముఁ
డమ్మేఘనాదుఁ డుదగ్రబలమున

తే. జలదములమాటున న్దాగి బలవదశని
పాతముగ శరవర్షంబుఁ బరపి యింద్రు
మూర్ఛ వ్రాలిచిబంధించి పురికిఁదెచ్చి
కారలో వైచె దైత్యులు కడుచెలంగ

తే. అంత నజుఁడువచ్చి యారావణి న్వేఁడి
వరములిచ్చి దివిజపతి నతండు
విడచునట్లుచేసి వెసనేగెనమ్మేఘ
నాదుఁ డింద్రజి త్తనంగఁ బ్రబలె.

క. రావణుఁ డాలోఁబలిమిఁ
దేవసతీమణులఁబట్టి తెచ్చి చెఱిపె లో

కావళులు దూర నాతరు
జీవితతులు దుఃఖవార్ధిని న్బడిపోవన్.

సీ. కైలాసగిరికేగి కడఁగినందీశుతోఁ
గలహించి కిన్కనాత్మాధరంబుఁ
దలక్రిందుగాఁజేసె దనుచూడుమనిడిగ్గి
తనవింశతికరంబు లనుమదమున
గిరిక్రిందఁజేర్చి యుద్ధురవృత్తిఁబెకలించి
యెత్తఁజూచిన బహుతత్తరమున
గౌరి యిగ్గిరియట్టె కదలుటేలనిభీతిఁ
గలఁగి ప్రాణేశునిఁ గౌగిలింప

తే. గరళకంధరుఁ డాహేతువరసికాంచి
తనదుపాదాంగుళమున భూధరము నొక్క
గరములద్దానిక్రింద కుగ్రముగనిఱికి
కదలుపఁగలేక యద్దశకంధరుండు.

క. ఎంతబలంబున లాగిన
నుంతయు నాయద్రిక్రిందఁ జొచ్చినకరముల్
వింతగఁ గదలకయుండిన
స్వాంతంబునఁగలఁగె రాక్షసప్రభుఁడు కడున్.

సీ. కలఁగియాందోసఁగు శంకరునిదివ్యప్రభా
వంబనితలఁచి యాభవునిగుఱించి
నిర్మలసద్భక్తినిలిపి సంస్తోత్రముల్
గావించి వేదనికాయములను
జటఘనాంతోజ్జ్వలస్వాధ్యాయనిరతుఁడై
భూరిమహారావము లొనరుచుచు

బహువత్సరంబులు మహితార్తిదపియింప
నద్రిజావిభుఁడు ప్రత్యక్షమగుచు
తే. నసురుకరములు వెల్వడునటులఁ జేసి
సద్వరంబులు కొన్ని యొసంగి భూరి
రావములొనర్చినందున రావణాఖ్యఁ
దాల్పుమనిపల్కి విడచె నాదైత్యవరుస.

ఉ. దానవభర్త యొకపల ముదంబున నేగుచు సావనక్షితిన్
సూనశరాస్త్రతుల్యయగు సుందరి వేదవతీసమాఖ్య యా
శ్రీనిలయుండు నాథుఁడగుసిద్ధికి ఘోరతపోవ్రతానుసం
ధాన మొనర్చుచుండఁ గని తద్దయు మోహపరీతచిత్తుఁడై.

క. ఆమగువ డాసి యెవ్వతె
వీమహితారణ్యమందు నేశోభ మొందన్
గామించి తపించెదవన
నామానిని పల్కెనిటుల నసురునితోడన్.

ఉ. ఏనొకసన్మునీంద్రసుత నీవని శ్రీహరినాథుఁడౌటకై
పూనితి నీతపంబనఁగఁ బోక దశాస్యుఁడు బిట్టునవ్వుచున్
మానిని యెట్టివెఱ్ఱియిది మానఁగదే హరియన్న మాట గు
ట్టానికిఁ గప్పకున్ జనచరంబున కర్థము నీవెఱుంగవే. 38

క. హరియనఁబడు పురుషుర డెట
స్ఫురింపఁ డీవేల మేను సుక్క దపింపన్
నరసుని ననుఁ గూడంగా
నరుదెమ్మని నాతిఁబట్టి సాసటి కీన్కన్. 39

శా. ఓరీదానవ దుష్టచిత్తహరి దీవ్యూహింప నర్హుండవే
కారుల్ పల్కెదు నీవు చేయడినా రుకార్యంబు నేనొల్ల

యోగాగ్నిదగ్ధ నశించి - ముందుభవమం దాశౌరిఁ
బెండ్లాడి దు,ర్వార ప్రక్రియ నిన్ను నీకులము ద్రుంపన్గా
రణం బయ్యెదన్. 40

క. అని పలికి నాతి యోగా
గ్నినటఁ జ్వలియింపఁ జేసి కేశవునాత్మన్
మననము సేయుచు ధృతినా
యనలంబునఁ గాలిమ్రగ్గె ననుజుఁడు వెగడన్.

క. ఆవేదవతియె యిప్పుడు
శ్రీవిభునిఁ బెండ్లియాడి సీతాభిఖ్యన్
రావణనాశనమూలం
బై వెలసి హరించె వాని యన్వయమెల్లన్.

సీ. ఒకనాఁడు వాలి మహోదధిలో మున్గి
సంధ్య వార్చుచునుండు సమయమందు
దశవదనుం డయ్యతనిఁ గాంచి దుర్మదో
ద్ధతిని వంచింప నాత్మను దలంచి
కపివీరుపృష్ఠభాగమ్మునకెల్లనఁబోయి
తనబాహుశాఖావితానములను
నాతనిచంకల యందు వేఁజొప్పించి
పడఁద్రోయఁగా యత్నపడుచునుండ

తే. మహితబలశాలికపికుల మండనుండు
దైత్యపతినోరచూపులఁ దగగ్రహించి
బాహుమూలంబులందు వహ్నానికరము
లదిమి బిగియించి వీపున నతనిఁ దాల్చి.

మ. చతురంభోధులకేగి తజ్జలములన్ స్నానంబు గావించి స
త్వరతఁగిష్కింధకు వచ్చి బాహులవిదిర్పన్ దైత్యుఁ డట్లైన్
గతా,గతజీవుండయి ధారుణిన్ బడియె వృక్షంబట్టు లవ్వాలి
ని,ర్గతవీర్యుండగుదైత్యుఁగాంచి శుభమే రక్షోవరాయం
చనన్.

క. తలయెత్తు లేక దనుజుఁడు
బలుసిగ్గున వాలికెరఁగి భవదీయమహో
జ్జ్వలశక్తిఁగంటి నైపుము
చెలిమి యిఁక న్మనకుఁ జెల్లు క్షితినని తరలెన్.

తే. తరలియవ్వలమఱియొక తఱినతండు
కార్తవీర్యార్జునునితోడఁ గలహమునకుఁ
జని గదాయుద్ధమందు నాతనికి నోడి
సంధిఁగావించికొనియెన సగఁబురికి.

సీ. బలిదైత్యువాకిటఁ బద్మాక్షుఁడెప్పుడు
వేచియుండెడునని విని మదమున
నామహాత్మునితోడ నాహవంబొనరింపఁ
బుష్పకారూఢుఁడై పోయి యచట
నాజానుబాహు దివ్యాద్భుతఘనతేజు
నొకమహామహుఁగాంచి యుల్లమదలి
నివ్వెఱపడి నిల్వ నీవు నాతోడ నా
బలితోడనా పోర వచ్చితిటుకుఁ
తే. బల్కుమని యాతఁడన దైత్యవరుఁడు కలఁగి
బలిని దొడరంగవచ్చితిఁ బత్తమొసంగు

మనిననా దేవుఁ డా దైత్యు నరుగనిచ్చె
నంత నతఁడా బలీంద్రుఁ డా యంగఁ బోవ.

చ. బలి దశకంఠుఁ గన్గొని యపారముదంబునఁ జేరఁదీసి ని
శ్చలకృపఁ గౌఁగిలించికొని చక్క నిజాంకముఁ జేర్చి డింభ కా
యలఘుపులస్త్య పౌత్ర సుఖివై యలరారె దెబంధుయుక్తమ
త్కులజుని నిన్నుఁ గాంచినఁ గుతూహలమయ్యెఁధి నంచుఁ
బల్కుచున్. 48

తే. ఏటికిటవచ్చితనఁగ బలీంద్రుతోడ
మనకుశాత్రవుఁడైన యమ్మాధవుండు
నిలుచునిందని విని యాతనిన్ రణమున
దాకవచ్చితినఁగ నాతండు నగుచు.

క. ఆహా యేటికి దుర్భ్రమ
శ్రీహరిపై వైరమూని చెడిరసురులు మున్
సాహసమన్నిఁటసాగునె
దేహికి గతి యతఁడ కాదె తెలియవె వత్సా.

సీ. ఇటకునీ వేతెంచు నెడనాదు వాకిటఁ
గనలేదె. యొకఘునాఘునశరీరు
నాతఁడెవ్వండని యాత్మనూహించితి
దైవంబనంగ నాతండ కాఁడె
హరిపరమాత్మ విశ్వాధారకుఁడు సర్వ
సృష్టిస్థితిధ్వంస సిద్ధికరుఁడు
నీలోన నాలోన నిఖిలవిశ్వములోనఁ
బరగుచుండెడుపరబ్రహ్మ మతఁడు

తే. వైరమూ యట్టి త్రిజగదాధారుతోడ
నతని గెలువంగనగునను నట్టితలఁపు
పిచ్చియుస్వనాశకరమగు విధము కాదె
యెఱుఁగ వేమాడుమ త్తాత లేమిసైరో.

క. అనిపల్కి దుర్మదోద్ధతి
మనిచెడ కాదేవ దేవు మహిమ చెవుల్లో
గనుచిహాపరసౌఖ్యంబుల
నెనయు మనుచుఁ జెప్పి దైత్యునిన్వీడ్కొల్పెన్.

క. ఖలుఁడా రావణుఁ డంతట
బలి గెలిచితి నచటనుండు పద్మదళాక్షుఁ
గెలిచితినని బహుజంభో
క్తులఁ బల్కుచుఁ దరలెఁ దనహితులతో వేడ్కన్.

చ. మఱియొకనాఁడు త్రోవఁ జనుమానిని రంభను బట్టి బల్మి నా
గురుకుచకుంభఁ గూడ నలకూబరుఁ డావిధ మాలకించి యే
తరుణినినైన నింక సురతక్రియ బల్మినిఁ గూడుచో శిరోత్క
రములు భగ్నలై పడియెఁగా గలపంచు శపించె రావణున్.

క. నారదుఁ డొకతఱి రావణుఁ
జేరి సకలవీరవరుల్గఁ జెనకితి వైనన్
ధీరుల శ్వేతద్వీపో
ర్వీరమణుల గెలువవైతివి దనుజవర్యా.

సీ. అన దశాస్యుఁడు సార్థ ముయ్యెద యాద్వీప
పృథ్వీశులనడంప వెడలువాఁడ
నని పుష్పకారూఢి నసురవీరులఁ గూడి
తరలి యాద్వీపభూతలముఁ జేరి

యసురుల నటనుండ నాజ్ఞ యొసంగి తా
నొంటిగాఁ జని చూచుచుండ నంతఁ
దాళ్ప్రమాణాలో తరుణులు కొందఱు
వచ్చి యాదైత్యు రూపంబుఁ గాంచి
తే. దశముఖంబులు కలుగు వింతపురుగంచు
నొకతె యాతనిఁబట్టి వేరొకతె లాగ
మఱియొకతె యాడఁబెఱుక నిమ్మాడ్కిఁ దరుణు
లంద ఱాతనిఁ దమచేతులందుఁ ద్రిప్ప.

క. ఈవిధి నాదైత్యేశ్వరుఁ
డావెలఁదులచేతులందు నలజడిబడుచుం
దావెల్వడుగతి లేక యి
దే వెరవని చేయిఁగఱచెఁ దెలవ యొకతెకున్.

క. కఱువఁగ నియ్యది యొకచెడు
పుఱుఁగని దశకంఠు నొక్కపొలతుకదవులం
దోరిగిపడ విసరివైచిన
నరిగె నతఁడు బ్రదుకు జీవుఁడా యని పురికిన్.

సీ. ఆవల నొకదినంబందు దశాస్యుండు
దిగ్విజయార్థియై తిరుగు చొక్క
గహనస్థలంబునఁ గపిలమహాముని
యోగసమాధిలో నొప్పుచుండఁ
గాంచి దుర్మదమునఁ గార్ముకం బెక్కిడి
యమ్మునిపైని శరమ్ము వేయ
నతఁ డొక్కశైలగహ్వారమందు దూఱిన
భయమున నత్తాని పాటెన్నంచు

తే. రయముతో దైత్యుఁడును కందరంబుఁ జొచ్చి
తరుణి యొక్కతె పదములొత్తఁగ శయ్య
నొఱిగి నిదురించు నొకపుణ్యపురుషుఁ గాంచి
పడఁతి యందంబుఁ గని వహావా యటంచు.

క. అడుగులు మెల్లన నిడు చా
పడఁతి న్డాయంగఁబోవ వడి నాపురుషుం
డడరొదవ నొకమహార్భటి
గడలుకొలిపి ముష్టిఁబొడువఁగా వివశుండై.

గీ. ధరణిఁబడిలేచి దైత్యుఁ డోపురుషవర్య
నీవెవండవటన్న నోనింద్యచరిత
యిపుడు శక్యంబె నీకు నన్నెఱుఁగనైన
బరగ నారూపమరసి గుర్తెఱుఁగుమంచు.

సీ. తనదివ్యరూపంబుఁ దాలిచి నిలచిన
నది భూనభోంతరం బంత నిండె
రవిచంద్రతారకాప్రతతులందె వెలింగె
వననదీపర్వతవనధు లొప్పె
బదునాల్గుభువనముల్ పొదవె నాయాకృతిఁ
బంచమహాభూతపటలి గ్రాలె
నది యిది యననేల యఖిలజగత్సృష్టి
యాదివ్యరూపమం దమరయుండె

తే. నిట్టిస్వాకృతిఁ జూపి యోరీనిశాట
నీజగద్ద్రోహచర్యల నేనెఱుఁగుదు
నడఁచెదను నిన్నుఁ ద్రుళ్లకు మనిన దైత్యుఁ
డీవు చంపుటకంటె మే లెద్ది యనియె.

సీ. వైరభావంబున శౌరిని దోషించి
దూషించి యనిం దాకి తూలంజేసి
త్రికరణములవాని ద్వేషోద్ధతిని గాంచి
యాతనిచేం దుది నవనిం గూలి
పెక్కుభవంబుల విబుధులు భక్తిచేం
గాంచలేనట్టి మోక్షంబుం ద్రుటిని
బొందుచుండ్ర సురులాభూతాత్మకునకు రా
గద్వేషములు లేనికతన వగనో

తే. భక్తినో పగనో భయోత్పాతమునసో
యమ్మహాత్ముం ద్రిశుద్ధిగా నావరించి
ముక్తిం గనవచ్చు నీవు నాభూతమయుని
వలనం దుదిం దెల్లి మోక్షంబుంబడసె దనిన.

వ. రావణుం డోమునివర్యా! నాకెన్నం డామహాత్మునిచే నే రూపంబున నేకారణంబున హతుండ నగుదునో తెల్పుమన నామౌనీంద్రుండు త్రేతాయుగంబున మాధవుండు దశరథున కాత్మజుండై రామాభిధానంబున జన్మించి యాదేవు సతీమణియైన సీతాలక్ష్మిని నీవు హరించినకారణంబున నిన్నా మహాత్ముండు సబంధుపరివారంబుగా సంహరించుననన రావణుండు బహుహర్షించి సనత్కుమారునకు మ్రొక్కి వీడ్కొని చనియె నిట్లు రావణుం డొనర్చినశుభాశుభ కృత్యంబు లనేకంబులు కలవు; వానిని విస్తరింప నెన్నాళ్లైనం బట్టుం గానం గ్రోడీకరించితిని. రావణుండు నీవు శ్రీహరి వనియు సీత లక్ష్మి యనియు నెఱింగి నీచే హతుండై ముక్తి నొందుతలంపున జానకిం గొని యేఁగెంగాని కామకుండై

కాదు. సర్వజ్ఞుండవైన నీవెఱుంగని భూతభవిష్యద్వర్త
మానవిషయంబులు కలవే యని మఱియు నిట్లనియె. 68

క. రావణునిచావుకంటెన్
రావణి యగునింద్రజిన్మరణ మతిహితమై
దేవతలకు మర్త్యులకున్
భావింపఁగ రానికష్టపటలిన్ బాపెన్.

సీ. ఆయసురుఁడు కాఁడె యమరేంద్రు బంధించి
యింద్రజిదాఖ్య వహించె జగతి
నాయసురుఁడు కాఁడెయబ్జజు లంకకు
రప్పించి సద్వరరాజిఁ గాంచె
నాయసురుఁడు కాఁడెయతులమాయాబల
ప్రౌఢిశాత్రవులకు భయదుఁడయ్యె
నాయసురుఁడు కాఁడెయ! మిమ్ముందఱ
రెండుసార్లవని మూర్ఛిలఁగఁ జేసె

తే. న త్రిజగద్భయంకరు నవనిఁ గూల్చి
లక్ష్మణుండు జగన్నుతులను గ్రహించెఁ
గడుపులోఁ జల్ల సుంతయుఁ గదలకుండ
సౌఖ్యముగ నున్నవారిప్డు జను లటంచు

చ. వివరముగా దశాస్యగుణవృత్తము లీగతి మాని తెల్పినన్
జెవులకు నిండుపండువును జేసి రఘుప్రవరుండు మానితోఁ
బ్రవిమలసద్గుణుండయిన పావనిచారుకథాప్రసంగముల్
భవదమృతోక్తుల న్వినఁగ భావము రంజిలు దెల్పవే యనన్.

వ. కుంభజుం డిట్లనియె. శ్రీరామా! మారుతి యమానుష
బలోత్సాహంబులు వర్ణింప నజాదులకైన నగా దైనఁ దెలిసి

నంతవాని కేవివరించెద నాలకింపు మాతండు పూర్వభవం
బున నేకాదశరుద్రుండని యందు రట్టి జన్మాంతరగాథ లీవె
కాక మేమెఱుంగ నెంతవార మాతండు రుద్రాంశంబునఁ
గొంతకాలంబు పార్వతీకుక్షిని వర్ధిల్లి యావల నగ్నిగర్భం
బునఁ గొంతకాలంబును వాయు వందుఁగొంతకాలంబును
విరాజిల్లి తత్తత్ప్రభావంబులఁబొంది తుద కంజనీగర్భస్థుండై
యుద్భవించె నంత నాతండు పుట్టినతోడనె సూర్యబింబంబుఁ
గాంచి ఫలభ్రాంతి దానిభక్షింప మింటికెగసి కవయ
మొగంబుకాలిన దానివిడచి యానాఁడు సూర్యగ్రహ
ణార్థం బేతెంచిన కేతువుపై పడ నాతండు భీతిల్లి యింద్రుని
కడ కేగి తెల్ప నాసురపతి యైరావతాధిరూఢుండై రాఁ
దెల్లనిపండని యాగజేంద్రంబుఁ గవియ నింద్రుండు వజ్రా
హతి నొట్టె హనువు భగ్నంబైఁ యాతండు మూర్ఛిల్లె
నంత ననిలుండు పుత్రవాత్సల్యంబున వాయుబంధం
బొనర్ప సకలలోకంబులు శ్వాసలాడక బ్రహ్మకడకుఁ బాటి
తెల్ప నాతం డరుదెంచి యనిలు న్బొగడి వాయువ్యాప్తిఁ
గావింపఁజేసి పావని ముందు భవత్కార్యధురంధరుం డగు
నని యెఱింగి సకలదేవతలచేఁ దమతమ యస్త్రశస్త్రంబుల
నాతనికి భయంబులేనట్లు వరంబు లిప్పించి బ్రహ్మాస్త్రంబున
మాత్రం బించుకసేపు బద్ధుండగునని తెల్పి యాతని వజ్ర
శరీరు న్జేసి విడిచిపుచ్చె నంతఁ గొంతకాలంబున కామారుతి
యుదయాద్రిపై నొక్కపాదంబు నస్తాద్రిపై నొక్కపాదం
బును నిలిపి సూర్యునియొద్ద సకలవేదశాస్త్రంబులఁ జదివె
నావలఁ గ్రమక్రమంబున వాలిసుగ్రీవులకడఁ జేరి . మంత్రి

వర్యుండై నిలచియుండె నావలి మారుతి కథావిశేషంబు
లెల్ల స్వయంబుగ నీవ యెఱుంగుదువన శ్రీరాముం డిట్లని యె: 72

తే. ఇంత బలశాలి యగుహనుమంతు డపుడు
రవిజుకడనుండి వాలి దోర్గర్వ మడఁప
నూరకేల తటస్థుఁడై యుండె ననఁగ
దండిముని రామునితో నివ్విధమునఁ బలికె: 73

క. అనిలజుఁ డింద్రజరవిజుల
ఘనతరసద్భక్తిఁ గొలిచెఁ గానఁ దటస్థుం
డనుచుండె నతఁడు, వాలియుఁ
గని పెట్టుచునుండె నొక్కకంట న్హనుమన్. 74

వ. అని యాయగస్త్యమహాముని తెల్ప రాముండు హర్షించె
నంత నమ్మునీంద్రు లెల్ల రేకగ్రీవంబుగ శ్రీరాముఁ గూర్చి
యిట్లు పల్కిరి. 75

మ. హరివం చేము నినుఁ గ్రహించితిమి రామా! నీదు యాథా
ర్థ్యముఁ, మఱుఁగుంబెట్టక మాధుకర్మలతలఁ నాశంబు
గావించి నీ,చర్తణాధ్యానము మాయెడ స్థిరముగా సంధించి
నీ జేర్పవే, పరమానంద వివేకరూపక బుధవ్రాతాత్మకో
ద్దీపకా: 76

సీ. ధరణి జనించి నీవు కృపఁ దాపసవర్యుల బ్రోచెదంచు మే
మెఱింగి భవత్సమాగమన మెప్పుడు కల్గునొ యంచుఁ జంద్ర
విస్ఫురణకు నా చకోరములు చూచువిధంబున నీదుసత్కృపా
దరణముఁ గోరియున్న మము ధన్యులఁగా నొనరించి
ప్రోవవే. 77

మ. అనఘానీంద్రులఁ గాంచి రాముఁడు మునీంద్రాగ్రేసరుల్
మీరిటుల్, నను నాశ్రీపతిగా వచించితిరి కానన్ మీఁదు
స్తోత్రంబులా,వనజాతాక్షునిఁ జెందు నాతఁడు మిముఁ బ్రా
ర్థించి భాస్వద్గతుల్, దనరన్ జేయును మీకటంచు నెరఁగెన్
సంపూర్ణ మా భక్తిచేన్. 78

వ. అంత నమ్మునివల్లభులు ప్రహర్షమగ్నులై శ్రీరాముని
దీవించి వీడ్కొని చని రంత. 79

సీ. దీనలోకమునకు దీర్ణబంధుండయి
యార్తినిబోనెట్టి యాదరించు
నర్థికోటికిఁ గల్పకావనీజంబయి
కాంక్షితార్థము లెల్లఁ గరుణ నిచ్చు
బుధనికాయములకు మోక్షనిధానమై
భక్తివిజ్ఞానముల్ ప్రబలఁ జేయు
బంధుకోటికి నెడఁబాయనిబంధువై
ప్రాణవాయువులైనఁ బరగనిచ్చు
తే. క్ష్మాసుతకుఁ గోటిమన్మథాకారుఁ డగుచుఁ
దల్లులకు ముద్దులొల్కెడుతనయుఁ డగుచుఁ
గలుషమానసులకు గుండెదిగాలు మగుచు
రాజ్య మేలెను రాఘవరాజమౌళి.

క. ఈవిధిఁ బదివేలేండ్లు మ
హావైభవ మొప్ప రాముఁ డవనిజతోఁ దా
జ్ఞావర్తులై నతమ్ములఁ
తో వెలసి సుఖింపుచుండె దుర్లభలీలన్.

వ. అంత సకలజనాహ్లాదకరంబుగ సీతాకాంతకు గర్భంబొదవి
వృద్ధియగుచుండ నొక్కనాఁడు. 82

ఉ. జానకితోడ రాఘవుఁడు శయ్యఁబరుండి తదీయగర్భ మెం
తేనరొల్కనంటి సతితో భవదాత్మ నెసంగు కాంక్షితం
బేనెఱుఁగ న్వచింపుమన నేమికొ యంతలుకల్గుఁ బ్రాణనా
థా! నినుఁగూడి రాజిలెదు తన్వికటంచన రాముఁ డిట్లనెన్.

గీ. గర్భవతి యగుకాంతకుఁ గాంక్ష లరుదె
దాపక వచింపు మనఁగ నాధరణితనయ
మునిసతులయిండ్లకేగి యాపాలఁతుకలకుఁ
గానుక లొసంగి రాఁగోర్కె క్రాలుననియె. 84

ఉ. ఆవల నొక్కనాఁ డుదయమందు రఘుప్రవరుండు మోసలన్
దావెరవారఁ గూర్చుని యెదన్ దలపేమిజనించె నొక్కొవా
ర్తావహుభద్రుఁ జీరి పురమందు ననున్ జను లేమి పల్కుచుం
డ్రో వివరింపుమన్నఁ బతితో నతఁ డిట్లు వచించె నమ్రుఁడై. 85

శా. దేవా! మిమ్ము జనంబు మర్త్యుఁడని బుద్ధిన్ జూడక యిృందిరా
దేవీనాథుఁడొ శంకరుండొ యిటు బృథ్విన్ బుట్టగానొప్పు ర
క్షో విధ్వంసమొనర్ప నంచు బహుభంగుల్గా వచింపన్ దగన్
నేవిన్నాఁడ ననంగ రాముఁ డది పోనీ విస్మటం బిట్లనెన్. 86

శా. సీత న్గూరిచి నన్నుఁగూరిచి జనశ్రేణుల్ విశేషించి యే
రీతిన్ బల్కుదురో వచింపుము సుఖప్రీత్యర్థమై ధబ్బరల్
నాతోఁ జెప్పిన ని న్వధించెద ననన్ భద్రుండు దుష్టాత్ము లే
వోతుచోఁ ఛత్తులు పల్కుచుంద రవి మీరొప్పన్ వినన్గా
డునే. 87

శా. జననాథా! భవదాజ్ఞఁ దెల్పెదను నీచప్రాణు లాదైత్యనా
థుని చేఁజిక్కి మెలంగినట్టిపడతిన్ దోషప్రసక్తుల్ మదిన్
గనకుండన్ విమతు న్వధించి బహువేడ్కన్ గైకొనెన్
రాఘవుం,డని భాషించెద రామ్నృపోక్తుల మహాత్మా! యేల
పాటింపఁగన్. 88

క. అన రాముఁడు నీవింకన్
జనుమనఁ జనె నాతఁ డంత స్వాంతంబున నా
జనపతి తన్నా గతిదు
ర్జను లాడెడునిందకోర్వఁజాలనివాఁడై. 89

ఉ. సీతకు నాకుఁ దీఱె ఋణశేష మశేషము నేటితోడ నా
నాతి మనోవచఃక్రియల నన్నె భజించు మహాపతివ్రతా
ఖ్యాతికిఁ బాత్రత న్గలిగి హా యిటు నీచులు పల్కుదుర్వచో
ఘాతముపాలుగా వలసెఁ గర్మగతుల్ తొలఁగింపఁగూడ్దునే.

సీ. నసువీడి మనలేక నాతో మహారణ్య
వాసకష్టము లోర్చివచ్చి బడలె
దనుఁబట్టి నట్టిదైత్యుని జావఁదిట్టంగఁ
గల్గియు నాయాజ్ఞఁ గనమి నుడిగె
దనుజు నేఁ ద్రుంచి తన్ గొని చను టుచితమం
చనిలజుతోడ శానసుచుఁ బలికె
ప్రజ్వలదగ్నిలోఁ బడి దహింపక తన
మహితపాతివ్రత్యమహిమఁ జూపె
తే. నిట్టి సాధ్విని గుణవతి నిట్టి ముగుద
నిట్టి నిర్దోషి విడచి నే నెట్లు మనుదు

విడుపకుండిన నపవాద లుడుగు లెట్టు
లెట్టికష్టము తుది నావహిల్లె నహహా.

క. మఱి విందుచూలుకలిగిన
తరుణిని సుకుమారి ఘోరతరవిపినములన్
దొఱఁగిన బ్రదుకునొ చచ్చునొ
పరగునె ననుఁబోలుకఠినభావుఁడు జగతిన్. 92

వ. అని బహుశోకతప్తహృదయుండై రాఘవుండు జనాప వాదంబున కోడి సీతయందలి మోహానుబంధంబునువీడి యాసతిని దొఱంగ నిశ్చయించి యనుజన్ముల రావించి వారలతో భద్రునిపల్కుల వివరించి మీరలొండనవల దని వచించి లక్ష్మణు జూచి సీత మునిపత్నులఁ జూడఁగోరెం గాన నామిషచే నీ వాసతిని వాల్మీకాశ్రమంబుచెంత విడచి రమ్మని విధింప నమ్ముప్వురుభ్రాతలు కన్నీరుమున్నీరుగా నేడ్వఁదొడంగి రందు లక్ష్మణుం డలంఘ్యం బగురామాజ్ఞకు వెఱచి బాష్పధారాకలితనేత్రుండై తరలి జానకీమందిరంబున కరిగి. 93

క. అమ్మా వనముల మౌనుల
కొమ్మలఁ గనుఁగొనఁగ నిన్నుఁ గొని చనుమనినన్
నెమ్మి విధించెను రాముఁడు
రమ్మా యిదె రథము వేగి రమ్మని పలుకన్. 94

క. ఆవనిత నిండువేడుకఁ
గావలయుపదార్థమెల్ల కడువడిఁ గొంచున్
వేవేడలె నిల్లు లక్ష్మణు
విపినస్థలులఁ దనరు తాపసాశ్రమములు గనన్. 95

వ. అంత నాసాధ్వి లక్ష్మణునితోఁ రథం బెక్కి పోవుచు నాతండు
ధారాపాతంబుగఁ గన్నీరుఁ గార్చుచుంటయు దుశ్శకునంబు
లనేకంబు లొదవుచుంటయుఁ గాంచి భీతిల్లి సౌమిత్రిఁ గని
యన్నా నీవేల కన్నీరు గార్చెదు నన్నుఁ గొనిచన
రామాజ్ఞ యయ్యెనా లేదా యన నాతండు దుశ్శకునం
బులఁ గని విచారించుచున్నాఁడనన నట్లయిన మరలి యయో
ధ్యకుఁ బోదము రమ్మనుచు నాసతి పల్కి రామాజ్ఞ నతిక్ర
మించు టుచితంబుకాదని పల్కి లక్ష్మణుం డెట్లో యామెను
గంగ దాటించి వాల్మీకాశ్రమంబుచేరువ నాసతిని డించి
యథార్థం బెఱింగింపకుండఁ బోవుట న్యాయంబుకాదని
యాతండు బోరుబోరున నేడ్చుచు సీతపాదంబుల కెరఁగి
యిట్లనియె. 96

క. నినుఁగూర్చి పామరులు సె
ప్పినయపవాదములు రామపృథ్వీశుఁడు భ
ద్రునివలన విని యిటకు నిన్
గొని చని విడుమంచుఁ జెప్పెఁ గోమలి వినుమా. 97

క. అన మూలము తెగి వ్రాలెడు
ఘనతరవృక్షంబుమాడ్కి క్ష్మాతలమున న
వ్వనితామణి మూర్ఛిల్లఁగఁ
గని లక్ష్మణుఁ డామెఁ దేర్చి కడఁగి యిటులనెన్. 98

చ. గతభవపాప మిట్లు నిను గాఱియఁ బెట్టుచు నున్న దమ్మ యా
క్షితిపతి నీదుసద్గుణవిశేషములెల్ల నెఱింగియుఁ జన
ప్రతతులు సేయునిందలను భావమున న్సహియింపలేక దుః
ఖితుఁ డగు చిట్లుచేసె మది ఖేదము నొందకుమమ్మ మానినీ.

ఉ. లోకులు కాకులోయనెడు లోకహితోక్తి నెఱుంగవా జనా
నీకము నోరువచ్చినటు నిష్ఠురవాక్యము లాడుచుండు ర
స్తోకపతివ్రతామహిమఁ జొప్పడు నీకుఁ గొఱంత లేదు ముం
దేకరణిన్దినంబులు గతించునొ యెప్డొకరీతినుండునే. 100

చ. కలిమియు లేమియన్న యవి కావటికుండలు సుమ్మి రాముఁ
డు౯, దలఁపున నిన్ను నేమఱఁడు తప్పక యెప్పుడొ రాము
చెంతకు౯, జెలువుగ రాఁ దటస్థపడుఁ జేడెరొ క్రమ్మఱ నీకు
నార్తిచే, గలఁగకుమమ్మ పుత్త్రకులఁ గాంచి సుఖించెదవమ్మ
నమ్ముమీ. 101

తే. నిన్ను వాల్మీకి కొనిచని నెమ్మి నరయు
లలనరో సెలవిమ్మని లక్ష్మణుండు
దుఃఖమున మేనుమఱచినతోయజాక్షి
కెరఁగి వీడ్కొని వెన్వగ నేగె నంత. 102

వ. అంత సీతాదేవి కన్నులు తెఱచి చూచి లక్ష్మణుండు తన్ను
విడచియేగు టెఱింగి హాహారవంబులు సేయుచు నిట్లేడ్వ
న్దొడంగె. 103

సీ. హెచ్చెడుఘోరాగ్నిఁ జొచ్చి నేవచ్చిన
సొంపు జనంబు లాలింపలేదొ
బ్రహ్మరుద్రాదులు ప్రస్తుతించుచు నన్నుఁ
బతి కప్పగించు టబద్ధమనిరొ
యనలుండు మత్స్పర్శ నతిపవిత్రుఁడనైతి
నని నన్నుఁ దెచ్చినఘనత వినరొ
నాథుండు నాసద్గుణంబు లెఱింగియు
నిర్దోషి నన్నిట్లు నెట్టు టేలొ

తే. తానె నన్నీరి జనులనిందను వచించి
వేఱ నెట్లైన నన్నుఁ బంపింపరాదె
వట్టియపవాద మేల యివ్వసుధఁ బుట్టె
దైవమా! యెట్టు లీనింద తప్పు నాకు. 104

సీ. కాకుండు మున్ను నన్గలఁచఁ దన్మదము హ
రించినట్టికటాక్ష మేడఁబోయె
నఖిలదిక్కులను నన్నరయంగఁ గపులఁ బం
పించినయభిమాన మేడఁబోయె
నాకొఱ కబ్ధికి నలునిచేతను సేతు
వేర్పఱచిననెన రేడఁబోయె
రావణాదిమహోగ్రరాక్షసవీరుల
నిలనుగూల్చినదయ యేడఁబోయె

తే. నట్టి నీయనురాగ మేమయ్యె నిపుడు
మున్ను నీవెట్లొ నన్గానిపోయె దనెడు
నాసతో నుంటి నిప్డేమి యాస నాథ
యాశ్రితావన! చనునె నన్నడవిఁ ద్రోయ. 105

వ. అని పేరెలుంగున నేడ్వ నారవం బాలకించి వాల్మీకిమహర్షి రయంబున నేతెంచి జానకిఁ గాంచి యాసాధ్వి తనయాపద్వృత్తాంతంబు తెల్ప విని యామునీంద్రుండు కడునొచ్చి యాహా శ్రీరామచంద్రునిపత్నివైన నీకెట్టియాపదవచ్చె నైన నీకు భయంబు వలదు, నేను నీతండ్రియైన జనకుండ ననుకొనుము. నేను నిన్నుఁ బుత్రికాభావంబున రక్షించి నీకొదవఁబోవుసంతానంబును మత్పౌత్రులగతిఁ జూచెద మరల నీకును నీపతికిని సంధానంబగువిధం బాలోచించెద-

వెతలుడిగి నాయాశ్రమంబున కేతెంచి యందు సుఖంబున నుండుము నీ కేకొఱంతయుఁ గల్గదని నాసతికిఁ దన కమండ లోదకం బిచ్చి నేదదీర్చి కొంపోయి తనయాశ్రమంబున నుంచె జానకియుఁ దనపతికి వాటిల్లుజనాపవాదంబు తీఱుట కంటెఁ దనసుఖం బెక్కుడు కాదని తలంచి దుఃఖోపశమ నంబు నొందియుండె నంత. 106

క. అతిరయమున లక్ష్మణుఁ డా
క్షితిపతికడ కేగ నతఁడు సీతఁ దలఁచి యే
గతి నాసతి తనస్థితికిఁ
వెతలొందెనో యనుజ తెల్పవేయని వగవన్. 107

వ. లక్ష్మణుం డన్నపాదంబులఁ గన్నీటిధారలఁ దడుపుచు మ్రొక్కి యిట్లనియె. 108

గీ. మీరు సెప్పినయట్టుల మెలఁత గంగ
యొడ్డున విడిచివచ్చితి నువిదదుఃఖ
మెన్నఁగానేర వాల్మీకియున్నతావు
దాపతం డాదరించు నాతన్వి వేడ్క. 109

శా. అన్నా! సీవెఱుఁగంగఁజాలనిది విశ్వానీకమం దెట్టులుం
డున్నీ యిచ్చనతిక్రమించి మనుజెట్టుల్ భూతముల్ సృష్టిలో
నన్నీ వుండని చోటుకద్దె యెటనైనన్నాన నీకేమి దె
ల్పన్నేర్తుఁ ధరణీజ నీకృపకు నెల్లప్డాప్పెడుఁ బాత్రయై.

క. నీవాసతి యానతినిఁ
భావంబులఁ గాంచుచుండ భయ మేల భవ
ద్దైవికవిధిమూలంబున
నేవిశ్వము నడచుచుండ నేల వగవఁగన్. 111

వ. అని లక్ష్మణుండు బోధింప శ్రీరాముండు శాంతించియుండె నంత. 112

గీ. కొలఁదికాలములోనె యాక్షోణితనయ
పొసఁగ వాల్మీకునాశ్రమంబున మనోహ
రాంగు లైనతనూజద్వయంబుఁ గాంచె
వేల్పు లామోదమున సుమవృష్టి గురియ. 113

క. ఆసుతులకు వాల్మీకి మ
హాసంతోషమునఁ గుశలవాఖ్య లొసఁగి సీ
తాసీమంతిని నరసెఁ
భాసురదయఁ గొఱఁతలేమి వాటిలకుండన్. 114

వ. అంత నాసుతులు దినదినప్రవర్ధమానులై వాల్మీకిమహాముని నుండి సకలవేదశాస్త్రంబులును ధనుర్విద్యావిశేషంబులు నేర్చి వాల్మీకిరచితంబయిన రామాయణంబును నారదుండు యక్షగానంబుగా సమర్చి కుశలవులకు వీణెలమీఁద హృద్యంబుగఁ బాడ నేర్ప నభ్యసించియుండి రంత. 115

క. ఆసాకేతపురంబున
భాసురగతి నశ్వమేధపటుయాగంబుఁ
జేసెడువేడుక భక్త
త్రాసహరుఁడు రాముఁ డుచితరక్షన రెన్. 116

చ. తురగముఁ దెచ్చి లక్ష్మణునితోఁ దగుసైన్యముఁ గూర్చి భూతలిఁ, దిరిగి హయంబుఁబట్టెడు సువీర్ణబలాధికుఁ గూల్చి యొక్కవత్సరమునఁ జేర రమ్మనుచు క్ష్మావిభుఁ డంపఁగ లక్ష్మణాఖ్యుఁ డుద్ధురగతిఁ బోయి యప్రతిహతుండయి తెచ్చె హయంబుఁ గ్రమ్మఱన్. 117

వ. అంత రాముఁడు సకలబంధుమిత్రరాజన్యమునీంద్రవనాట
నిశాటనివహంబులకు యజ్ఞోత్సవంబుఁ జూడరమ్మని జాబు
లంపి వారల రావించి క్రతుదీక్షాపరుం డై యుండఁ దనశిష్య
గణంబులతో వాల్మీకి యేతెంచి కుశలవుల రామాశ్ర
మంబున నలుదిక్కులఁ దాము నేర్చినరామాయణంబు వీణా
పాణులై పాడుచుఁ జరింపుండని నియమింప వార లట్లు
గావించుచుండ. 118

గీ. భరతసౌమిత్రు లాచిన్ని బాలకులను
గాంచి రామునితనయులఁ గా గ్రహించి
రాజభోజనములను వారల కొసఁగుచు
రామకథ వినుచుండిరి రక్తిమీఱ. 119

ఉ. అంతఁ గ్రమంబుగా దశముఖాంతకుఁ డాతనయద్వయంబున
త్యంతముదంబున న్గని తదద్భుతగానము నాలకించి మీ
రెంతయుఁ బ్రీతిఁ బాడుకథ యెవ్వని దెవ్వరు మీర లేవనా
భ్యంతరసీమ రాజిలుదు రయ్యయొవండు వచింపుఁడం చనన్.

మ. వినుమో రాజవరేణ్య యీకథ భవద్విఖ్యాతచారిత్ర మా
మునివాల్మీకి దరిన్వసింతు మతఁడే పోషించు మమ్మున్ బితన్
గనలే దెన్నఁడు మాతకద్దు మిము వేడ్కన్ గాంచ మా
తాతయా, మునితో వచ్చితి మన్న రాముఁడు వరాల్
మోదించి యీవచ్చినన్. 121

క. ఆతనయులు మాకేటికి
భూతలనాథా! వరాలు భక్తియె చాలున్
మాతాత కరుణనిచ్చును
బ్రీతి న్గావలయువస్తువితతుల ననినన్. 122

క. శ్రీరాముం డాకొమరుల
గారవమునఁ దనదుసుతులఁగాఁ గని శత్రు
ఘ్నా రమ్మిటు లని యాతనిఁ
జీరి పలికె నిట్లు చింతఁజెందిన మదితోన్. 123

క. మునివరుఁడగు నావాల్మీ
కునితో భూజాత నిటకుఁ గొనివచ్చి సభా
జనములయెదుటఁ బ్రత్యయ
ము నొకఁటిఁ జేయించు టుచితము మదిఁదలంపన్. 124

క. అని నే మనవినిఁ జేసితి
నని యామునితోడఁ బల్కు యామునిభావం
బును గని వేరమ్మని యా
యనుజుని మారుతిని రాముఁ డంపె న్వేడ్కన్. 125

ఉ. వారటు లేగి మౌనిఁ గని భానుకులాధిపుపల్కుల న్ముదం
బారఁగఁ దెల్ప నామునిప్రహర్షమునన్ బతియాజ్ఞ చొప్పునన్
ధారణిపుత్రి యిచ్చటికిఁ దప్పక యెల్లియె వచ్చునంచు నా
శ్రీరఘువీరుతో ననుఁడు చెచ్చెర నంచు వచించె నంతటన్.

వ. వా రట్లేగి రామునకు విన్నవించి రంత వాల్మీకి తనయాశ్ర
మంబున నున్న సీతాదేవినిమిత్తం బొకశిబికన్ బంప నామె
యారాత్రి కేతెంచి మౌనీంద్రువలన శ్రీరాముని సంక
ల్పంబు విని, యాహా! పట్టంపుదేవినయ్యు సభామధ్యంబున
నిలచి మాటిమాటి కొట్లు పెట్టికొనవలసివచ్చెఁగదా నాపాతి
వ్రత్యం బెట్టిపరీక్షకు లోనయ్యె మున్నె నగ్నిప్రవేశం
బయినప్పుడు నన్ను భళిభళి యని పొగడిన బ్రహ్మాదిదేవత
లిప్పు డేమైరి? పామరపురవాసు లుబుసుపోక చేసెడి దుష్ప్రె

సంగంబుల సర్వజ్ఞుం డై నపతి యింతపాటి సేయునే నేటితో నాకును నావిభునకును ఋణంబు పూర్ణంబుగఁ దీఱి పోయెఁగాఁబోలు నేని త్తఱి నాతల్లియైన భూసతినిఁ జేరుట కంటె నొండుపాయంబు లేదని కన్నీరు మున్నీరుగ నేడ్చి నిదురపట్టక యారేయియెల్ల వేగించి ప్రభాతంబున లేచి శ్రీరాముపాదాబ్జంబుల వ్రలంచి కాలోచితకృత్యంబులు దీర్చి కొని కుశలవకుమారులు కూడరా, మానీంద్రునితోఁ గదలి యజ్ఞవాటిక జేరి నిండుసభామధ్యంబున వెల్గుచున్న శ్రీరామ చంద్రునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి మానీంద్రు చెంత నిలచె నంత. 127

చ. మునివరుఁ డంత లేచి సభముందఱ నిట్లనె, జానకీప్రవ
ర్తనమునుగూర్చి నేసలిపెదఱ ధృతి నొక్క ప్రతిజ్ఞ నామె య
త్యనుపమసాధ్వి కానియెడ వ్యర్థముగాఁ జెడిపోవుఁగాత మ
ద్ఘనతరసత్తపం బిది యథార్థ మటంచు వచింప భీతుఁడై. 128

క. మునివర్యుఁ గాంచి రాముఁడుఁ
జనకజచే నొక్క ప్రతిన సభ్యు లెఱుంగం
బొనరింపఁ జేయ జనములు
విని నమ్మెద రనిన మౌని వెలఁదికిఁ దెల్పన్. 129

వ. అంత సీతామహాలక్ష్మి శ్రీరామునకును మానీంద్రునకును నమస్కరించి భూతలంబుపై దృష్టిఁబరపి నేమనోవాక్కాయ కర్మంబుల శ్రీరామచంద్రునిఁదక్కఁ బతిభావంబునఁ బరు నెఱుంగని పతివ్రతనైనచోఁ దల్లీ నన్ను నీగర్భంబునకుఁ గొంపొమ్మని నుడువఁ దత్క్షణంబ పెటపెటార్భటులతో భూతలంబు విచ్చి యొక్కమహాబిలం బేర్పడి యందుండి

యొక్క దివ్యవిమానంబున ననేకనాగకన్యాసమేతయై భూ
లక్ష్మియే తెంచి కన్నీరుఁగార్చుచు జానకిని దివ్యాంబరాభరణ
భూషితఁ జేసి సుగంధకుసుమధూపదీపాదుల నర్చించి
చూపఱులు మహాశ్చర్యభయవిభ్రమంబుల హాహారవంబులు
సేయ మెఱుపు మెఱసినరీతిఁ దటాలున లోనికి న్బోవ బిలంబు
మూతపడియె నంత. 130

క. అతివిస్మయముగ నీగతి
క్షితిసుత భూతలవిలీనసిద్ధిని బొందన్
మతిసెడి రాముఁడు దుఃఖా
న్వితుఁడై మూర్ఛిల్లి లేచి వెతలొందె నిటుల్. 131

ఉ. హాసతి! హామహీతనయ హాగుణభూషిణి హామనోహరీ
భూసతి నిన్ను నాకొసఁగి పోవునటంచెద నమ్మియుండ నా
వాసిఁ దలంప కిట్లు నినుఁబాపె నికెట్లు మనంగనేర్తు నా
యాసల గాసిచేసి చన న్యాయమె నన్విడనాడి జానకీ. 132

సీ. నీనిమిత్తమెకదా భానుజుతోఁగూడి
యింద్రతనూజు వధించినాఁడ
నీనిమిత్తమెకదా నిఖిలవానరులను
బరగ నల్దెసలకుఁ బంపినాఁడ
నీనిమిత్తమెకదా నీరధిదాటంగ
మించిసేతువును గట్టించినాఁడ
నీనిమిత్తమెకదా నిష్ఠురాపదలోర్చి
రావణాదుల నని వ్రాల్చినాఁడ
తే. నిట్టినీకయి నేఁబడ్డ యెల్లపాటు
లట్టె యేమఱి నాయెడ నలుకఁ బూని

నన్ను విడనాడి యేగితే సన్నుతాంగి
యంచు దుఃఖించి దుఃఖించి యంతలోన. 133

క. ధరణీసతి తనకొప్పని
భర మేఁబాపినయపారభవ్యక్రియకుఁ
సరియగు ప్రత్యుపకారము
జపపుటకాఁబోలు నాదు సతిఁ గొనుటంచున్. 134

శా. కోపాగ్నిచ్ఛట లక్షులన్వెడల నాక్షోణీశుఁ డత్యుగ్రుఁడై
చాపంబుఁ ధరియించి భూవనిత మత్సాధ్విఁ గొనెఁ
జూడుఁడీ, యీపృథ్విఁ శరవహ్నిదగ్ధమయి పోనేపెల్లఁ
దూలించెదఁ, బాపం బంచుఁ దలంపరా దనుచు దుర్వా
రాస్త్రము న్దాల్చినన్. 135

శా. కంపించె న్ధర, వార్ధులింకె, వెసనక్షత్రాళి వ్రాలెఁ, సురల్
పెంపెల్లఁ జెడి, రర్కమండలము దీప్తి న్బాసె, మర్త్యాళి ర
క్షింపఁగా నెవ రింక నంచడలె బ్రహ్మేశాను లేతెంచి శాం
తింపంగాఁగదె రామచంద్ర యని యర్థిన్వేడి రొక్కుమ్మడిన్.

వ. అంత బ్రహ్మ డగ్గరి రామచంద్రా యీవిశ్వంబునకు సృష్టి
స్థితి నాశంబులకుఁ గర్తవైన నీవు కోపింప మాన్పఁగలవా
రెవరు. నీకోపంబునకు సమయంబు ప్రళయంబుగాని యిక్కా
లంబు కాదు కదా నీవు సృష్టించినభూతలంబున కకాలవిల
యంబు నీవే సేసిన నిద్దే సర్వసృష్టి నశింపదే. సీత నీవియోగ
దుఃఖం బింక సహింప నేరక పరమపదంబుఁజేరి నీయాగమ
నంబు నిరీక్షించుచున్నయది దేవరవారిసంకల్పమునకు
వికల్పంబు కలుగనేర్చునే. సీత యిప్పు డంతమొందుటయు
నీసంకల్పమకాదె. సర్వజ్ఞుండవగు మహావిష్ణుఁడవయ్యు

నిమ్మాయామానుషదేహంబు ధరంచినమిష నెఱుంగమి
నటించెదుకాని నీకు గోచరింపనివిషయంబులు మాకు గోచ
రించునే. యీకుశలవులు నీతనూజు లింక సీతయందలి
మోహంబు వీరియం దుంచి మీరానతిచ్చినకాలపరిమితియు
సన్నిహితంబైయున్నయది కాన శాంతింపుండని ప్రార్థింప
రాముండు శాంతించి కుశలవులఁ జేరఁదీసికొనియె లోకంబు
లేకంబుగ సీతామహాలక్ష్మి పాతివ్రత్యప్రభావంబు వేనోళ్లఁ
గొనియాడె. యజ్ఞంబు పరిసమాప్తినొందె సకలబంధులు
స్వస్థానంబులఁ జేరిరంత నపత్నీకుండు రాజ్యంబున కనర్హుండు
కాన శ్రీరాముండు తానేకపత్నీవ్రతుండగుట వసిష్ఠానుమతి
నొకస్వర్ణవిగ్రహంబు సీతాస్వరూపం బమర ఘటింపించి
దానికి ప్రాణప్రతిష్ఠ చేయించి కనకసీతయను నామకరణం
బొనర్చి తద్విగ్రహాన్వితుండై శ్రీరాముండు రాజ్యంబేలు
చుండఁ గొంతకాలంబు సన. 137

ఉ. ఆవల దుష్టుఁడై నలవణాసురుఁ డామధురాపురక్షితిక్
దేవమునీంద్రకోటుల వధించుచు బాధల బెట్టుచున్న వాఁ
డోవసుధేశ! యాదనుజు నుర్విని వ్రాల్చి మముక్ గృ
మతిక్; బ్రోవుమటంచు వచ్చి జనముల్ పరివేదనసేసి
వెండియున్. 138

ఉ. ఆదనుజుండు శంకరపదాశ్రయమొంది మహాత్రిశూలసం
పాదనచేసినాఁడు కరపద్మమునం దదియుండ బ్రహ్మరు
ద్రాదులకైన సాధ్యపడఁ డందున దానిని నింటవీడి స
మ్మోదమునక్ వని న్దిరుగఁ బోవుతఱిక్ వధియింప
నయ్యెడున్. 139

వ. వీఁడు మున్ను మీపూర్వుండగు మాంధాతృనృపాలు నీశూలప్రయోగంబున వధియించె, వీనిఁ బరిమార్చి లోకంబున కమందానందంబుఁ గూర్పవే యని ప్రార్థింప శ్రీరాముండు శత్రుఘ్నుఁ జీరి యాదైత్యుని వధింప నగు నొక మహాస్త్రం బతని కుపదేశించి యారాక్షసుండు త్రిశూలంబు విడచి వనంబున విహరించువేళ వానిన్దాకి వధింపుమని బోధించి సైన్యయుక్తంబుగాఁ బంపనాతం డవ్విధంబున నాదానవు న్దాకి వధించి రామాజ్ఞఁ దద్రాజ్యం బేలుచు మధురాపురంబున నుండె నంత నావల. 140

ఉ. గర్వమదాతిరేకమున గారియ బెట్టుచు నున్నవారు గం
ధర్వులు వారిఁ ద్రుంచి వసుధాభరమార్పుఁ డటంచుఁ
దెల్పఁగా, నుర్విసురాళి రాఘవుని యొద్దకుఁ గేకయుఁ డంప
వారలఁ, బర్వ వధింప నాభరతుఁ బంపెను రాముఁడు ధర్మ
సిద్ధిగాన్. 141

చ. భరతుఁడు సైన్యయుక్తుఁడయి వారక యేఁగి మహోగ్ర
వృత్తి నా, యరులను దాకి కూల్చి ముదమారఁగ నాత్మత
నూజులఁ గుణా,కరులను దక్షపుష్కలుల క్ష్మాస్థలి నేలఁగ
నందు నిల్పి సుస్థిరమతి రాముఁ గొల్వఁ జనుదెంచె మహః
విభవాభిరాముఁడై. 142

తే. లక్ష్మణునికొమరులందు సులక్షణాఢ్యు
నంగదునిగారుపదవిషయంబునకును
జంద్రకాంత దేశమునకుఁ జంద్రకాంతు
రాజులుగఁజేసె దశరథరామమూర్తి. 143

# ఉ త్త ర కాం డ ము.

సీ. ఒకధరామరసుతుఁ డుర్వి మాతాపితల్
బ్రతికియుండఁగఁ జావ వానితండ్రి
తనయుశవముఁ దెచ్చి దశరథాత్మజుమ్రోల
వైచి నీయకృతంబువలన నిట్టి
యన్యాయ మొదవెనం చడలి బిట్టేడ్వంగ
రాఘవుఁడు విస్మయాత్ముఁ డగుచు
దగ వసిష్ఠునిఁజేరి తద్ధేతు వెఱిఁగి శూ
ద్రుం డొకండు తపంబుఁ దొడరిసేయు

తే. ధర్మవైరుధ్యమున విప్రతనయుఁ డీల్గు
టరసి శ్రీరాముఁ డాశూద్రు నవనిఁగూల్ప
క్షితిసురాత్మజుఁ డట్టె సజీవుఁడయ్యె
శూద్రతపసియు మోక్షంబుఁ జూరఁగొనియె.

సీ. శునక మొక్కటి రాఘవునిఁ జేరి తన్ను మ
హీసురుం డొకఁడు నిర్హేతుకముగఁ
గొట్టినాఁడని మొఱవెట్ట రాముఁడు విప్రు
రప్పించి యాతని తప్పుఁగాంచి
కుక్కసెప్పినయట్లు క్షోణీసురుని నొక్క
దేవళంబునకు నధిపునిఁజేసి
పంపఁగా నిది యెట్టిభయదదండనమని
జనము లచ్చెరువంద క్ష్మావరుండు

తే. తెలుపుమని కుక్క నడుగ నేఁదొల్లిభవమున
వేడ్క దేవళ మేలి తద్విత్త మించు
కేమి తింటినో యీజన్మమెనసె నాకుఁ
గుక్క కాకున్నె ముందు కీడుమతి యనియె.

వ. ఇవ్విధంబున సర్వధర్మోచితక్రియలు నెఱవేర్చి భూభారం బెల్ల నిర్వక్రక్రియ నపనయించి సకలమునిజనబంధుమిత్రాది జనంబుల కరుసంబు నింపుచు రాజ్యం బేలుచుండె నంత. 146

క. పదకొండువేలయేం డ్లిటు
సదమలగతి నిండఁబోవుసమయమువఱకున్
ముదమున ధర్మోద్ధరణముఁ
గుదురుపరుచుచుండె నారఘుకులుం డవనిన్. 147

వ. అంత నొక్కనాఁడు బ్రహ్మపంపున యముం డొకవిప్రాకృతి శ్రీరామునిసభ కరుదెంచి రామచంద్రా! నీతో నొక దేవ రహస్యంబుఁగూర్చి ముచ్చటింపవచ్చితి నొరు లెవరు విన కుండ నేర్పాటుఁగావించి మనము మాటాడుతఱి నొరుఁ డెవ్వండైనవచ్చిన వాని శిరచ్ఛేదం బొనర్చెదనని నీవు ప్రతిజ్ఞ చేసి యేకాంతస్థలంబునఁ జేరుదము రమ్మని పల్కిన.

ఉ. శ్రీరఘురాముఁ డంత సభఁ జెచ్చెర మానిపి లక్ష్మణు న్బ రుణ్, జేరఁగనీక వాకిట వసించి సురక్షణసేయుచుండు మం చావవిధించి తానును ధరామరుఁ డొక్కెడఁ గూరుచుండి గూఢఘోరతరప్రసంగముల నొప్ప నొనర్చుచునుండి రీగతిన్.

ఉ. పాఱుఁ డిటుల్ వచించె రఘువర్య! యముండను నేను బ్రహ్మనిం,డా రెడుభక్తి మీహృదయ మారసి రమ్మని పంపె నన్ను ని,ర్ధారుణె నింకనుండ్రొ స్వపదంబును జేరఁగ నేగు దెంతురో, శ్రీరఘువీర! మీదయినచిత్తము సత్కృపఁ దెల్పుఁడం చనన్. 150

చ. అనవిని రాముఁ డిట్లనె మహాత్మ! యిఁక న్వెసరాఁదలంపుక ల్గినయది మాపనుల్ ముగిసె క్షేమముగా జనులున్న వారు

ధ్యాత్రి నిఖిలదుష్టదైత్యులు గతించి రటంచు సరోజజన్మతో
ననుమని పల్కుచుండ విలయాగత హేతువుపుట్టె నంత
లోన్. 151

ఉ. భాసురసత్తపంబు శతవత్సరముల్ ఘటియించి దన్ని దు
ర్వాసుఁడు భోజనార్థమయి భానుకులున్ గనవచ్చి లక్ష్మణుం
డాసభముందు నుండఁగని యాతనితో వెసనాదురాక సీ
తాసఖుతోడఁ దెల్పుమనఁ దద్దయు నమ్రత నాతఁ డిట్లనెన్.

చ. మునివర! రాముఁ డిప్పు డెవో భూరిరహస్యము మాటలా
డుచున్, నను నిటఁ గాపువెట్టెను జనంబులు రావల దంచుఁ
బల్కి నా,మనవి గ్రహించి యించుకశ్రమం బెడఁబాయఁగ
నుండుఁ డిందు నే, నొనరుచుకార్యమైన నిపు డొప్ప ఘటిం
చెదఁ దెల్పుఁ డంచనన్. 153

శా. ఆదుర్వాసుఁ డుదగ్రకోపమున నోరా లక్ష్మణా నన్నుఁ బో
రాదం చాపఁగఁ బద్మజాతుఁడును నేరం డెంతరా నీవు వే
పోదో పోననెదో వచింపుము వెసన్ బోకున్న నర్కాన్వయ
చ్ఛేదం బొనటులన్ శపించెదఁ దపస్సిద్ధప్రతాపంబునన్. 154

క. అన లక్ష్మణుఁ డినకులమె
ల్ల నశించుటకంటె నేనిలన్ మ్రగ్గుట మే
లని తత్క్షణ మారామునిఁ
గనఁ జని మౌనీంద్రురాకఁ గడువడిఁ దెల్పెన్. 155

క. తెలిపిన రాముఁడెదర్ గడుఁ
గలఁగుచు భూసురనికరణిఁ గ్రాలెడుయమునిన్
జెలువముగఁ బంపి మౌనిన్
విలసితగతిఁ బూజసేయ వేగము వచ్చెన్. 156

ఉ. వచ్చి వినమ్రుఁడై మునికిఁ బాద్యము నర్ఘ్య మొసంగి దేవ
మీ, రిచ్చటి కేగుదెంచుటకు హేతు వదేమన నిర్భరక్షుధ
న్నొచ్చి యిటుల్ వెస న్నినుఁ గనుంగొన వచ్చితి నన్న
రాఘవుం, డెచ్చగుభోజనం బొసఁగ నేఁగె మునీంద్రుఁడు
మెక్కి తృప్తుఁడై. 157

వ. అంత శ్రీరాముండు లక్ష్మణునివలన దుర్వాసుండు పల్కిన
భయదోక్తులను విని తన్మూలంబున సౌమిత్రి ప్రాణంబులకుఁ
దెగించి తనకడకు వచ్చుటయుఁ దాఁజేసిన ప్రత్యయంబును
దలంచి లక్ష్మణునిబోలిన యనుంగుఁదమ్ముని వధించి తా మను
టెట్లని దుఃఖంబునఁ దల్లడిల్లుచు నేమియుఁ దోఁపక వసిష్ఠా
దులరావించి వారికి యావద్విషయంబుఁ దెల్ప వార
లిట్లనిరి. 158

తే. ప్రతిన భంగంబుసేయుట ప్రతిభకల్గు
మిమ్ముఁబోలినప్రభులకు మేలుకాదు
తమ్మునిఁ ద్రుంచుటయు నుచితమ్ముకాదు
దెగడుటయుఁ ద్రుంచుటయు సమ మగునుగాన.

క. విడనాడ నొప్పు లక్ష్మణుఁ
దడయక యని మౌనివరులు ధర్మస్థితిగా
నుడువఁగఁ గన్నీరొల్కఁగ
విడివడి దుఃఖించు చవనివిభుఁ డిట్లనియెన్.

శా. అన్నా! లక్ష్మణ! నిన్నుఁబోలినగుణాధ్యక్షు న్గనన్వచ్చునే
యెన్నేనిన్ భవముల్ మహాతప మనుష్ఠింపంగ సిద్ధించినన్
మున్నేఁజేసిన పాపమెట్టిదొ నినున్ గోల్పోవఁ బాలైతినా

సాన్నిధ్యం బిఁకఁ బాసిపొమ్ము విధి యీచక్కిఁ దుదిఁ
వ ర్తిలెన్. 161

వ. అన లక్ష్మణుం డశ్రుపూర్ణ నేత్రయుగ్ముండై యన్నకును మానీంద్రులకును బ్రదక్షిణపూర్వకనమస్కారంబులు ఘటించి వీడ్కొని పరమపదావాసగమనోన్ముఖుండై చయ్యన హృదంబున కేగి తనస్వస్వరూపంబుఁ దలంచి జలంబుల మునుంగ నంత సహస్రరవిప్రకాశంబున శ్రీహరి చతురంశుండగు నాతండు బ్రహ్మాదిదేవతాపరివృతుండై దేవదుందుభులు మ్రోగ నప్సరసలాడ దివ్యవిమానంబున వియత్పథంబునఁ జని వైకుంఠధాముండయ్యె నంత. 162

క. ధీరుఁడు లక్ష్మణుఁ డటు రఘు
వీరునివిధి నాలకించి వెసఁ దక్షిణమే
జేరఁ జనె దివికిఁ దన
నారికయినఁ గనుపడక జనవిభుం డంతన్. 163

ఉ. ఎయ్యెడ కేగెనో హృదయ మెంతయు రోసి పురంబు వీడి యే
మయ్యెనొ లక్ష్మణుండని మహావ్యథఁజెంది యతండు గోము
లిఁ, జయ్యన వ్రాలి శాశ్వతయశస్కరసత్పద మందెనంచుఁ
దా, నయ్యెడ నయ్యెడ న్మనెడునట్టిజనుల్ దెలుపంగ
నార్తుఁడై. 164

వ. ఇంక లక్ష్మణుండు లేనిధరిత్రి నే మననొల్లనని తా వైకుంఠ గమనోన్ముఖుండై భరతు న్జీరి నీవు రాజ్యాభిషిక్తుండవు కమ్మన మహాత్మా నేను మీ వెంబడి వచ్చువాఁడనేకాని

యిందుండువాఁడను గా నన శత్రుఘ్నుఁ రావించి నీ వీరా జ్యంబుఁ గైకొనుమన నాతండు మధురారాజ్యంబు విభజించి యగ్రతనూజుం డగుసుబాహునకు మధురాపురంబును రెండవకుమారుం డగుశత్రుఘాతికి వైదిశాపురంబును బట్టంబుబుగట్టి మీతో రానిశ్చయించికొని వచ్చినాఁడ నన్ను విడనాడకుఁ డన నయోధ్యాధిపత్యంబుఁ గుశునకును గోసలాధిపత్యంబు లవునకు నొసంగి తమనిర్యాణంబుఁ బ్రచురించిన. 165

చ. పురజనులందఱు న్గలసి భూవర! మమ్ముల నింతకాలముం గరుణను బ్రోచి యిప్డు విడఁగాఁ దలపోయుట న్యాయమా ముమ్ముం, దొఱఁగక మీర లేగునతిదుర్లభసద్గతి మాకుఁ గూర్ప సాదరమున మమ్ముఁ గొంచుఁ జన దాశరథీ! కృప సమ్మతింపవే. 166

క. అన రాముఁడు నావెంబడిఁ
జనుదేరఁ దలంచువారు సమ్ముదమారన్
మనమునఁ జింతిలకుండఁగఁ
దనువుల విడనొప్పియుండఁ దగునని పల్కన్. 167

వ. అట్లు వచ్చెదమని సమ్మతించి యయోధ్యావాసులందఱు నేకగ్రీవంబుగ శ్రీరాముని యనుగ్రహంబున మరలఁ బుట్టని చావనిమోక్షపదంబు వచ్చునని హర్షించుచుఁ దమకున్న సర్వస్వముఁ బాత్రులకు దానంబు లిచ్చువారును, భూనిక్షేపంబొనర్చుట సుకృతం బని యట్లొనర్చువారును, నింకఁ దిను

టుండునా యని పంచభక్ష్యంబుల నోపుకొలందిఁ దినుచుఁ బరులకుఁ బెట్టుచుండువారును, నుపవాసవ్రతంబులు లెస్స యని తిను టుడుగువారును, రేబవ లెడతెగక రామనామ స్మరణం బొనర్చుచుండువారును, నిట్లు బలు తెఱంగుల శుభప్రచారులై శ్రీరామునితో బయలుదేర సంసిద్ధులైయుండి రంత. 168

క. వానరదానవవీరులు
భూనాథుని విధము విని నభోగతిని నయో
ధ్యానగరంబును జేరి య
నూనప్రభ వెల్గు బతిఁ గనుంగొని రార్తిన్. 169

వ. కనుంగొని శ్రీరాముని యావద్వృత్తాంతంబు విని రామచంద్రా! నీవులేని యీధరాతలంబున మేము మననేర్తుమే నీతోడ మమ్ము కృపాకరుండవై కొంపొమ్మని వేడ శ్రీరాముం డనిలసుతుఁ జీరి గాఢాలింగనంబు సేసికొని నీవు వజ్రశరీరుండవై మన్నామం బెంతకాలంబు ధాత్రి వ్యాపించి యుండు నంతకాలంబు ధ్రువంబుగనుండి యావల మదనుగ్రహంబున భవిష్యద్బ్రహ్మ వయ్యెదని పల్కి విభీషణు న్గాంచి నీ కాచంద్రార్కంబుగ లంకారాజ్యంబు ధారవోసితిని గాన భూతలంబున నీవు చిరంజీవివై యుండఁదగునని పల్కి జాంబవంతు న్గాంచి నీవు కోరినట్లు నాతోడ రణంబు మత్పునరవతారంబున సిద్ధించునని తెల్పి మైందద్వివిదుల నవలోకించి మీర లమృతపానంబు సేసితిరి కాన నిలుండని పల్కి

యంగదుఁ గిష్కింధాధిపతివై యుండుమని నిల్పి తక్కిన
వారలు కుందకుండ నావెంబడి రండని యానతిచ్చె నంత.

చ. మునివరు లారఘూద్వహుని ముందఱనిల్చి మహాత్మ! నీదువి
ష్ణునిరుపమానరూపముఁ గనుంగొనఁగోరిక కద్దు చూపవే
యన నతిసత్త్వవిత్రమతులై తనరారెడు మీకు విష్ణుదే
వుని గను టెంత మీకనుల ముందుఁ గనంబడు నేఁడతం డనన్.

వ. ఆవాక్యంబుల కఖిలమునికదంబం బమందానందంబునొందెఁ.
వేచి యుండి రాప్రాంతంబులనుండు యావజ్జనంబులు
శ్రీరామనిర్యాణం బవలోకించి యప్రాకృతదివ్యమంగళ
విగ్రహుండగు నామహావిష్ణుదేవునిఁ దమప్రాకృతచక్షు
వులఁ గాంచుభాగ్యం బబ్బెనని యే తెంచి నిరీక్షించుచుండిరి.

సీ. అంతట రాముండు హర్షమనస్కుఁడై
గాఢమౌనవ్రతకలితుఁ డగుచు
భరతశత్రుఘ్నులు పరగఁ బార్శ్వంబులఁ
గపివరుల్ దైత్యు లగ్రస్థలమునఁ
బురజనంబులు వెన్క మునివరులు పిరుందఁ
జూడవచ్చెడు జనస్తోమమవల
వేణుకాహళశంఖభేరీపటహశృంగ
ముఖమహావాద్యముల్ ముందు మ్రోగఁ

తే. గదిలి యినుఁ డస్తమింపంగఁ గడఁగి పశ్చి
మాంబుధికి నేగు వైభవ మమరి యొప్పి
గోమతీహ్రద ముండుదిక్కునకు నడచె
రామచంద్ర మహారాజరాజమౌళి.

వ. ఇట్లు గదలి చనుచుండఁ జతుర్వేదంబులు మూర్తీభవించి కూడ నేతేర, మహాస్త్రశస్త్రసముదాయం బెల్ల జ్యోతిస్స్వరూపంబులఁ గొన్నియు ధూమస్వరూపంబులఁ గొన్నియు వెంబడించి రా, శాంతిదాంత్యాదిషాడ్గుణ్యసంపత్తి ముఖపద్మంబునందుఁ దళ్కొత్త నయోధ్యానగరం బెల్ల రామునిఁ బాసియుండనొల్లక కదలివచ్చుచున్న తెఱంగుదోఁప శ్రీరామచంద్రుండు మందస్మితముఖారవిందుండై గోమతీహ్రదంబుఁ జేరి స్వస్వరూపంబుఁ దలంచి గుభాలున నంబువుల మునుంగఁ దత్క్షణంబ భరతశత్రుఘ్నులును వానరవీరులును బురజనంబులును జలంబుల మునింగి రంత నొకముహూర్తమాత్రంబున.

సీ. శంఖచక్రగదాదిసాధనంబులఁ బూని
బాహుచతుష్కంబు బరగుచుండ
శ్రీలక్ష్మి యురమునఁ జెల్వొంద భూనీళ
లటునిటుఁ బ్రక్కల నమరియుండ
ఘనులు శేషానంతగరుడవిష్వక్సేన
ముఖరులు పరిచారములఘటింప
నజరుద్రసురనాథు లతినమ్రత నిటల
ఘటితకరాబ్జులై కడఁగి నిల్వ
తే. వేయితల లొప్పు శేషాహి విపులశయ్యఁ
గోటిసూర్యప్రకాశంపుధాటి వెలుఁగు
వి దాల్చినవిమాన
రాజ మొక్కటి వెడలెనా హ్రదమునుండి.

క. అడుగో యడుగో శ్రీహరి
వెడలెను నదినుండి యంచు వేడ్క జనంబుల్
గడువిస్మయమునఁ గన్గొని
యెడపక సాష్టాంగముల ఘటించుచు నుండన్.

సీ. భూతలినుండి నభోతలంబువఱకు
బహుళతటిత్ప్రభల్ పర్విన ట్లు
వేయిసూర్యులకాంతి వెడలి యేకంబయి
దశదిశలకు నెగఁదట్టినట్లు
కోటిమతాబాలు కూర్చియొక్కమ్మడిఁ
గాల్పఁ దత్తేజంబు గ్రాలినట్లు
బుడమియం దెపుడును బొడమని యొకదివ్య
కాంతి జగద్వ్యాప్తిఁ గాంచినట్లు

తే. జూపఱకుఁ గన్నుఁదమ్ములు చోద్యముగను
మూఁతవడ శ్రీరమాధిపుపుష్పకంబు
గగనతలమందుఁ దనరారఁ గాంచి జనము
లీవిధంబున నుతిసేసి రేకభక్తి.

దండకము.

ఓంకార వాచోజ్జ్వలానందతేజోమయా!
నమ్రవిజ్ఞాన భక్తప్రపన్న ప్రియా!
మోహకామాది షట్ఛత్రుబంధక్షయా!
నాకలోకామరానీకహార్దాశ్రయా!
రాజితోల్లాసముక్తిప్రకాశాలయా!

యప్రమత్తార్య సంసార కష్టవ్యయా!
నాశదూర ప్రభావోజ్జ్వలచ్ఛిన్మయా!
యవ్యయానందసంధానచంచత్క్రియా!
సర్వసౌఖ్యప్రదా సర్వదా తావకాత్యల్ప సంకల్ప మాత్రం
బునఁ గర్మసూత్రంబుల న్గూడి యీసృష్టి సర్వం బఖర్వం
బుగాఁజేరి సంధిల్లు వర్ధిల్లు శోషిల్లుఁ దోల్బొమ్మలన్ సూత్ర
ధారుం డటుల్ జీవులన్ గర్మసూత్రంబుచే నాటలాడింతు
నీకొప్పు మాన్యుండసామాన్యుఁడై కర్మముల్ గిర్మముల్
దాటి రాజిల్లు స్తబంబు బ్రహ్మంబుగా బ్రహ్మమున్ స్తంబ
మున్గా ఘటింపన్ సమర్థుండ వొక్కప్పుడు న్నీకసాధ్యంబు
బాధ్యంబు లేదీ జగజ్జాలముల్ నీవె యాధారమై దండలో
దారమందుండు పూసల్బలెన్ వర్తిలున్ నీవు నిత్యుండవై
యాదిమధ్యాంతశూన్యుండవై సర్వవిజ్ఞానశక్తిప్రపూర్ణుం
డవై శాశ్వతానందయుక్తుండవై ధాతవై సౌఖ్యసంధా
తవై నేతవై నిస్సమానాధిక ప్రజ్ఞతో నేరికిన్గానరాకుం
నంతర్బహిర్వ్యాప్తి సర్వంబునందుండు . నీయాజ్ఞ లేకుం
నాకైన నల్లాడ దణ్వంశమై మింటికంటె న్మహాత్మై నిరా
కారివై నిర్మలాకారివై శుద్ధనైర్గుణ్యమై దివ్యసాద్గుణ్యమై
యుండు నీసత్ప్రభావంబపారంబు బ్రహ్మాదులు న్నేర రెన్నంగ
నీదైన యాథార్థ్యము న్గానఁగాలేకయున్ జ్ఞానవైరాగ్య
భక్తి ప్రపత్తి ప్రభాయుక్తు లొక్కొక్క రొక్కొక్కరీతిన్
స్వరూపాభిధానంబు లన్నెట్టి కన్పట్టకున్నట్టి బల్దిట్టవౌనిన్ను

లోఁబట్టియత్వేంద్రియానందమున్నెట్టి యిక్కట్టులన్ సైచి
యెట్టెట్టులో పుట్టుకల్ గిట్టుకల్లేని గట్టెక్కి నీపట్టునన్ జేరు
చుండ్రింక మూఢుల్ మహాగాఢమౌ నీదుమాయావి
మోహంబున న్గూలి కన్నందఁగారాని విన్నాణినిన్ బొందు
మార్గంబునన్ బోక తాత్కాలికాల్పాస్థిరానందదంబైనయీ
దేహసౌఖ్యంబె ముఖ్యంబటం చెంచి యెల్లప్పుడున్ స్వేంద్రి
యానందసంధానులై పాపబంధాళిలో వ్రాలి యీజన్మ
మృత్యుప్రవాహంబులోఁ గూలి పారంబు నుట్టంగ లేకుం
డ్రింక న్గొంతతీసంసృతిన్గూలియున్ గొద్దియో గొప్పయో
యల్పసౌఖ్యంబుల న్గాంచుచుండ్రన్యులా కించిదానందమై
నన్గనన్ లేక కష్టంబుతోఁ గాలమున్ బుచ్చుచుండ్రిట్లు భూతం
బులందత్యగాధంబుగా భేదముల్ తోఁచుచుండు న్గదా జీవు
లెల్లన్ ద్వదీయాంశలై నిత్యులై జ్ఞానసందీప్తులై నీవు
వానిన్ సమత్వంబునన్ జూచుదేవుండవై యుండ నవ్వానికీ
కర్మభేదానుబంధంబు లేలీల సంధిల్లెనో యన్న నీకర్మభేదం
బులున్గూడ జీవాళితోపాటు నారంభశూన్యంబులై జన్మ
జన్మంబుకున్ బ్రాతకర్మంబులోఁ గొంత భుక్తంబగున్
నాత్మకర్మంబు ప్రాప్తంబగున్ గర్మమిట్టుల్ ప్రవాహోప
మంబై విశేషంబు నీభక్తివిజ్ఞానముల్ కల్గినన్గాని నిర్జింప
రాకుండు నంద్రట్టులైయున్నఁ గర్మావశంబై జడప్రాయమై
స్వస్వతంత్రక్రియాహీనమై యుండు జీవాళికిన్ వేదశాస్త్రాను
బోధంబులిందున్ యమోద్దండదుర్వారకాపత్తులందున్

విధింపన్ ఫలంబేమియన్నన్ జగజ్జీవులందున్ స్వతంత్ర
క్రియాశక్తియున్నీవు సంధించి యున్నాఁడ వద్దానిచే జీవి
యెప్డున్ స్వతస్సిద్ధవిజ్ఞానమార్గంబునన్ బోవ యత్నించెడున్గాని
పూర్వాఘముల్ జ్ఞానమున్గప్పి సద్యత్నజాలంబులన్ సాగ
నీకుండుఁ దత్పాపముల్ తీఱుతోడన్ బ్రయత్నంబు లీడేరు
నీలీలఁ బూర్వాఘముల్ కొద్దిగానుండు నవ్వానిజ్ఞానప్రభల్
గొప్పగాఁ బాపముల్ గొప్పగానుండునవ్వాని జ్ఞాన ప్రభల్
కొద్దిగా నిట్లు నల్పాధికాఘంబులన్బట్టి జీవాళికిన్ గర్మ
భేదంబు లొప్పారునంచున్ బుధుల్ పల్కుచుండ్రేది
యెట్లో యథార్థస్థితిన్ గాంచ నెవ్వారికా నీవిచిత్రక్రియా
రాశికిన్ గారణంబుల్విమర్శింప మేమెంత మాశక్తియుక్తి
క్రమం బెంత యోజించినన్ గ్రుడ్డికన్నాసినన్విప్పినన్ భేద
మున్నే భవత్సత్కటాక్షంబు మాకబ్బినన్ సర్వనిర్బంధముల్
వాయునే తజ్జగత్సృష్టి రక్షావినాశక్రియల్ నీవు గావించు
పెల్లన్ మమున్ గర్మనిర్బంధమున్ బాపి నీలోనఁ జేర్పంగదా
మాకవశ్యానుభోక్తవ్యమై యెట్లొ మానెత్తిపైఁ బ
యీకర్మబంధావళిన్ మీఱి నీపాదయుగ్మంబులన్ జేరి
సన్మోక్షవారాశిలో నోలలాడంగ మాకెట్లు ప్రాప్తించునో
యట్టిమార్గంబునన్ మమ్ముఁ ద్రిప్పంగదే నీటిబుగ్గ ట్లపాయా
స్పదంబైన దీదేహమంచున్ దదర్థంబు పాపంబులన్
జేయఁగా బోలదంచున్ నిజాత్మ ప్రభోద్ధారణార్థంబు
దేహంబు సత్సాధనంబై యెసంగన్వలెన్గాని యాత్మాభి

వృద్ధిఁ విసర్జించి దేహాభిమానైక దృష్టిఁ బ్రవర్తింప
రాదంచుఁ దెల్లంబుగా గ్రాహ్యమైయుండియున్ మేము
నీయుగ్రమాయాప్రభావంబులోఁ జిక్కి తాత్కాలికంబైన
దేహేంద్రియైక ప్రసక్తిఁ బ్రవర్తిల్లి
నీచింతనన్ బాసి వ్యర్థంబుగాఁ గాలమున్ బుచ్చుచున్నార
మోదేవ యేలా మమున్ బ్రోచు దేవుండవై మమ్ముల
న్మాయలో ముంచెదోతండ్రి! నీమాయ నీవే మరల్పన్వలెన్
మమ్ముఁ బ్రోవన్వలెన్గాని దానిన్దరింపంగ మాకౌనె తండ్రీ!
దురాచారులౌ పుత్రులన్ దండ్రి సన్మార్గమందున్ బ్రవ
ర్తింపఁగావించెడున్గాని వర్జించునే మమ్ముఁ గన్నట్టి నీవే యు
పేక్షింప నెవ్వారి పాలౌదు మయ్యా సదానీవె దిక్కంచు
నీపాదముల్బట్టి యున్నారమయ్యా కృపన్జూడుమయ్యా
భవన్మాయలో ముంపకయ్యా మమున్ భక్తివిజ్ఞానవైరాగ్య
మార్గంబులన్ వర్తిలన్జేసి నీలోనఁ జేర్పంగదయ్యా
మహార్తప్రజాజాలరక్షా సదాభక్తపక్షా యఘధ్వంసదీక్షా
నమస్తే నమస్తే నమః. 178

౫. ఇట్లు సర్వజనంబు లేకంబుగాఁ బ్రార్థించి మ్రొక్కి నాదేవుం
డిప్పుడు మద్దివ్యదర్శనంబు ప్రాప్తించినవారలకుఁ బునర్భవం
బుండదని యానతిచ్చె నంత నాపరమాత్ముం డధిష్ఠించిన
దివ్యపుష్పకంబు బాణవేగంబున మహాకాశపథంబుఁబట్టి
యదృశ్యంబయ్యె నిట్లు పరాత్పరుండయిన శ్రీమహావిష్ణువు
రావణాదిదుష్టరాక్షససంహారంబుఁ జేసి సజ్జనులకు సుఖం

బోనఁగూర్ప భూతలి రామాభిధానుండై జన్మించి మనుష్య ప్రవర్తనం బెట్లుండవలయునో యట్లు జగంబుల కుదాహరణంబు బ్రదర్శించి పరమపదావాసుండయ్యు సర[illegible] యుండై యేకాంతభక్తులకు ధ్యానగోచరుం డగుటెకాక భద్రాద్రియం దప్రాకృతదివ్యమంగళార్చాకారంబున సాక్షాత్కరించి యస్మదాదులకు సదా శరణ్యుండై విరాజిల్లుచుండు. 179

క. ఈవిధమున రామాఖ్యమ
హావిష్ణుపవిత్రసత్కథామృత మవనిన్
శ్రీవిలసిలి త్రిజగజ్జన
పావనకరమై భవోగ్రభంజకమయ్యెన్.

క. తూము శుభాన్వయసీతా
రామాహ్వయమంత్రి భక్తిరంజిలి నీది
వ్యామోదకథ రచించెను
స్వామీ! నీచిత్త మతనిభాగ్యం బింకన్.

సీ. మొదటికూర్పున నీగ్రంథమున సహస్ర
పద్యగద్యంబు లొప్పెనవ్వాలఁ గ్రమముగ
సల్పితిని షోడశోత్తరశతసహస్ర
సంఖ్య నీకావ్య మొంది యెసంగునట్లు.

క. దీనిన్ వినినఁ బఠించిన
ధీనిధులకు నిహపరప్రదీప్తసుఖంబుల్
మానితకృప భద్రగిరి
శ్రీనిలయుఁడు శాశ్వతముగఁ జేకుఱఁ జేయున్.

మాలిని:—

భవభయపరిహారా భక్తరక్షాప్రచారా
భువనసృజనకార్యా ముక్తిసంధానధుర్యా
కవివినుతచరిత్రా క్ష్మాతనూజాకళత్రా
ప్రవిమలగుణధామా భద్రశైలాగ్రధామా. 1०

గద్య. ఇది మంత్రికులోదార రామయకుమార భద్రాచలనివాస తూము సీతారామదాస ప్రణీతంబయిన సీతారామరామాయణకావ్యంబున నుత్తరకాండ కథాసంగ్రహ మేకాశ్వాసము.

సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1940.

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | ఆ. |
|---|---|---|
| అచ్చ తెనుఁగురామాయణము, తిమ్మకవిప్రణీతము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| కాలికోబైండు ... | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శతోనున్నది ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతములోనిది) ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) వావిళ్ల రామస్వామి శాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీద చక్కఁగ మరల ముద్రించినారము ... | 4 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 1 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది. | 4 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 సంపుటములు ... | 6 | 8 |
| డిటో ... 3 సంపుటములు ... | 7 | 8 |
| శ్రీమదాంధ్రభారతము, పద్యకావ్యము:— అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు చేయఁబడియున్నది. | | |
| 7 సంపుటముల ప్రతి ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆ పర్వము ,, ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు „ ... | 2 | 0 |
| శాంతిపర్వము „ ... | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వముగల సంపుటము ... | 3 | 12 |
| శాంతిసప్తకము ... | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు ... | 1 | 0 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విపులమైన పీఠికతో ... | 0 | 4 |
| ఆంధ్రభాషార్ణవము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు— టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము ... | 0 | 2 |
| డిటో టీకానుక్రమణికాసహితము ... | 0 | 6 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, గిల్టుబైండు | 2 | 0 |
| డిటో పాతప్రతి, రఫ్ కాగితములు ... | 0 | 12 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవివిరచితము ... | 0 | 6 |
| కవికర్ణరసాయనము (మాంధాతృచరిత్ర) ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |
| ఆర్టుపేపరు (అత్యుత్తమప్రతి) | 4 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| కాశీఖండము, చక్కనికూర్పు | 1 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | 0 | 4 |
| గట్టుప్రభు ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, (భాగవతములోనిది) సటీక ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు ... | 0 | 8 |
| గయోపాఖ్యానము, రామనామాత్యప్రణీతము ... | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనతర్జుమా, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము ... | 1 | 4 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనకృతము ... | 1 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 0 |
| కాలికోబైండు ... | 1 | 6 |
| తెనుఁగుసమస్యలు | 0 | 2 |
| దశకుమారచరిత్రము, కేతనకవికృతము | 1 | 8 |
| డిటో కాలికోబైండు | 1 | 12 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు | 2 | 0 |
| వోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | 0 | 8 |
| నసభూపాలీయము, అట్టబైండు | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, (ఆంధ్రభారతములోనిది) ... | 0 | 6 |
| లచరిత్ర, ద్విపద, చక్రపురిరాఘవాచార్యప్రణీతము, కాలికో | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్ర | 1 | 0 |
| డిటో కాలికోబైండు | 1 | 6 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | 0 | 6 |
| డిటో కాలికోబైండు | 0 | 10 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు ... | 1 | 6 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవివరకృతము | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 12 |
| డిటో పాతప్రతి ... | 0 | 4 |
| డిటో విద్వాన్, దూసి రామమూర్తిశాస్త్రివిరచిత సురభివ్యాఖ్యానసహితము ... | 3 | 0 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము, శ్రీధరమల్లె వేంకటరామకవి ... | 1 | 0 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 2 | [illegible] |
| మార్కండేయపురాణము, కాలికోబైండు ... | 2 | 0 |
| మొల్లరామాయణము, ఆతుకూరి మొల్ల ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు ... | 0 | 14 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, మదరాసు.